# కలంతో కాలమ్

పత్రికా వ్యాసాలు

జి. వి. సుబ్రహ్మణ్యం
తెలుగు ప్రొఫెసర్, డీన్, స్కూల్ ఆఫ్ హ్యూమానిటీస్
హైదరాబాదు కేంద్ర విశ్వవిద్యాలయం

రజతోత్సవ ప్రచురణ

యువభారతి
సాహితీ సాంస్కృతిక సంస్థ
తిలక్ రోడ్, హైదరాబాదు-500 001

KALAMTO COLUMN - An anthology of essays. Published in Andhra Prabha Daily-written by Dr. G.V Subrahmanyam, Professor of Telugu & Dean, School of Humanities, University of Hyderabad&President, Yuva Bharthi.



యువభారతి రజతోత్సవ ప్రచురణ

ప్రచురణ : 130

ప్రథమ ముద్రణ : అక్టోబరు, 1990

ప్రతులు : 1000

ముఖచిత్రాలంకరణ : శ్రీ శీలా వీర్రాజు

వెల : రూ. 25-00

ముద్రణ :
**పద్మావతి ఆర్ట్ ప్రింటర్స్**
హౌస్ నెం. 1-1-517/B/1
న్యూ బాకారం, గాంధీనగర్
హైదరాబాదు-500 000
Phone : 68413

ముఖచిత్ర ముద్రణ :
**బాలాజీ ఆర్ట్ ప్రింటర్స్**
చిక్కడపల్లి, హైదరాబాదు-500 020.

ప్రతులకు :
**యువభారతి కార్యాలయం**
ఆంధ్ర సారస్వత పరిషత్ భవనములు
తిలక్‌రోడ్, హైదరాబాదు-500 001

ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రులు, మాన్యులు

**డాక్టర్ మర్రి చెన్నారెడ్డి గారికి**

వారి సతీమణి

**శ్రీమతి సావిత్రమ్మ చెన్నారెడ్డి గారికి**

సాదర గౌరవంగా సమర్పితం.

మీతో ఈనాటి పరిచయం కాదు మాది
మా అన్నగారు బిదురు వెంకట శేషయ్యగారు
నారు పోసి, నీరు పోశారు;
మీరు స్నేహశీకరాలు చల్లి పెంచుతూ వస్తున్నారు.

రెడ్డిగారు ఏ గద్దె నెక్కినా, ఏ మంచిపని చేసినా,
ఏ ఉద్యమం నడిపినా, ఏ క్షేత్రం దర్శించినా,
ఏ అడుగు వేసినా, ఏ అభ్యుదయం సాధించినా
సావిత్రమ్మగారి స్నేహశక్తి, దైవభక్తి,
రాగరక్తి, సేవాసక్తి, ఛాయావర్తిగా నిలిచి
చెన్నారెడ్డి గారికి శ్రీరామరక్ష!

కావలసివస్తే తల్లిదండ్రుల కోసం
శరీరాంగాన్ని కోసియిచ్చే త్యాగం
వారు నడిచిన బాట తీరులో
గౌరవంగా నడిచిచూపే శౌర్యం
కొడుకులకు పంచిపెట్టిన సౌభాగ్యం

తల్లి దండ్రులకు కంటిపాపల్లా
కీర్తి పతాకల్లా వెలుగొందే శీలం
కూతుళ్ళకు తిలకంగా దిద్దిన ఆనందం

నిత్యజీవితంలో అమృతఫలాల్లా
అందుకొంటున్న అదృష్టదంపతులు మీరు-

భగవాన్ శ్రీ సత్యసాయిబాబా వారి
పరమప్రేమపూరిత దివ్యాశీస్సులు
మీ కెల్లప్పుడూ ఉండాలని ఆశిస్తూ
'కలంతో కాలమ్'ను అందిస్తున్నాను.

# యువభారతి
# రజతోత్సవ సాహితి

సమాజంలో సాహిత్య చైతన్యాన్ని, సాహిత్య సదవగాహననూ పెంపొందించి, ఉత్తమ సాహిత్యాన్ని సహృదయులకు అందించటంలో కడచిన ఇరవై అయిదేళ్ళుగా యువభారతి నిరంతర కృషిని దీక్షతో సాగిస్తున్నది. 1990 విజయదశమి నుండి 1991 విజయదశమి దాకా యువభారతి రజతోత్సవ సంవత్సరంగా వేడుకలు జరుపుకొంటున్నది. ఈ ఏడాది పొడుగునా విశేష కార్యక్రమాలను, సాహిత్య ప్రచురణలను యువభారతి చేపడుతున్నది.

రజతోత్సవాల సందర్భంగా యువభారతి ప్రజలకు మరింత సన్నిహితం కావాలని, సమకాలీన సాహిత్యాన్ని సమదృష్టితో సమీక్షించి, దానిలోని ఉత్తమ విలువలను వివేచించే కార్యక్రమాలను రూపొందించటంలో వివిధ సదస్సులకు, గోష్ఠులకు, సాహిత్య సమావేశాలకూ ప్రత్యేక రూపకల్పనం చేసి నిర్వహిస్తున్నది. 1990 ఫిబ్రవరి 4 వ తేదీన 'ఈ దశాబ్దంలో తెలుగు సాహిత్యం (1980-1990)' అనే సాహితీ సదస్సు నిర్వహించి, అందులో వక్తలు సమర్పించిన వ్యాసాలను ఒక సంపుటంగా తీసుకొని వచ్చింది. కడచిన నాలుగు నెలలుగా ప్రతి నెలా మొదటి ఆదివారం మధ్యాహ్నం 3 గంటలకు అశోక్ నగర్ నగర కేంద్ర గ్రంథాలయంలో 'సమాలోచనం' అనే పేర సాహిత్య గోష్ఠులను నిర్వహిస్తున్నది.

రజతోత్సవాలను పెద్ద యెత్తున జరపటానికి పెద్దలతో ఒక రజతోత్సవ నిర్వహణ సంఘం ఏర్పడింది. మాన్యులు వాస్తుశిల్పి శ్రీ బి.యన్. రెడ్డిగారు ఎం.పి, ఆ సంఘానికి అధ్యక్షులుగా ఉండటానికి దయతో అంగీకరించారు. త్వరలో కార్యక్రమ వివరాలను ప్రచురించటం జరుగుతుంది.

రజతోత్సవ సందర్భంగా 25 ప్రచురణలను వెలువరించాలని యత్నం. ఈ లక్ష్యం సాధించాలంటే ఎందరి సహాయమో కావాలి. యువభారతి గౌరవ సభ్యులు, జ్ఞానపీఠ పురస్కార గ్రహీత, తెలుగు విశ్వవిద్యాలయ ఉపాధ్యక్షులు అయిన ఆచార్య సి. నారాయణరెడ్డిగారు తెలుగు విశ్వవిద్యాలయం పక్షాన ఏడు వేల అయిదు వందల రూపాయల విరాళాన్ని ప్రచురణల సహాయార్థం దయతో అందించారు. వారికి, తెలుగు విశ్వవిద్యాలయం వారికి యువభారతి కృతజ్ఞతలు. వితరణశీలురైన దాతలను సహాయంకోసం యువభారతి అర్థిస్తున్నది. యువభారతికి అందించే సహాయం ఉత్తమ సాహిత్యపు విలువలకు మీరిచ్చే చేయూత!

**జి. వి. సుబ్రహ్మణ్యం**

అధ్యక్షుడు.

**ఆచార్య సి. నారాయణరెడ్డి**
ఎం.ఎ., పిహెచ్.డి., డి.లిట్.
ఉపాధ్యక్షులు
**తెలుగు విశ్వవిద్యాలయం**

కళాభవనం,
సైఫాబాదు
హైదరాబాదు - 500 004.
తేది : 12-2-90

# కదలికలు

ఎందరెందరో రచయితలను పీఠికల కెక్కించిన ఆచార్య సుబ్రహ్మణ్యంగారి పుస్తకానికి పీఠికగానీ, అభిప్రాయ వాటికగానీ నిజానికి అవసరం లేదు; ఆయన నన్ను గౌరవించాలని ఈ నాలుగు మాటలు వ్రాయమన్నారు తప్ప.

ఈ సంపుటిలో ఒక్కటి తప్ప మిగతావన్నీ ఆంధ్రప్రభ దిన పత్రికలో "కాలమ్" నిబద్ధతతో 1985 లో వెలువడ్డవే. సుబ్రహ్మణ్యంగారు లోతైన పరిశీలకుడిగా ఎత్తైన సమీక్షకుడిగా తెలుగు సాహితికి తెలుసు. అయితే ఈ సంపుటిలోని వ్యాసాల తీరు వేరు. వీటిలో కొన్ని కేవల చమత్కారంగా, కొన్ని వస్తు సముదారంగా, మరికొన్ని ఉభయ గుణాల సమాహారంగా వున్నాయి. "విమర్శ - పారిభాషిక పదజాలం" చిన్న వ్యాసమైనా కొన్ని మౌలిక ధాతువులను కుమ్మరించింది. అలాగే అప్పుడెప్పుడో నేనన్న "నడక నా తల్లి - పరుగు నా తండ్రి" అనే రెండు మాటల్ని పట్టుకుని వాటికి నిర్వచన గురుత్వాన్ని ముడివేసి సుబ్రహ్మణ్యంగారు సాగించిన చర్చ ఎంతో ఆలోచనీయంగా వుంది. చిత్రమేమిటంటే నా రచనల్లోని నిర్వచనాల గురించి వ్యాఖ్యానిస్తూ ఆయన అలవోకగా అనేక నిర్వచనాలను ఆరబోశారు. ఇరవై నాలుగవ పుట నిండా వున్నవి ఇవే.

పత్రికల్లో వార్తాంశంగా ఉన్న విషయాన్ని తీసుకుని సుబ్రహ్మణ్యం గారు దాన్ని వివిధ కోణాల్లోంచి మలచుకున్న తీరు మెచ్చుకోదగింది. తెలుగు విజ్ఞాన పీఠం గురించి వ్రాస్తూ ఆయన చేసిన ముగింపు ప్రవచన స్థాయిని అందుకుంది. ఉదాహరణలు పోగుచేసే ధోరణికి నేను చాలా దూరం ఉండేవాణ్నయినా ఓ నాలుగు పంక్తులు ఇక్కడ ఉటంకించ కుండా ఉండలేకపోతున్నాను.

"పొదుపు కోసమే పీఠం వెలిస్తే పొదుగు కోయకుండా పాలు పిండే నేర్పు కావాలి. పునర్వికాసం కోసమే పీఠం వెలిస్తే పిండి కొద్దీ రొట్టె అనే సామెతను నెమరువేసుకోవాలి. పీటకు ఎన్ని కాళ్ళుంటాయి అన్నది కాదు మీమాంస. పీట మీద ఎన్ని ఆశలకు, ఆశయాలకు పట్టాభిషేకం జరుగుతుందనేదే ఆకాంక్ష." (పుట 89)

సుబ్రహ్మణ్యం గారి విమర్శ వ్యాసాల్లో చాలావరకు ఆలంకారికత, పారిభాషిక పద బంధురత దట్టంగా ఉంటాయి. ఈ వ్యాసాలు ఆ కోవ లోనివి కావు. పుస్తకం శీర్షికే అందుకు సంజాయిషీ చెబుతుంది. అయితే ఇవి పత్రికావ్యాసాలైనా సరళ పఠనీయంగా వుంటూనే పరమ మననీ యంగా రూపొందాయి. సాహిత్య విద్యార్థులకూ సమకాలీన విషయావ గాహన జిజ్ఞాసువులకూ ఎంతో ఉపయోగకరంగా వున్న ఈ గ్రంథాన్ని ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రి డా॥ మర్రి చెన్నారెడ్డి గారికి, శ్రీమతి సావి త్రమ్మ చెన్నారెడ్డి గారికి అంకితం చేస్తున్నందుకు సంతోషం. సుబ్ర హ్మణ్యం గారు తమ కలంతో సృష్టించిన కదలికలు తెలుగు భారతికి మరికొంత చైతన్యాన్ని కలిగిస్తాయని ఆశిస్తున్నాను.

# అభినుతి

**పొత్తూరి వెంకటేశ్వరరావు**
ఎడిటర్, ఆంధ్రప్రభ

కొన్ని పుస్తకాలకు పరిచయాలతో గాని, పీఠికలతో గాని పనిలేదు. "కలంతో కాలమ్" అటువంటి పుస్తకాలలో ఒకటి. ఎందుకంటే, ప్రచురణకు పూర్వమే "కలంతో కాలమ్" తెలుగు పాఠకలోకంలో సుప్రసిద్ధం. రచయిత ఆచార్య జి. వి. సుబ్రహ్మణ్యం గారు లబ్ధప్రతిష్ఠులు. నిజానికి ఈ పుస్తకానికి ముందు మాటలైనా, వెనుక మాటలైనా లేనిపోని బరువు మూటలు. ఐనప్పటికీ ఏమైనా రాస్తున్నామంటే అది రచయిత పట్ల గౌరవాన్ని, రచన పట్ల అభిమానాన్ని వ్యక్తం చేయడానికి మాత్రమే.

ఆచార్య జి. వి. సుబ్రహ్మణ్యంగారి పేరు విననివి, ఆయన రచనలు చదవని ఆంధ్ర సాహిత్యాభిమానులు బహుశా ఉండరు. ఆయన బహు గ్రంథకర్త, కేంద్ర, ఆంధ్ర సాహిత్య అకాడమీల బహుమతుల గ్రహీత. ''కలంతో కాలమ్'' సంకలన గ్రంథం. ఇందులోని వ్యాసాలు ''ఆంధ్రప్రభ'' దిన పత్రికలో ధారావాహికంగా ప్రచురితమై విశేషంగా పాఠకుల ఆదరాభిమానాలను పొందాయి. వారం వారం సాహిత్య సంబంధంగా ఏదైనా "కాలమ్" రాయవలసిందని నేను చేసిన విజ్ఞప్తిని పురస్కరించుకొని ఆచార్య జి.వి. సుబ్రహ్మణ్యంగారు 1985 జనవరి మొదలు 1986 జనవరి వరకు ఈ వ్యాస పరంపర రాశారు. వ్యాసాలను "కలంతో కాలమ్" పుస్తకంగా ప్రచురించి నాలుగేళ్ళ క్రిందట పలువురు "ఆంధ్రప్రభ" పాఠకులు కోరిన కోర్కెను తీర్చారు రచయిత.

"కలంతో కాలమ్" వ్యాసాలు సమకాలీన సాహిత్య విశేషాలపై ''రన్నింగ్ కామెంటరీ." కేంద్ర విశ్వవిద్యాలయంలో ఒక కేంద్రమంత్రి గారి ప్రసంగం, బరంపురం సాహిత్య సభలు, ప్రశాంతి నిలయంలో ప్రపంచ సదస్సు, తెలుగు విజ్ఞానపీఠం ఆవిష్కరణ మొదలైన సందర్భాలు "కలంతో కాలమ్"వ్యాసాలకు

వస్తువులైనాయంటే అందుకు కారణం వాటన్నింటిలోనూ వ్యాఖ్యానించ దగిన, విశ్లేషించవలసిన విశేషాలు ఉండటమే.

దినపత్రికలలో "కాలమ్" రాసేవారు ముఖ్యంగా పాఠకులచేత చదివింప చేయడం ఎలాగన్న దృష్టితో రాస్తారు. విషయాన్ని లోతుగా అధ్యయనం చేసి రాసేవారూ, పరిశోధనచేసి రాసేవారూ లేరని కాదు. ఉన్నారు. కాని, అలాంటి వారి సంఖ్య తక్కువ. ఆచార్య సుబ్రహ్మణ్యంగారు పాఠకులచేత చదివింపచేయడ మనే లక్ష్యానికి ప్రాముఖ్యం ఇస్తూనే రచనను విజ్ఞానదాయకం చేయడానికీ, ఆలోచనాత్మకం చేయడానికీ కూడా శ్రద్ధ వహించారు. చదివి వెంటనే మరచి పోయే విధంగా గాక, చదివి జ్ఞాపకం పెట్టుకొనే విధంగా, మళ్ళీ చదవాలనిపించే విధంగా రాసిన వ్యాసాలు కనుకనే వాటిని పుస్తకంగా ప్రచురించడం అవసర మైంది.

తెలుగులో ప్రమాణిక సాహిత్య పత్రికలు లేవనే చెప్పవచ్చు. వార, మాస పత్రికలు ధారావాహిక నవలలను, కథలను, కవితలను ప్రచురిస్తాయి. అవీ సాహిత్యంలో భాగమే. ఐతే, సాహిత్య వ్యాసాలకు అవి అరుదుగా స్థానం కల్పి స్తాయి. పాఠకులకు సాహిత్యం పట్ల అభిమానం లేకపోవడం ఇందుకు కారణమా అంటే అదేమీ కాదు. దినపత్రికలలో ఇటీవల సాహిత్య వ్యాసాల ప్రచురణ ఎక్కువైంది. సోమవారం సంచికలలో ఒక పేజీని పూర్తిగా సాహిత్య వ్యాసా లకు కేటాయిస్తున్నాయి. కాకపోతే, ఆదివారం అనుబంధాలలో సాహిత్య వ్యాసాలు కాస్తంత తగ్గాయి.

సాహిత్యం పట్ల జన సామాన్యంలో అవగాహన, ఆదరణ పెరగడానికి దినపత్రికలలో ఇప్పుడు ప్రచురిస్తున్న సాహిత్య వ్యాసాలు దోహదం చేస్తున్నాయి.

"కలంతో కాలమ్'' వ్యాసావళి ''లైట్ ఫీచర్" కాదు. ప్రతి వ్యాసం లోనూ బరువైన వ్యాఖ్యానాలు ఉన్నాయి. రచయిత అభిప్రాయాలతో భేదించే వారు ఉండవచ్చును గాని వాటిని తేలికగా కొట్టిపారవేసే వారు ఉండరు. "సంగీ తాన్నే విని సాహిత్యాన్ని పట్టించుకొనకపోవడం తెలుగు నాటక ప్రేక్షకుల్లో కానవచ్చే బలహీనత" లాంటి వాక్యాలను దాటవేసి చదువుకొని పోవడం అసాధ్యం. "మంట: వెలుగు" శీర్షిక క్రింద రాసిన వ్యాసంలో "ఆధునిక సాహి త్యంలో నాయకుడైన మానవుడు మంటల్లో బ్రతికే విధానాన్ని అయిదు అంచె

లలో వివేచించవచ్చు" అన్నారు రచయిత. అవి: మంటలను చూస్తున్న మానవుడు, మంటలలో నించున్న మానవుడు, మంటలను మింగుతున్న మానవుడు, మంటలను త్రొక్కుతూ నడుస్తున్న మానవుడు, మండుతున్న మానవుడు. "మంటలను చూసి మహాప్రస్థానం సాగించమని చెప్పింది శ్రీ శ్రీ. మంటలలో నించున్న మనిషిని మహనీయంగా పరిచయం చేసింది దాశరథి. మంటలను మ్రింగుతున్న మానవుణ్ణి వివిధావస్థలలో వ్యక్తం చేసింది ఆరుద్ర, కాళోజీ, సోమసుందర్, కుందుర్తి మొదలైనవారు. మంటలను త్రొక్కుతూ నడుస్తున్న మానవుణ్ణి సాహిత్య క్షేత్రంలో నడిపింపచేసింది దిగంబర కవులు. మంటగా మండుతున్న మనిషిని చిత్రించింది విప్లవ కవులు." అని వివరించా రాయన. "కలంతో కాలమ్" వ్యాసాలలో సూత్రీకరించిన సాహిత్యసత్యా లనేకం ఉన్నాయి. ఏర్చికూర్చిన సూత్ర పదజాలం వ్యాసాలకు ఒక విలక్షణమైన ఆకర్షణను కలిగించాయి. "ఉక్తి అంటే వాగ్వ్యక్తి. కృతులలోని రాగాన్ని ఆలపిస్తే కలిగేది గానరసం, కృతులలోని సాహిత్యాన్ని సమాలోచిస్తే కలిగేది సాహిత్య రసం" లాంటి వాక్యాలు ప్రతి వ్యాసంలోనూ కనిపిస్తాయి.

రాగద్వేషాలకు అతీతంగా వ్యాఖ్యానించగలిగితే అందులో విజ్ఞత ఉంటుంది, విలువలూ ఉంటాయి. అకాడమీల రద్దును పురస్కరించుకొని రచయిత 1985 జులై 2వ తేదీ వ్యాసంలో చేసిన వ్యాఖ్య ఐదు సంవత్సరాల తరువాత సైతం ఆలోచనీయంగా ఉంది. "వస్తుతః అకాడమీలన్నీ కళాఖండాలే. వాటిని అతికి మరొక బొమ్మను తయారు చేయడం జరుగుతుందా? వాటిని కరిగించి మరొక శిల్పాన్ని నిర్మించడం జరుగుతుందా?" అని రచయిత వేసిన ప్రశ్నకు అప్పటి పాలకులు సమాధానం చెప్పలేదు. కనీసం వారు ఆలోచన చేసి ఉంటే అన్ని వర్గాల కళాకారులనుంచి విమర్శలకు గురై ఉండేవారుకారు.

సాహిత్య రంగంలో వివిధ వాదాలపట్ల, సిద్ధాంతాలపట్ల, ఉద్యమాలపట్ల ఆచార్య సుబ్రహ్మణ్యం గారికి సమదృష్టి ఉంది. ఐతే, సంప్రదాయం పట్ల ఆయన అంతరంగంలో కాస్తంత ఎక్కువ అభిమానం ఉన్నదనిపిస్తుంది. "ఉద్యమస్ఫూర్తి పొందని సంప్రదాయవాదుల వ్యక్తిగతమైన కృషి బూడిదలో పోసిన పన్నీరు కాకమానదేమో!" అని ఆయన చేసిన వ్యాఖ్య అంతరంగం నుంచి వెల్లుబికి వచ్చిన ఆవేదనకు అక్షరాకృతి.

"కలంతో కాలమ్" పుస్తకం గురించి అభినుతి చేసే అవకాశం కలిగించినందుకు 'యువ భారతి' వారికీ, ఆచార్య జి.వి. సుబ్రహ్మణ్యం గారికీ కృతజ్ఞతలు.

# ఇదొక ప్రయత్నం

ఆంధ్రప్రభ సంపాదకులు శ్రీ పొత్తూరి వెంకటేశ్వరరావుగారు నన్ను వారి దినపత్రికలో వారం వారం 'తెలుగులో వెలుగు' అనే సీరియల్ శీర్షికక్రింద ఒక 'కాలమ్' నిర్వహించుమని అడిగారు. మొదట తటపటాయించినా తరువాత అంగీకరించాను. తటపటాయించడం ఎందుకంటే పరిశోధన వ్యాసం, విమర్శ వ్యాసం, సిద్ధాంత వ్యాసం, చర్చాగోష్ఠి వ్యాసం మొదలైనవి వ్రాసిన అనుభవం ఉన్నది గాని, నాకు, దినపత్రికలో పత్రికారచనకు - అంటే జర్నలిజం స్వభావానికి- ఒదిగే సాహిత్యవ్యాసం గాని, సమీక్షావ్యాసం గాని వ్రాసే అలవాటు అంతగాలేదు. అందువలన మొదట అనుమానించాను. కాని, తరవాత ప్రయత్నించి సాధనచేసే అవకాశం దొరికిందని భావించి ఒప్పుకొన్నాను. ఒక సంవత్సరం పాటు దాదాపు 27 వ్యాసాలు వ్రాశాను. అందులో 25 వ్యాసాలను ఈ సంపుటిలో ప్రచురిస్తున్నాను. అనుమతించిన ఆంధ్రప్రభకు కృతజ్ఞతలు.

అయిదారేళ్ళుగా దినపత్రికలు సాహిత్యానికి ఒకటి రెండు పేజీలు, రోజులు కేటాయిస్తున్నాయి. దినపత్రికలు చదవకపోతే సమకాలీన సాహిత్యంలో వెనకబడిపోతామన్న స్పృహను సాహితీలోకంలో కలిగిస్తున్నాయి. పత్రికలో వ్యాసం వ్రాయటమంటే సాహిత్య చైతన్యంలో పాలుపంచుకొంటున్నామన్న స్పందనను రచయితలకు కల్పిస్తున్నాయి. నేను మరొకచోట అన్నట్లు పత్రికల పుత్రికలే ఆధునిక సాహిత్య ప్రక్రియలన్నీ. ఇది ఒక ఉద్యమం. 1985 సంవత్సరం ఇటువంటి చైతన్యం ముమ్మరంగా సాగినకాలం. అందులో నేనూ పాలుపంచుకొన్నానన్న తృప్తిని కలిగించాయి ఈ వ్యాసాలు.

ఈ గ్రంథాన్ని వాత్సల్యభావంతో అంకితం తీసుకొనటానికి అంగీకరించిన మాన్యులు ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రి గౌరవనీయ డాక్టర్ మర్రి చెన్నారెడ్డిగారికి, వారి సతీమణి శ్రీమతి సావిత్రమ్మ చెన్నారెడ్డి గారికి కృతజ్ఞతాభివందనాలు.

నాయందలి స్నేహభావంతో తమ అమూల్యమైన అభిప్రాయాలను ఇచ్చి ప్రోత్సహించిన జ్ఞానపీఠ పురస్కార గ్రహీతలు, తెలుగు విశ్వవిద్యాలయ ఉపాధ్యక్షులు ఆచార్య సి. నారాయణరెడ్డి గారికి, ఆంధ్రప్రభ సంపాదకులు శ్రీ పొత్తూరి వెంకటేశ్వరరావుగారికి, రజతోత్సవ ప్రచురణగా అంగీకరించిన యువభారతి వారికి, ముచ్చటగా ముఖపత్రాలంకరణం చేసిన సాహితీ కళాస్రష్ట శ్రీ శీలా వీర్రాజు గారికి, ఈ గ్రంథాన్ని అందంగా ముద్రించిన పద్మావతీ ఆర్ట్ ప్రింటర్స్, బాలాజీ ఆర్ట్ ప్రింటర్స్ వారికి కృతజ్ఞతలు.

హైదరాబాదు
20-10-1990

జి. వి. సుబ్రహ్మణ్యం

# ఇందులో—

# సూర్యుడి పార్టీ—చంద్రుడి పార్టీ

"భోగంమేళాల వంటి కవిసమ్మేళనాల్లో
సంగీతం వింటానికి వచ్చేవాళ్ళు
రమణీయకతే తింటానికి వచ్చేవాళ్ళు
ఇప్పుడు రసం లేదు మా దగ్గర
పూర్వ ప్రబంధ కన్యలందరూ బీర్వాల్లోకి పోయాక
రసమంతా హోల్‌సేల్ రేటుమీద హోటలు వాళ్ళకు అమ్మేశాక
కన్నీళ్ళు పీపాల్తో తీసుకొచ్చాం
కడవలున్న వాళ్ళు ముంచుకోడానికి
మన మధ్యతరగతి మందమతులకు
ఆ మాత్రం తెలివితేటలా?
కడవలు ఇంట్లో మరచి వచ్చారు!
ఎన్ని కడవలు నింపుతారు?"

—కుందుర్తి (తీరా నేను కాస్త ఎగిరిపోయాక)

"వచన కవితా పితామహుడు" వెలార్చిన 'ఉగాది వేదన' ఈ వచన కవిత. నేటి సాహిత్య లోకంలో కొట్టుమిట్టాడుతున్న కొన్ని విలువలను గురించి కవిగా కుందుర్తి కన్నీటితో వ్యాఖ్యానించిన వాక్యజాతం.

సాహిత్యలోకంలో కవిసమ్మేళనాలకు ఒక విశిష్టమైన విలువ ఉంది. సమకాలీన సాహిత్య రంగంలో వివిధ ప్రయోగాలు చేస్తున్న కవుల కావ్యాలను ఒక వేదికమీద వారి ముఖతః సహృదయలోకం వినటానికీ, వాటి వైవిధ్యంలో ఉన్న కవితా కళను తన్మయత్వంతో అనుభవించటానికీ అవకాశం కల్పించే అపూర్వ సన్నివేశాలు కవితా సమ్మేళనాలు. అవి భోగంమేళాలుగా తయారయ్యాయని కుందుర్తి వేదన. భోగం మేళాలు విలాస కేంద్రాలే కాని విజ్ఞాన

ప్రదాలు కావు. ఆహ్లాద దాయకాలే కాని ఆనందప్రదాలు కావు. ఇంద్రియాలను ఉద్రిక్తపరిచేవే కాని తన్మయత్వంతో కూడిన తృప్తిని ప్రసాదించేవి కాదు. అందులో అంగాంగ విన్యాసానికున్న ఆకర్షణ కళానందానికి లేదు.

దీనికి కారణం? కవులా! సహృదయులా? అనే ప్రశ్న తప్పక ఉదయిస్తుంది. ఒకవిధంగా కుందుర్తి దీనికి కారణం సహృదయలోకమనే అంటున్నారు. కవిసమ్మేళనానికి వచ్చే శ్రోతలు కొంతమంది సంగీతం వింటానికి వస్తున్నారట. వీరికి కావలసింది కవి కంఠం. కవి కవిత ఎంత శ్రవణసుభగంగా చదివాడనేదే వారికి ప్రమాణం కవులందరూ తమ తమ కవితలను సభారంజకంగా చదువ గలుగుతారని చెప్పలేము. లయాత్మకంగా, భావ స్ఫోరకంగా అభినయ సుందరంగా, అభివ్యక్తి బంధురంగా చదువగలిగే కవి సభికుల కరతాళ ధ్వనులను అలవోకగా పొందగలుగుతాడు. ఒక్కొక్క సారి ఒకమంచికవిత కవి చదివే విధానం బాగా లేకపోతే ప్రేక్షకుల మన్ననలను పొందలేకపోవచ్చు. అటువంటప్పుడు మంచికవితను వినిపించిన కవిదా లోపం? మనోజ్ఞంగా చదివేపద్ధతిని మన్నించి కవితలోని అంతరార్థాన్ని అందుకోలేని శ్రోతదా లోపం? ఇటువంటి పరిస్థితుల్లో శ్రోతదే లోపం అనక తీరదు.

అయితే కవిసమ్మేళనాల్లో కవితకే కాక, కవి చదివేపద్ధతికి కూడా ప్రాముఖ్యం వుంటుందనేది ఇందులో మరువరాని సత్యం. భావాన్ని రమణీయంగా వ్యక్తం చేయటం కవితలో ఎంత కళో, కవితలోని రమణీయభావాన్ని శ్రోతల హృదయాలకు హత్తుకునేటట్లు చదవటం కూడా అంతకళే. అయితే రానురాను కవుల్లో మొదటిరకం కళకన్నా రెండోరకం కళ కొంతవరకు తక్కువ అని లోకానుభవం స్పష్టంగా చెపుతున్నది. ఇది ఆధునికయుగానికే కాదు అన్ని యుగాలకు సంబంధించిన సత్యమే. అయినా కవి ఎంత బాగా చదివాడన్నది కాక కవి ఎంత బాగా చదివించాడన్నదే కవితకు ప్రమాణం. కవి ఎంత బాగా వ్రాసినా దాన్ని బాగా అర్థం చేసుకోక పోవటం మాత్రం పఠిత లోపం. ఇక్కడ ఒక్క విషయం మాత్రం మరువ రాదు. కవిసమ్మేళనాల్లో రెండు కళలకూ కొంత సమ ప్రాధాన్యం తప్పదు. ఎందుకంటే శ్రోతలు కవితలు వింటానికి వస్తారు. వినటం ముందు మననం ఆపైన. రెండూ ఒకేసారి జరగవలసి వచ్చినప్పుడు మననం

ఆప్యాయంగా సాగాలి. ఏమైనా కవులు కవితలను వ్రాయటంతో పాటు ఆత్మాభి వ్యక్తిని అందించేటట్లు చదవాలని శ్రోతలు కోరతా రన్నది మరచిపోకూడదు. సంగీతాన్నే విని సాహిత్యాన్ని పట్టించుకోక పోవటం తెలుగు నాటక ప్రేక్షకుల్లో కానవచ్చే ఒక బలహీనత. అది కవిసమ్మేళనాల్లో కూడా ప్రతిబింబిస్తున్నదని కుందుర్తి వేదన.

కవిసమ్మేళనాల్లో కవిత కమనీయంగా చదువబడాలంటే కవితాగాన కళపట్ల ప్రత్యేకశ్రద్ధ వహించాలి. ఇది పద్యకవితపట్ల ఎంత వర్తిస్తుందో వచన కవితపట్ల కూడా అంతే వర్తిస్తుంది. భావస్ఫోరకంగా చదువలేని కవులు తమ కవితలను అలా చదవగలిగిన కళాకారులతో చదివించటం ఇంకా బాగుం టుంది. అయితే, అదీ అంత తేలికైనపని కాదు. కవి హృదయాన్ని ఆవిష్కరించే టట్లు చదవటం కూడా గొప్పకళే. ఒకవేళ ఇంత ప్రయత్నం చేసినా శ్రోతలు కొంతమంది చెవులతో వింటారే కాని, హృదయాలతో విన రని కుందుర్తి వేదన. నిజానికి ఇటువంటి వారు సహృదయులు కారు. వినోదంకోసం వచ్చే కాలక్షేప రాయుళ్ళు. జాతిలోని గాఢమైనశీలం లోపించిన తేలికమానిసులు. కవితకు చెవులే కాదు, చేతం కూడా ముఖ్యం.

మరికొంతమంది శ్రోతలు రసాన్నీ, రామణీయకతనూ ఆస్వాదించటానికి వస్తారట! అటువంటి వారికి అందించటానికి 'రసం' మాదగ్గర లేదంటున్నారు కుందుర్తి. అది పూర్వప్రబంధాల్లో ఉండేదట. దాన్నిప్పుడు హోటలువాళ్ళకు హోల్‌సేల్ రేటుమీద అమ్మేశారట. కుందుర్తి ఇక్కడ గడుసుగా చెప్పారు. ఇప్పుడు రసమంటే సాంబారు పక్కన వడ్డించే రసమనే కాని, కావ్యరసమని అర్థమయ్యే వారు చాలా తక్కువ అని వారిభావం కావచ్చు. రసచర్చ ప్రబంధసాహిత్యం వంటి ప్రాచీన సాహిత్యానికి సంబంధించినది కాని ఆధునిక సాహిత్యానికి వర్తిం చేది కాదని కావచ్చు. లేదా రసానుభవం కలిగించే కావ్యాలు వేరు, కలిగించని కావ్యాలు వేరు. రసకావ్యాలు నేడు వ్రాసినా అర్థం చేసుకునేవారు లేరనీ అందు వల్ల ఆ మార్గాన్ని మేము అనుసరించటం లేదనీ కావచ్చు. ఏమైనా ఆధునికులు రసవాదులు కారనీ, భావవాదులూ, భౌతిక వాదులూ, వాస్తవ వాదులూ, వస్తు వాదులూ, అభివ్యక్తి వాదులూ అని కుందుర్తి భావం కావచ్చు. ఇటువంటి

ఆధునిక వచన కవితా కర్తలలో రసరామణీయకాలను ఆశించి వారి కవితలను ఆలోచిస్తే ఆశాభంగం కలుగక తప్పదని స్పష్టమవుతున్నది.

ఆ కుందుర్తియే "కన్నీళ్ళు పీపాల్తో తీసుకొచ్చాం కడవలున్న వాళ్ళు ముంచుకోవటానికి" అని ఎలుగెత్తి చెపుతున్నారు. అయితే మధ్యతరగతివాళ్ళు కడవలను ఇంట్లో మరచివచ్చారట! అందువలన నింపటానికి కడవలు కరువయ్యాయట! వచన కవితలో యథార్థ జీవుల విషాదగాథలు కన్నీళ్ళు. సమాజంలో సామాన్యుడూ, పీడితుడూ పొందే బాధనంతా కవితల్లో వినిపించినా, మధ్యతరగతి ప్రజలు ఆ కన్నీళ్ళను నింపుకునే ఆర్ద్రతను పెంచుకోవటం లేదని కుందుర్తి వేదన. కుందుర్తి కన్నీళ్ళు జీవితంలోని శోకం. కుందుర్తి పేర్కొన్న మధ్యతరగతి ప్రజలు కవిసమ్మేళనాల్లో శ్రోతలుగా కూర్చుండే మేధావివర్గంవారు. వీరే కవితను చదివే సహృదయ లోకం. కవి కవితగా కార్చే కన్నీళ్ళను నింపుకునే కడవలు వాళ్ళ వద్ద లేవంటే సామాన్యుల బాధామయ జీవితాన్ని అర్థం చేసుకుని ఆధునిక కవితలోని సామాజిక స్పృహను అవగాహనం చేసికొనే భౌతిక జీవన దృక్పథం లోపించిందని తాత్పర్యం. ఈ మాటలు కుందుర్తి కోపంతో అన్నవి కాదు. వేదనతో అన్నవని మనం గుర్తుంచుకోవాలి.

ఇందులో నిజానిజాలను గమనించేటప్పుడు మనం కవి భావాన్నీ, కవితాత్మనూ కూడా సానుభూతితో అర్థం చేసుకోవాలి.

"మాలో ఉన్నవీ రెండు పార్టీలే
సంప్రదాయంతో ముడిపెట్టుకున్న
పాతకవులందరూ చంద్రుడి పార్టీ
అతి సామాన్యుణ్ణి ఆదరించే
ఆధునికులు సూర్యుడి పార్టీ
గమ్యం లేని ప్రయాణంలా
పరిధిమీద పరిగెత్తుతున్నా
దరిద్రుల బ్రతుకు కేంద్రాన్ని
దర్శించగలిగిన
కవుల పార్టీ గెలుస్తుంది"(కుందుర్తి-ఉగాది-తీరా నేను కాస్త ఎగిరిపోయాక)

కవులలో రెండు పార్టీలున్నాయని కుందుర్తి కవితామయంగా వ్యాఖ్యానించి చెప్పారు. ఒకరు సంప్రదాయంతో ముడిపెట్టుకున్న పాతకవులు-చంద్రుడి పార్టీ.

మరొకరు సామాన్యుణ్ణి ఆదరించే ఆధునికులు - సూర్యుడి పార్టీ. కవులలో పార్టీ లెప్పుడు ఏర్పడుతాయో, శ్రోతల్లో కూడా పార్టీలుండాలని వారు కోరుకోవటంలో ఆశ్చర్యం లేదు. పార్టీలుండటం ప్రజాస్వామ్య వ్యవస్థలో ఒక ముఖ్యలక్షణం కూడా. ఎన్నికలైతే ఏదోఒక పార్టీ ప్రజాబలంతో ఎన్నికై తన ప్రభుత్వాన్ని ఏర్పరుస్తుంది. సాహిత్యలోకంలో ఎన్నికలు లేవు. కాని, ప్రచారా లున్నాయి. ప్రభుత్వా లేర్పరచటంలేదు కాని ప్రజాహృదయాలలో రాజ్యం చేయటం ఉంది. అయితే, ప్రజలకు సూర్యుడిపార్టీ కావాలనా? చంద్రుడిపార్టీ కావాలనా? అని ప్రశ్నిస్తే కొంతమంది సూర్యుడు కావాలని అనుకోవచ్చు. మరికొంతమంది చంద్రుడు కావాలని అనుకోవచ్చు. మరికొందరు సూర్యచంద్రు లిద్దరూ ఉండా లని అనుకోవచ్చు. అయితే సూర్యుడిపార్టీవారు మాత్రం

"చీకటి లోయల్లో చిందులుతొక్కే చంద్రు డేంగెలుస్తాడు?
"ఏనాటికైనా ప్రభాతపర్వతాగ్రంమీద మెరిసే లోకబంధుడే గెలుస్తాడు"

అని వాదించవచ్చు. అయితే ఏ పార్టీకైనా తన వాదాన్ని ప్రజలకు నచ్చచెప్పే అవకాశం ఉండేకాని ప్రజలను బలవంతాన ఒప్పించే హక్కు లేదు. ఏ పార్టీనైనా కోరుకునేది ప్రజలు. వారికి నచ్చిన పార్టీయే ఉత్తమపార్టీ.

కుందుర్తి సూర్యుడిపార్టీ కవి. ఆయన తన కవితలో కన్నీళ్ళు పీపాలతో తెచ్చాడు. కాని, ఆ నీళ్ళను ముంచుకోవటానికి కడవలు తేవటం మరచిపోయారు మధ్యతరగతి ప్రజలు. అందుకు వారు "మందమతు"లని మాటపడ్డారు. నిజానికి ఈమాట నేటి సహృదయ లోకానికి సామూహికంగా వర్తిస్తుంది. అయితే కడవలు తెచ్చుకున్న వాళ్ళకు ఈమాట వర్తించక పోవచ్చు. అటువంటి వాళ్ళు సూర్యుడి పార్టీవాళ్ళకి కవిసమ్మేళనాల్లో కనపడటం లేదని మనం తొందరపాటుగా అర్థం చేసుకుంటే కుందుర్తి కవితను అర్థం చేసుకున్నవాళ్ళం కాము. అది హెచ్చరిక మాత్రమే!

కవితలో కన్నీళ్ళుంటే పఠితకు కడవలు కావాలా? అన్న ప్రశ్న వెంటనే మనకు స్ఫురించవచ్చు. కావాలని కుందుర్తి వాదం. కవితలోని కరుణను హృదయంలో నింపుకుని జీవితంలో దప్పికైనప్పుడల్లా తాగుతూ ఉండాలి. 'కవిత్వ మొక తీరని దాహం' అని శ్రీశ్రీ అన్నారు కదా! కవితలో కన్నీరంటే ఏమిటి? అయితే అది కరుణరసమైనా కావాలి, లేదా "ఏకో రసః కరుణ ఏవ" అని చెప్పే రసవాదుల సహృదయ రసార్ద్రచిత్తమైనా కావాలి. రసమంటే సంప్రదాయ

వాదుల పార్టీ నినాదమవుతుందేమో! వట్టి కన్నీళ్ళంటే అభ్యుదయవాదుల పార్టీ సంకేతం అవుతుంది. దరిద్రుల బ్రతుకుల్లోని విషాద వేదనా ఘట్టాలను వస్తువులుగా ఎన్నుకొని వారి అతుకు బ్రతుకుల గతుకుల్ని వాస్తవ దృక్పథంతో, సామాజిక స్పృహతో చిత్రించినప్పుడు కవిత కన్నీళ్ళను నింపుకునే, - కన్నీళ్ళను పంచుకునే శక్తిని తప్పకుండా పుంజుకుంటుంది.

అయితే సూర్యుడి పార్టీవారు కవిత అనుభూతి నందించి ఆగిపోరాదని భావిస్తారు. అది మరలా జీవిత రంగంలో వాస్తవ ప్రవృత్తిగా మారాలని ఆశిస్తారు. దరిద్రుల జీవిత విషాద ఘట్టాలను కవితలో విన్న సహృదయులు దరిద్రుల సమస్యలను పరిష్కరించగలిగే సాహస సామాజికులుగా మారాలని ఆకాంక్షిస్తారు. కవిత్వం జీవనవిధానాన్ని తీర్చిదిద్దాలని విశ్వసిస్తారు. సమకాలీన సమాజచిత్రణంతో వెలువడే ఆధునిక సాహిత్యం సామాజికుణ్ణి సమాజావగాహన పెంపొందించుకునే సాంఘిక వ్యక్తిగా మార్చాలని ప్రయత్నిస్తుంది. ఇటువంటి ఉద్యమం సూర్యుడి పార్టీ ఆదర్శం అయితే ఈ పార్టీవారు చంద్రుడి పార్టీని తమకు ప్రత్యర్థిగా భావించి చిత్రిస్తారు. చంద్రుడు కళానుభూతికి ప్రతీక. సూర్యుడు వాస్తవ జ్ఞానానికి ప్రతీక. లోకానికి వీళ్ళిద్దరూ కావాలి. సహృదయునికి వాస్తవ జ్ఞానమూ కావాలి, కళానుభూతీ కావాలి. సూర్యచంద్రు లిద్దరికీ ఈ ఉదయాస్తమయాలున్నాయి. అందులోనూ చంద్రునికిశుక్లకృష్ణపక్షాలున్నాయి.చంద్రుడు స్వయంగా ప్రకాశించేవాడు కాడు. సూర్యుడి తేజస్సే అతని వెలుగు. చంద్రుడు వేడిని వెన్నెలగా మార్చి మనకందిస్తాడు. ప్రజలకు వేడి సత్తువ నిస్తుంది. వెన్నెల జీవితకళను ప్రసాదిస్తుంది. కాంతిని కళగా మార్చుకుంటాడు చంద్రునిలా సామాజికుడు. జీవించుమని చెప్పేది సూర్యుడి పార్టీ. జీవిస్తూ కళా తేజంతో ప్రకాశించుమని చెప్పేది చంద్రుడి పార్టీ. చంద్రుడు చీకటి లోయల్లో చిందులు త్రొక్కుతాడంటే సామాజిక పరిజ్ఞానం లేని స్వీయానుభవంలోనే కొట్టుమిట్టాడు తుంటాడని సూర్యుడి పార్టీవారి వ్యాఖ్య. కళానుభవం ప్రాతిభాసికంగా వెలుగొందే విధానాన్ని రాత్రిపూట చంద్రుడు ప్రకాశించే పద్ధతి తెలియ చెబుతుందని చంద్రుడి పార్టీవారు వ్యాఖ్యానిస్తారు. ఈ రెండింటి తారతమ్యం, ఈ రెండింటి అవశ్యకతా లోకానికి మనం విడమరచి చెప్పకుండానే స్వతస్సిద్ధంగా తెలుసు. సూర్యుణ్ణి సూర్యునిగా చూడటం లోకానికి తెలుసు, అతని కాంతి చంద్రునిలో ఎలా ఆహ్లాదకరంగా ప్రకాశిస్తుందో చూపించగలిగిన వాడు కవి అనీ, అతని కవితలో చంద్రుణ్ణి చూద్దామనీ ప్రేక్షకులు కవిసమ్మేళనాలకు వస్తారు.

లోకం అనుభవాన్ని కోరుతుంది. అవగాహనను ఆదరిస్తుంది. కవితలో కవి తాను ఎన్నుకునే వస్తువును లోకానికి అవగాహన నందించటానికే ఉద్దేశించి నిబంధిస్తే, తనకు తెలిసినదాన్ని నెమరువేసుకుంటునట్లో, తెలియనిదాన్ని తెలుసుకుంటున్నట్లో విని లోకం గ్రహిస్తుంది. బుద్ధి వికసించిన స్ఫూర్తిని పొందుతుంది. ఈ ప్రయోజనానికి లోకం కవితనే ఆశ్రయించనవసరం లేదు. లోకంలో జీవితముంది, శాస్త్రముంది, వినికిడి ఉంది, వివేకం ఉంది. వీటిని ప్రాతిపదికలుగా చేసుకుని చెప్పే వక్తలు ఎందరో ఉన్నారు. కాని, లోకం కవినుండి కోరే దేంటి? అవగాహనను అనుభవంగా మార్చే కళాభివ్యక్తిని. లౌకికసత్యాన్ని కళాసత్యంగా ఆవిష్కరించే ప్రతిభాశక్తిని.

కవి కొత్తగా పుట్టవచ్చు; కొత్త కవితలు వినిపించవచ్చు; కొత్త వస్తువులను బయటకు తీయవచ్చు; కొత్త పద్ధతులను ప్రవేశపెట్టవచ్చు; కొత్త పుంతలను చూపించవచ్చు; క్రొత్తతరాన్ని సృష్టించవచ్చు; వింటున్న లోకం కవితో పాటు కలిసివస్తున్నదైనా తనతోపాటు గతాన్ని మోసుకుని వస్తున్నది. కవికి తన కవితయే తన బరువు. లోకానికి తరతరాల సంస్కృతి స్రవంతి మోసుకుని వచ్చే జీవనధార అంతా తన బరువు. కవి వేదిక ఎక్కి కవిసమ్మేళనంలో కొత్త కవిత వినిపిస్తే సమాజానికి తన జీవన స్రవంతిలో ఒక తరంగం. సమాజం తరంగాన్ని అందుకుంటుంది, తరంగిణిగా స్రవిస్తుంది. కవిసమ్మేళనం సమాజ సంస్కార తరంగాలను జాగృతం చేసి అనుభూతి చర్వణాన్ని అందించే అక్షర స్వర విన్యాసం. ఒక్కొక్క కవి సమాజ సూర్యుని కిరణాన్ని మోసుకుని వెలుగొందుతున్న చంద్రరేఖ వంటి వాడు. కవి సమాజం వినని పాట పాడలేడు. మరచిపోయిన పాటను జ్ఞాపకం చేయగలడు. నిజానికి సూర్యుడు పార్టీ ప్రజలది. చంద్రుడి పార్టీ కవులది, కుందుర్తి మాటలే వినండి—

"ఇవాళ వినిపిస్తున్న నా పాట
ఈ పాట ఎందరో విన్నదే
    అందరూ బాగన్నదే
నేనెంత పిచ్చిగా పాడినా ప్రేక్షకులు వన్స్‌మోర్ అన్నదే
అయితే అడిగే లోకులకు చెప్పే నేను లోకువ
అనాదిగా చూసిందే అయినా ఏరోజుకారోజు క్రొత్తే వేకువ"

(ఆంధ్రప్రభ 21-1-85)

# మినీ కవిత హనీ కవిత

'మినీ కవిత' అనే పేరు వినగానే మనకు రెండంశాలు స్ఫురిస్తాయి. మినీ అనే విశేషణం దాని ఆకృతికీ, రూపానికీ సంబంధించిందనీ, కవిత అనే విశేష్యం దాని స్వభావానికి సంబంధించిందనీ. ఆకృతి లఘువు, స్వభావం స్వాదువు. మినీ కవితని 'సౌదామినీ కవిత' అన్నారు డా॥ సి. నారాయణరెడ్డి గారు.

"మినీ కవిత ఆయుస్సు
మెరుపంత
కానీ, అది ప్రసరిస్తుంది
కాలమంత"

అన్నారు ఆయనే మరోచోట. మినీ కవితలో మెరుపులా మెరిసేది భావాభివ్యక్తి. కలకాలం నిలిచేది భావనాశక్తి.

తెలుగు కవితారంగంలో దాదాపు పదేళ్ళుగా మినీకవిత క్రొత్త ప్రయోగంగా తన వ్యక్తిత్వాన్ని ప్రకటిస్తోంది. ప్రతి ప్రయోగం తన గతంలో నుంచి ఒక క్రొత్తదనాన్ని సృష్టించటానికే పుడుతుంది. దాని తాలూకు గుర్తులు పూర్వ కవితలో కొద్దో గొప్పో కనబడుతున్నా, వాటిని యథాతథంగా గ్రహించకుండా సమకాలీన సాహితీ ప్రయోజనాలకూ, సామాజిక చైతన్యానికీ, అనువుగా మలుచుకుని, వాటికి విశిష్టమైన విలక్షణమైన అభివ్యక్తిని కల్పించుకుంటూ ఉద్యమస్ఫూర్తితో వెలువడుతుంది. మినీకవితా అటువంటిదే. మినీకవిత వచనకవితలో నుంచి పుట్టింది. వచన కవితలోని విస్తృతికీ, అభివ్యక్తిలోని వాచ్యతకూ విసిగిన యువలోకం సంక్షిప్తంగా, బలంగా, వ్యంగ్యంగా భావా విష్కారాన్ని సాధించాలన్న తపనలోనుంచి మినీకవిత పుట్టింది. ఇది వచన కవితకు విరోధి కాదు. కాని, 'అల్పాక్షరాలలో అనల్పార్థ రచన' చేయాలన్న యత్నానికి అభినవరూపం శ్రీ అద్దేపల్లి రామమోహనరావు గారి మాటల్లో—
"వచన కవితలో కేవలం కొన్ని భావాల్ని ప్రచార రూపంగా చెప్పాలన్న వాదం

విశ్వరూపం పొంది, కవితలన్నీ ఒకదాని కొకటి ప్రతిధ్వనులుగా, స్పందన కంటె వర్ణనా, వ్యంగ్యం కంటె వాచ్యతా ఎక్కువైపోయి, భరించరాని విసుగు కలగటం, అనే ఒక ముఖ్యమైన పరిస్థితుల్లో ఏర్పడింది. ఈ పరిస్థితుల్లో క్లుప్తత ముఖ్యమై, ధ్వనికి విపరీతమైన ఆవకాశమున్న మినీకవిత వెంటనే ఆకర్షించ టంలో ఆశ్చర్యం లేదు. కొద్దిలో తమ భావాల్ని తీవ్రంగా చెప్పాలనే యువకుల తపన, మినీ కవితకు బాగా ఒదగటం చేత, ఆ రూపం అపరిమితంగా ఆకర్షణ పొందటం జరుగుతోంది. అటువంటి ప్రత్యేకత ఈ రూపానికి ఉండటం చేతనే, ఒక ఉద్యమమంతటి ఊపుని ఈ మినీ కవిత యువకుల్లో రగిలించింది. గమ నించవలసిన విషయ మేమి టంటే, మినీకవిత తన హ్రస్వత్వంచేత కాదు ఆకర్షించింది. ఒక భావాన్ని బలంగా చెప్పటానికి ఒక క్రొత్త వాహికగా అవత రించటం చేతనే అంత ఆదరణ పొందింది."

మినీ కవిత పుట్టిన తొలి రోజుల్లో దాని అభివ్యక్తి శక్తిని చూచి ఆశ్చర్య పోయిన విజ్ఞులు - అది క్రొత్త ప్రక్రియ కాదనీ, వాల్మీకి 'మా నిషాద' శ్లోకం కూడా మినీ కవితయే అనీ, చాటువులు, సూక్తులు అభ్యుదయ కవుల గేయ ఖండికలు నాలుగైదు చరణాల్లో ఉన్న ఆధునిక కవుల రచనలు, మొదలైనవన్నీ మినీ కవితలే అని వాదించటం మొదలుపెట్టారు. మినీకవితను ఒక వినూత్న ప్రయోగంగా నిర్వహించే కవులు ఈ వాదాన్ని తిరస్కరించారు. చారిత్రక పరిణామాన్ని గమనించి తమ ప్రయోగానికి స్వతంత్ర ప్రతిపత్తిని అంగీక రించండని ప్రబోధించారు. మినీ కవితా స్వరూప స్వభావాలను గురించి సదస్సులు నిర్వహించి, దాని ప్రయోగ ప్రతిపత్తిని స్థాపించారు. ఈనాడు సాహితీలోకం మినీ కవితను ఒక సాహితీ ప్రయోగంగా అంగీకరించింది. పత్రి కలు ఈ ప్రక్రియను బాగా పోషిస్తున్నాయి. యువకవులూ, ప్రౌఢకవులూ దీనిని సమాదరిస్తున్నారు. అయినా, యువ కవుల కలం బలంతోనే మినీ కవిత తన వ్యక్తిత్వాన్నీ, వికాసాన్నీ, మనుగడనూ సాగిస్తోంది. చిత్రకారులు కూడా మినీ కవితలకు చిత్ర వ్యాఖ్యానాలను చేస్తూ, అండదండల నందిస్తున్నారు. సాహితీ సంస్థలూ, రచయితలూ, మినీ కవితా సంపుటులను ప్రచురిస్తున్నారు. మినీ కవిత కోసమే కొన్ని సాహిత్య పత్రికలు కూడా వెలువడుతున్నాయి.

సమకాలీన సమాజ చైతన్యాన్ని సమీక్షిస్తూ సద్యః స్ఫూర్తిగా ఒక వెలుగులాంటి వివేచనను మెరుపులో జిగేలుమనేటట్లు తళుక్కుమనిపించి, దాన్ని ఆలోచనామృతంగా వర్షించి, భావుకుల హృదయాలను రంజింపజేసేటట్లు అభివ్యక్తీకరించటం మినీకవిత ప్రధాన లక్షణం.

"ఊహ తెలిసే వయసులో
పునాదులు త్రవ్వే కూలీలను
చూచి జాలిపడ్డ నేను
ఊహ తెలిసాకా సంపాదించిన
డిగ్రీతో
పునాదులు త్రవ్వే కూలీగా
ప్రజాస్వామ్యపు జీవితంలో
'ప్రమోషన్' తెచ్చుకున్నా".

ఈ కవిత శ్రీ ఎ. వెంకట్రావు వ్రాసింది. శీర్షిక 'ప్రమోషన్'. నిరుద్యోగ సమస్యను నిప్పురవ్వలా చిందించా డీ కవితలో కవి. 'పునాదులు త్రవ్వే కూలీలు' అన్న చరణం మొదలు విన్నప్పుడు 'తాజమహల్ నిర్మాణానికి రాళ్ళెత్తిన కూలీలు' మనకు జ్ఞాపకం వస్తారు. ఆ అభివ్యక్తి సమాజంలో కలిగించిన సామాజిక స్పృహ మన హృదయాల్లో సానుభూతితో కూడిన అవగాహనను జాగృతం చేస్తుంది. ఆ తరువాత డిగ్రీ వచ్చిన గ్రాడ్యుయేట్ 'పునాదులు త్రవ్వే కూలీగా' ప్రమోషన్ తెచ్చుకున్నాడనే అభివ్యక్తి సమకాలీన సమాజ వ్యవస్థ యొక్క పునాదులను త్రవ్వే విప్లవ చైతన్యాన్ని స్ఫురింపచేస్తుంది. సమసమాజ స్పృహ నుంచి, విప్లవ చైతన్యం వరకూ పరిణామాన్ని సాధించిన యువలోక అభ్యుదయ ప్రస్థానం ఈ మినీకవిత వ్యక్తీకరిస్తోంది. ఆకృతికి ఈ కవిత విస్ఫులింగం, ఆలోచన కి కవిత బడబాగ్నికీల.

మినీకవితకు వర్ణన కాదు ముఖ్యం, జీవిత విమర్శ. విమర్శను వివరించి చెప్పటం కాదు దాని లక్ష్యం. వాస్తవంలోని విమర్శను వెలిగించి, వివేకాని కందించటం దానిగమ్యం. 'పేల్చకు' అన్న శీర్షికతో నున్న నా కవిత—

"నీవు
తుపాకి
పేల్చబోతున్నావు
జాగ్రత్త!
ఎటు గురిపెట్టినా
ఏదో ఒక గుండె
నిలువునా
మండుతుంది"

మారణహోమంలో మండే గుండెలను జ్ఞాపకం చేస్తుం దీ కవిత. అహింసా మానవతా వాదాల్లోని మేలిమి నంతా ఒక తుపాకీ గురిపెట్టే లక్ష్యం మీద కేంద్రీకరింపచేసి ఆలోచనను రేకెత్తింపచేస్తుంది. ఇదే వస్తువు ఒక మహాకావ్యానికి ప్రేరణ నివ్వవచ్చు. ఒక్క మినీకవితలో వ్యక్తం కావచ్చు. నేడు యువతకు కావలసింది మహాకావ్యం కాదు. దాని అంతశ్శక్తిని మోసుకుని వచ్చే అణుకావ్యం.

మినీకవితలో భావాభివ్యక్తిని మోసుకుని వచ్చే అంతర్లయ ముఖ్యం. అట్లని రచన నియతగతిలో ఉండాలని అనుకోరాదు. వచనగతిలోనే ప్రతి పాద్యాంశాన్ని పఠిత హృదయంలో ప్రత్యక్షీకరింపచేసి, స్పందింప చేసే ఒక రచనాగతి విన్యాసం ఉంటుంది. శ్రీ 'అలిసెట్టి' కవిత చూడండి.

"సూది
మొన
మీద
ఆవగింజని మోపటం
వృధాశ్రమ
నియంతృత్వపు
తుపాకీ
గొట్టం
పైన
భూగోళాన్ని ఆపటం
భ్రమ"

ఈ కవితలో సూది-మొన-మీద అనేవి మూడు చరణాలు. దానిమీద నిలిపే 'అవగింజ మోపటం' ఒక చరణం వృధాశ్రమ మరో చరణం. అలాగే తుపాకీ-గొట్టం-పైన-అనేవి మూడు చరణాలు. భూగోళాన్ని ఆపటం ఆపై చరణం. 'భ్రమ' అనే పదమొక్కటి ఒక్క చరణం. ఈ నిర్మాణం కవితకు భౌతికాకృతిని కలిగిస్తూనే, భావనలో సూది, తుపాకీల ఆకృతిని నిర్మింపచేస్తుంది. వాటిమీద నిలిచే వస్తువుల విస్తృతిని వ్యంగ్యంగా స్ఫురింపచేస్తోంది. శ్రమ, భ్రమ అనే మాటల్లోని అంతర్లయ, అంత్యప్రాసగా భాసిస్తూనే, అనుభూతిని ఆవిష్కరిస్తోంది. మినీ కవితలో భావాభివ్యక్తికి సంబంధించిన అంతర్వ్యాక్తి, లయ - ఆకృతినీ, చరణవిన్యాసాన్నీ శాసిస్తున్నాయి. రూపవ్యక్తుల సమష్టి లయాత్మక చైతన్య సమాహారమే మినీకవితలోని సౌదామినీ స్వభావం.

మినీకవితలో అంత్య ప్రాసలకూ, శబ్దాలంకారాలకూ ప్రాధాన్యం లేదు. భావాభివ్యక్తికి తోడ్పడినంతవరకే వాటిని క్వాచిత్కంగా, అప్రయత్నంగా కవి వాడుకుంటాడు. అలాగే అలంకారాలను కూడా. మినీ కవితలో అలంకారాలు అలంకారం కోసం కాదు, భావచిత్రాలను రూపొందించటానికి సాధనాలుగా గ్రహించబడుతాయి. శ్రీ ఆర్. సుదర్శన్ 'ఆకలి రాగం' వినండి.

"కడుపు వీణ
ప్రేవు తంత్రులు
మీటి చూడు
వినిపించు
ఆకలి రాగం"

ఇందులో రూపకం రూపుకడుతోంది. కాని, అలంకారం కంటె అభివ్యక్తి శక్తిమంతంగా సాగింది. ఇంతకంటె ప్రౌఢంగా ఉండే మరో కవిత శ్రీ రావి రంగారావు వ్రాసింది.

"విత్తులు
మొలిపిస్తాడు

మొక్కలు
పోషిస్తాడు
తెగులాకులు
తుంచేస్తాడు
మానవుడైనా
త్రిమూర్తుల్ని జయిస్తాడు".

ఇందులో కావ్యలింగం లాంటి అలంకార స్ఫూర్తి ఉన్నా దాన్ని కవి - కవితను అలంకృతం చేయాలన్న స్పృహతో వాడలేదు. భావాన్ని బలంగా చెప్పాలన్న శిల్పానికి అంగంగా వాడుకున్నాడు. సృష్టి స్థితి లయకారకులైన త్రిమూర్తులకన్నా ఆ ఘనుడైన మానవు డెవ్వడు? అనే ప్రశ్న మనకు మిగిలిస్తాడు. పొడుపు కథలా ఉంది కవిత. కవితకు శీర్షిక 'హలాయుధుడు', ప్రశ్నకు సమాధానం దొరికింది. అయినా హలాయుధుడంటే బలరాముడు కాదు, కర్షకుడు. శ్లేష కాదు ఇక్కడ ప్రధానం, విశ్లేషణమే.

మినీ కవితలో సూక్తి చమత్కారం కంటె భావ చమత్కారం దాని సహజమైన వెలుగు జీవితాన్ని పోషిస్తుంది. శ్రీ కె. వాసుదేవరావు—

"జరాభారంతో
కుంగి పోయిన
ఆశ్చర్యార్థకమే
ప్రశ్నార్థకం
అవుతుంది"

అన్నారు. ఇందులో మొదట కనపడేది సూక్తి చమత్కారం. నిటారుగా నిలిచే ఆశ్చర్యార్థకం ముసలితనంతో వంగి ప్రశ్నార్థకంగా మారుతుందని. కాని, దాని వెనుక ఉన్న వ్యంగ్యం వేరు. క్రొత్తగా వచ్చిన ఏ ప్రయోగమైనా మొదట అబ్బురాన్ని కలిగిస్తుంది దాని సృజనాత్మక శక్తితో. అదే ప్రయోగం ముసలిదై, సృజనాత్మకతను కోల్పోతే ప్రజల చేత దీనివలన ప్రయోజన మేమిటి? అని ప్రశ్నింపచేసి కొంటుంది-అని దాని అంతరార్థం. అంటే మినీ కవితలో సూక్తి చమత్కారం భావచమత్కారానికి స్ఫోరకంగా ఉండాలన్నమాట.

ప్రశ్నిస్తున్నట్లుగా మొదలై అనుకోని విధంగా సమాధానం చెపుతున్నట్లుగా సాగి, అంతలోనే ఆగిపోయి ఆలోచనలో మనల్ని ముంచెత్తే అభివ్యక్తి శిల్పం మినీ కవితకు చమత్కారంతో పాటు ఉత్కంఠనూ, ఆసక్తినీ కలిగిస్తుంది. శ్రీ కొప్పర్తి వెంకట రమణమూర్తి 'మహోదయం' చూడండి—

"ఎవరన్నారు
ఒక తూర్పు ఇద్దరు సూర్యుళ్ళని
ప్రసవించదని -?
ఇదుగో ఇటు చూడు
నా ఫాలం కింద
రెండు కళ్ళు
చురుగ్గా
తెరుచుకుంటున్నై"

పైకి చూస్తే పొడుపుకథలా కనపడే ఈ కవిత ప్రగతిపథాన్ని చూచే కొత్తచూపును వ్యక్తీకరిస్తుంది. రెండు కళ్ళు తెరుచుకోవటం సూర్యోదయాలని చెప్పడం ప్రతీకాత్మక అభివ్యక్తి.

సంభాషణాత్మకంగా మినీ కవితను నడపటం కవులు, సాధించిన మరో శిల్పం. దీనిలో ఎంతో వస్తువైవిధ్యం కూడా వెలార్చారు కవులు. ఉదాహరణకు నా కవిత 'అప్పుకూడు'

"ఏం తుపాకీ!
ఆగి ఆగి
అప్పుడప్పుడు పేలుతున్నావ్ ?
అమ్యునిషన్ అయిపోవచ్చింది
ఆ తరువాత ఏంటి గతి ?
కొత్తమందు దిగుమతి అవుతుంది
దిగుమతి కూడా ఆలస్యమైతే
పేలకపోయినా తుపాకీ తుపాకే!

దిగుమతికి ముందు
ఎగుమతు లేమైనా చేశావా?
ఎగుమతికి కావాలి 'ఎగ్జిస్టెన్స్
దిగుమతికి చాలు 'ఎక్స్‌పీరియన్స్''.

దీన్ని వ్యాఖ్యానించ నవసరం లేదనుకుంటాను. సంభాషణ శిల్పం మినీ కవిత కిచ్చిన శక్తి అనల్పం. ఇంగ్లీషు పదాలను తెలుగు పదాలతో కలిపి కీలక స్థానాలలో వాడటం నేటి యువకుల ఉక్తివైచిత్రిలో ఒక హేల!

సామాజిక చైతన్యాన్ని మోసుకుని వచ్చే కవిత క్రమంగా జీవితానుభవాలను చిత్రించటానికీ, సూక్తులను మౌక్తికాల్లాగా రాణింప చేయటానికి కూడా వినియోగింప బడుతోంది. ఒకటి రెండు ఉదాహరణలు :

"మగధీరుడిలో
విశిష్టత ఏమిటి ?
కొంగుపట్టుక తిరగటం -
చిన్నప్పుడు తల్లిది
పెద్దయ్యాక భార్యది" - శ్రీ చల్లా రాధాకృష్ణశర్మ

"కళ్ళకు అద్దుకునే
దేవుడి కొట్టిన
కొబ్బరికాయస్థానం
ఒలుస్తున్నప్పుడు
అరికాళ్ళ సందునే" - శ్రీరాజా

మినీ కవిత మన మధ్యలో బాగా మసలుతున్నది. ప్రయోగగౌరవం బాగా పొందుతోంది. సూక్తిలా కనపడ్డా సూక్తికంటె విలక్షణమైన అభివ్యక్తితో దర్శన మిస్తోంది. జీవిత విమర్శకు అద్దంపడుతోంది, సామాజిక చైతన్యానికి శక్తిమంతమైన సాధనంగా ఉపయోగ పడుతోంది. మహాకావ్యం ఒక వ్యూహం లాంటిది. మినీకవిత ఒక బాణం లాంటిది. దీన్ని ప్రయోగించటానికి కవికి సమాహిత బుద్ధి శక్తి కావాలి, అపూర్వ వస్తువ్యక్తీకరణ సమర్థమైన ప్రతిభ కావాలి. ముంజేతి

కంకణంలో మహాపర్వతాన్ని ప్రతిబింబింపచేసే ప్రజ్ఞ కావాలి. ప్రతి పదాన్నీ సార్థకంగా, సప్రయోజనంగా వాడే మెళుకువ కావాలి. కవితతోపాటు శీర్షికను కూడా ధ్వనిమయం చేయగలిగిన శిల్పం కావాలి. అలా కాక, వ్యంగ్యంకంటె వాచ్యం పాలు ఎక్కువైతే మినీకవితకు వెలుగు మందగిస్తుంది. వ్యాఖ్యానంకంటె ఆఖ్యానం విస్తరించినప్పుడు మినీకవిత పలుచబారుతుంది. గమ్యంకంటె గతి విధానం కదను త్రొక్కినప్పుడు మినీకవిత గేయకవితకు పినతల్లి బిడ్డలా కనబడుతుంది. అంతస్సారాన్ని వీడి అంత్యప్రాసల విద్యగామారితే మన్నన కోల్పోతుంది.

మినీకవిత నేడు నిండు యౌవనంలో ఉంది. పది రకాల చూపులు దాని మీద పడుతున్నాయి. వ్యసనాలు దారి తప్పించే యత్నం చేయవచ్చు. గమ్యం తెలిసి నడిస్తే ప్రయోగంగా మినీకవితకు ప్రయోజనాత్మకమైన ప్రతిపత్తి ఉంటుంది. 'మినీ కవిత' 'హనీకవిత'గా జీవిస్తుంది.

(ఆంధ్రప్రభ 28-1-1985)

# నారక్తం నామతం

సాహిత్యంలో రచయిత యేరచన చేసినా, అది యేదో ఒక ప్రక్రియకు సంబంధించే ఉంటుంది. ప్రక్రియలో ప్రయోగం చేయటం రచయిత ప్రతిభ. ప్రయోగం చేసేవాడికి ప్రమాణం తప్పకుండా ఉంటుంది. ప్రమాణాలు సామాన్యంగా నాలుగు విధాలు. ప్రయోగంగా వెలువడే ప్రక్రియకు అదర్శరూపాన్ని అందించే ప్రమాణం ఒకటి. ప్రయోగంలో చిత్రింపబడే సమస్యకు కళారూపాన్ని అందించే ప్రమాణం మరొకటి. ప్రయోగంలోని ఒక అంశాన్ని ఆకర్షణీయంగా ఆవిష్కరించే ప్రమాణం ఇంకొకటి. ప్రయోగాన్ని ప్రయోగం కోసమే చేసేతీరులోని నేర్పును వివేచించే ప్రమాణం మరింకొకటి. ఈ ప్రమాణాలను ముందే ఎప్పుడో ఏ లక్షణకర్తో నిర్దేశించి ఉంచుతాడనుకోవటం అనుభవసత్యం కాదు. ప్రయోగంచేసే రచయిత ప్రక్రియకు ఒక అభినవశక్తిని, నవచైతన్యాన్ని కల్పించటానికి రూపంలోనూ, స్వభావంలోనూ, అభివ్యక్తిలోను క్రొత్తపోకడలను ప్రవేశపెడతాడు. తనకు ముందున్న ప్రయోగం కంటె తన ప్రయోగం సంశ్లిష్టంగానో, సమన్వయాత్మకంగానో, సమ్మోహనంగానో ఉండాలని యత్నిస్తాడు. ఆ ప్రయత్నంలో ప్రక్రియకు అభ్యుదయ మార్గం లభిస్తుంది. సృజనాత్మక శక్తి చేకూరుతుంది. ప్రక్రియ ప్రవాహంలాంటిది. ప్రయోగం ఒరవడి వంటిది. కొత్త ఒరవడిలో ప్రవహించే ప్రవాహం సాహితీ క్షేత్రంలో పంటకాలువలా ఫలసాయానికి ఉపయోగపడుతుంది.

ఒరవడిని ఒరిపిడి పెట్టి విలువలను వివేచించటానికి వినియోగపడేది ప్రమాణం. విలువ ప్రయోగానికి ప్రాణం. ఒక క్రొత్త ప్రయోగం వెలిసిందంటే ఒక క్రొత్త విలువ సాహిత్య జగత్తులో సాక్షాత్కరించిందన్న మాట. ఆ విలువలను నాలుగు రకాలుగా నిరూపించటానికి యత్నించవచ్చు. ప్రయోగాన్ని ప్రయోగం కోసమే చేసేరచయిత ఆకృతికి సంబంధించిన అభినవరూపాన్ని అందించి భౌతిక విలాసానికి సంబంధించిన విలువను వ్యక్తీకరిస్తాడు. ఏదైనా

KK-2

ఒక అంశాన్ని ఆకర్షణీయంగా ఆవిష్కరించే రచయిత రచనలో ఒక క్రొత్త విలువను వెలువరిస్తాడు. ఒక సమస్య నెన్నుకుని దాన్ని కళామయంగా చిత్రించే రచయిత అభివ్యక్తికి సంబంధించిన విలువను ప్రదర్శిస్తాడు. ప్రయోగానికి ఒక ఆదర్శరూపాన్ని అందింపదలచిన రచయిత పరిణామశీలమైన జీవిత ప్రస్థానం లోని మారుతున్న విలువలకూ, మారని మనుగడకూ తులనాత్మకంగా విలువకట్టే వివేచనాన్ని సాధ్యమైనంత సమగ్రంగా అందించటానికి యత్నిస్తాడు. ఈ నాలు గింటికీ పేర్లుపెట్టుకుని పిలవాలంటే రూప ప్రమాణం, రచనాప్రమాణం, అభి వ్యక్తి ప్రమాణం, ఆదర్శ ప్రమాణం అని పేర్కొనవచ్చు, ఏ కాలంలోనైనా వెలసిన ఏ ప్రక్రియలోని ఏ ప్రయోగానికైనా ఈ విలువల వివేచనం అవసరం. పై నాలుగు రకాల్లో ఆదర్శ ప్రమాణంతో వెలసిన ప్రయోగం ఉత్తమం.

ఆదర్శ ప్రయోగం సమగ్రత కోసం ప్రయత్నిస్తుంది. ఆ సమగ్రత రూపంలోనూ, రచనలోనూ, అభివ్యక్తిలోనూ, జీవితాదర్శ దర్శనంలోనూ సాధించటానికి యత్నిస్తుంది. అయితే ఈ ఆదర్శ ప్రయోగాన్ని సాహిత్యంలో రెండు శాఖలుగా వివేచిస్తుంటారు విమర్శకులు. ఒకటి క్లాసిక్, రెండు ఎపిక్. కావ్య ప్రక్రియలో అయితే వీటిని మహాకావ్యం, ఇతిహాసం అని అంటారు. ఈ శాఖలు కావ్య ప్రక్రియకు మాత్రమే సంబంధించినవని భావించటం సమంజసమే అయినా కావ్యేతర ప్రక్రియల్లో ప్రయోగాలు చేస్తున్న రచయితలు సైతం ఆ ప్రక్రియలను తమ తమ ప్రయోగాల్లో ప్రతిబింబింప చేసుకొనటానికి ప్రపంచ వ్యాప్తంగా ప్రయత్నిస్తున్నారు. నాటక రచనలో, నవలా రచనలో ఈ రెండు ప్రక్రియలూ ఆ యా ప్రక్రియల కనుగుణంగా రూపుదిద్దుకొంటున్నాయి. తెలుగు నాటకాల్లో సాంఘిక సమస్యాత్మక రూపకాన్ని ఆదర్శ ఐతిహాసిక స్వభావంతో నిర్మించిన కీర్తి గురజాడవారి కన్యాశుల్కానికి దక్కుతుంది. ఎన్నుకున్న వస్తువును క్లాసిక్ స్థాయికి తీసికొని పోయిన గౌరవం వేదం వారి ప్రతాపరుద్రీ యానికి చెందుతున్నది. ఇటువంటివి మరికొన్ని నాటకాలు కూడా ఉన్నాయి. ఉదాహరణకు మాత్రం ఈ రెండూ చెప్పుకుంటున్నాం. అలాగే తెలుగు నవలల్లో కూడా ఈ రెండు శాఖలను పండించినవి ఉన్నాయి. ఉన్నవ వారి మాలపల్లి, విశ్వనాథవారి వేయి పడగలు. సాంఘిక చారిత్రక గతిని చిత్రించే ఐతిహాసిక నవలల్లో ఈ రెండూ ఐతిహాసిక స్వభావాన్ని ఆదర్శ ప్రమాణాలతో అందింప గలిగిన కళాఖండాలు. విశ్వనాథ వారి "ఏకవీర" క్లాసిక్ అనిపించుకొన్న కాల్పనిక చైతన్యాన్ని మోసుకొని వచ్చిన కాల్పనిక యుగ నవల.

నవలల్లో 'క్లాసిక్' కావ్యంలా అనుభూతి నిస్తుంది. 'ఎపిక్' జీవిత విమర్శ చేస్తూ విలువలను వివేచిస్తుంది. 'ఎపిక్' కావ్యత్వాన్ని కూడా సంతరించుకుని 'క్లాసిక్' అనిపించుకోవచ్చు. ఆంధ్ర మహాభారతం అట్టి గౌరవాన్ని పొందింది. స్వర్ణోత్సవం చేసికొంటున్న "వేయి పడగలు" కూడా కావ్య గౌరవాన్ని పొందిన ఐతిహాసిక నవలగా మన్ననల నందుకొంటున్నది. 'ఎపిక్'లో కావ్యం ఇముడుతుంది. కావ్యంలో 'ఎపిక్' ఇమడకపోవచ్చు. నవల కావ్యమూ కాదు ఎపిక్కూ కాదు. అయినా ఈ రెండు ప్రక్రియలనూ తనలో ఇముడ్చుకోగలిగిన అభినవ వచన ప్రక్రియ. అలా ఇముడ్చుకో గలగటం దాని ఆదర్శ ప్రమాణమని విశ్వనాథ ప్రయోగం చేసి చూపించారు.

"నవలకు కవిత్వగుణ మబ్బుట 20వ శతాబ్ది సాహిత్యములో ఒక మహా పరిణామము. తెలుగు సాహిత్యములో స్వతంత్రముగ ఈ పరిణామం తెచ్చిన ఖ్యాతి విశ్వనాథది. "వేయి పడగలు కాల్పనికోద్యమ కాలంలో వెలువడిన ఆత్మాశ్రయ కవిత్వశాఖలో ఒక అపురూపమైన కావ్యం"- అని శ్రీ ఆర్. ఎస్. సుదర్శనంగారు ప్రశంసించారు. విశ్వనాథ 'వేయిపడగలను' కావ్య గౌరవంతో ఇనుమడించిన ఐతిహాసిక నవలగా దిద్ది తీర్చారు.

వేయిపడగలలో రెండు వలయా లున్నాయి. ఒకటి సంస్కృతి, రెండు నాగరకత. సంస్కృతి జాతి సంస్కారంలో నుంచి రూపొందిన జీవన విధానం. నాగరకత జీవన విధానానికి సభ్యతాయుతమైన అభివ్యక్తి. ఈ రెండింటికీ సమన్వయం ఉంటే జాతి జీవన వికాసంలో శాంతి వెల్లివిరుస్తుంది. దేశీయమైన సంస్కృతి విదేశీయమైన నాగరకతను అనుసరించినప్పుడు కొన్ని ముందడుగులు వేస్తూనే కొన్ని తప్పటడుగులూ వేస్తుంది. నాగరకతనే సంస్కృతిగా భ్రమిస్తే ప్రమాదానికి గురియై పోతుంది. ముందడుగు అభ్యుదయమో కాదో నిర్ణయించుకోవటానికి గతంలోని విలువల వివేచనం అవసరమవుతుంది. స్వాతంత్ర్య సమరంలో భారతీయ సంస్కృతి మూలతత్వమైన శాంతికున్న విలువను చెప్పేది 'మాలపల్లి'. పాశ్చాత్య నాగరకతా వ్యామోహంలోని భారతీయ సంస్కృతి విలువలను వివేచించేది 'వేయిపడగలు'. సంస్కృతి జాతి అనుభవ కేంద్రాన్ని స్పృశిస్తుంది. నాగరకత అనుభవంకోసం జాతిచేసే ప్రయోగశీలాన్ని వ్యంజింపచేస్తుంది. నాగరకత అనుభవకేంద్రంనుండి పుట్టిన జాతిగతాన్ని వర్తమానంలోకి ప్రవహింపజేస్తుంది. రెండూ రెండు భిన్నవలయాలైతే వర్తమానం సమన్వయం లేక సంక్షోభంగా పరిణమించి జీవనవిధానంలో ఆత్మ చైతన్యాన్ని కోల్పోతుంది. ఆత్మ విస్మృత మవుతున్నప్పుడు జాతి జీవనం అర్థరహిత మవుతుంది.

సంస్కృతితో నాగరకతను ముడివేయటం యుగకర్త చేసే పని. అతనికి పనికి వచ్చే శక్తిమంతమైన సాహిత్య సాధనం ఐతిహాసిక స్వభావంగల ప్రక్రియ.

విశ్వనాథ వేయిపడగల్లో వెలార్చింది వ్యక్తి దర్శనం కాదు. యుగ సంధిలో మానవాత్మ కోరుకునే తత్త్వదర్శనం. గతించిపోతున్న వ్యవస్థ కంటె అందులో అమరంగా నిలిచే దేశీయమైన అనుభవాన్ని ఆయన అన్వేషించారు, వ్యాఖ్యానించారు. చివరకు మిగిలిన అరుంధతి జాతి జీవన విధానంలోని అమృత బిందువు. ధర్మారావు ఆ బిందువు నందుకున్న సంస్కార జీవి.

ఆధునిక కాలంలో యుగాలు దశాబ్దాలుగా దొర్లిపోతున్నాయి. యుగ సంధులు వెంబడించి పరుగెత్తుతున్నాయి. ఒక జీవిత కాలంలోనే పది యుగ సంధులను ఎదుర్కొంటున్న ఆధునిక మానవుడు బ్రదుకు పరుగులోని పర మార్థాన్ని దర్శించలేక పోతున్నాడు. నాగరకతలో సంస్కృతి చెల్లని నాణెంగా విలువను కోల్పోవటం యుగ సంధి లక్షణం. ఆ తరుణంలో మహా రచయితలు జాతిరక్తంలో సంస్కృతి చైతన్యాన్ని నింపుతారు. ఆ చైతన్యాన్ని మోసుకుని వచ్చే రచన ఐతిహాసిక స్వభావాన్ని ధరిస్తుంది. ఆ చైతన్యాన్ని ఒక మతం గానో, ఒక సంప్రదాయంగానో వ్యాఖ్యానించటం ఆ ప్రక్రియా గౌరవాన్ని కించపరచటం. ఐతిహాసంతో ఎన్నుకున్న వస్తువు కాలానికి కట్టుబడేది, ప్రతి పాదించే తత్త్వం పదికాలాల పాటు నిలిచేది. అర్ధ శతాబ్ది తరువాత కూడ 'వేయి పడగలు' అర్థవంతంగా ఉన్నది. అందులోని విశ్వజనీనత అటువంటిది. వేయి పడగలు వేయి పండుగలు చేసికోదగిన రచన.

వేయి పడగలు చదివిన తరువాత విశ్వనాథ చెప్పినదానిని నెమరు వేసు కొంటూంటే - నా మనస్సులో డి. హెచ్. లారెన్స్ మాటలు రింగుమన్నాయి.

"My great religion is a belief in the blood, the flesh, as being wiser than the intellect. We can go wrong in our minds. But what our blood feels and believes and says is always true."

'నా రక్తం నా మతం', 'నా రక్తం నా ధర్మం', 'నా రక్తం నా శీలం' అని విశ్వనాథ గర్జిస్తున్నట్లనిపించింది. వేయిపడగల్లో మిగిలిన ఒక పడగ బుస కొడుతున్న చప్పుడు.

(ఆంధ్రప్రభ 4-2-1985)

# నిర్వచనం - నినాదం

"నడక నాతల్లి
పరుగు నా తండ్రి
సమత నా భాష
కవిత నా శ్వాస"

ఈ మాట లెవరివో తెలుగువారికి ముందుగా వివరించి చెప్పవలసిన పని లేదను కుంటాను. ఈ ముద్ర డా॥ సి. నారాయణరెడ్డి గారిది. వారు మూడు దశాబ్దాల నుంచీ కవితా వ్యవసాయాన్ని సాగిస్తున్నవారు. 1953లో 'నవ్వని పువ్వు' నుంచి 1988లో 'నడక నాతల్లి' దాకా నలభై మూడు ప్రచురణలు వెలువడ్డాయి. పదహారేళ్ళుగా (1968 నుంచి) ప్రతియేటా ఆ సంవత్సరంలో రచించిన కవితల నన్నింటినీ కలిపి ఒక సంపుటిగా ప్రచురించే పద్ధతిని పాటిస్తున్నారు. ఇది వారి కెంతవరకు సౌకర్యమో చెప్పలేము కాని వారి సాహితీ వ్యక్తిత్వ వికాసాన్ని అనుశీలించే విమర్శకులకు మాత్రం ఎంతో సౌలభ్యాన్ని కలిగిస్తున్నది.

నారాయణ రెడ్డి గారు ప్రచురించిన కవితా సంపుటుల పేర్లను గమనిస్తే 1973 నుంచి ఒక విశేషం గోచరిస్తుంది. అది నిర్వచనాల్లాంటి శీర్షికలను కవితా సంపుటుల కలంకరించటం. 'ఉదయం నా హృదయం' (1973). 'మార్పు నా తీర్పు' (1974), 'తేజస్సు నా తపస్సు' (1975), 'ఇంటి పేరు చైతన్యం' (1976) వీటిని నిర్వచన శీర్షిక లంటానికి వీలుంది. మరలా ఆరేళ్ళ తరువాత 'నడక నా తల్లి' (1982) వెలువడింది.

నిర్వచనాలను కవితాశీర్షికలుగా పెట్టటం, కవితామయంగా వెలువరించటం, నారాయణరెడ్డిగారి సాహితీ వ్యక్తిత్వంలో చాలామంది హృదయాలను ఆకట్టుకున్న వైఖరి.

"గగనం నావదనం
ఉదయం నా హృదయం
తూర్పు నా ఊర్పు
మార్పు నా తీర్పు"

ఇది ఒక కవితాఖండిక. ఇందులోని రెండు చరణాలు కావ్యసంపుటాలకు నామ గౌరవాన్ని పొందాయి. అలాగే మిగిలిన పేర్లుకూడా వారి కవితల్లో నడిచిన చరణాలే. ఒక దశాబ్దం నుంచి నిర్వచన కవితలనూ, నిర్వచన శీర్షికలనూ కవితా సంపుటుల్లో చూడడానికి నారాయణరెడ్డి గారి ముద్ర బలంగా ఉన్నదని అనుకోవటానికి దాఖలాలు కనబడుతున్నాయి.

నిర్వచన కావ్యమంటే, తిక్కనగారి కాలంలో వచనస్పర్శలేని పద్య రచనగా ప్రఖ్యాతి ఉండేది. ఆ తరువాత ద్విపద కావ్యాలకు కూడా ఆ పేరు సార్థకమైనా వాటికి నిర్వచనకావ్యాలన్న రూఢి ఏర్పడలేదు. వచన కవిత ప్రాచుర్యంలో ఉన్న ఈ కాలంలో నిర్వచన కవిత అనే పేరుకే ఆస్కారం లేకుండా పోయింది. కాని, నిర్వచనాల్లాంటి, సూక్తులు వచనగేయ కృతుల్లో కనబడితే వాటిని నిర్వచచ కవితలని నేడు పిలవటానికి వీలుకలుగుతున్నది. "కప్పి చెపితే కవిత, విప్పిచెపితే విమర్శ" అన్న నారాయణరెడ్డి గారి సూక్తిని నిర్వచన కవిత అనవచ్చు. ఇటువంటి నిర్వచన పంక్తుల వస్తు వైవిధ్యంలో భావ కవితల్లోనూ, అభ్యుదయ కవితల్లోనూ, వచనకవితా ప్రయోగాలు చేస్తున్న వివిధకవుల రచనల్లోనూ కనపడతాయి. కొందరిలో క్వాచిత్కంగా, కొందరిలో విరళంగా, మరికొందరిలో బహుళంగా. బహుళంగా నిర్వచనాలను కవితలో వెలయించటం ఆధునిక కవుల కవితా లక్షణంగా నేడు చెలామణి అవుతున్నది. ఈ పద్ధతి ప్రాచుర్యం కావటానికి, నారాయణరెడ్డి గారి రచనలు విశేషంగా దోహదకారులయ్యాయనటం సత్యదూరం కాదు.

'ప్రపంచమొక పద్మవ్యూహం
కవిత్వమొక తీరని దాహం'

అన్నారు శ్రీశ్రీ. కవితను నిర్వచించే ఒకసూక్తి వైఖరిని శ్రీశ్రీ అభ్యుదయ కవులకు అందించారు. అయితే శ్రీశ్రీ స్వభావం నిర్వచనాన్ని సూచించిన

దానికంటె నినాదస్ఫూర్తిని వెలార్చటానికి ఎక్కువగా మొగ్గుచూపుతుంది. 'కుక్కపిల్లా, అగ్గిపుల్లా, సబ్బుబిళ్ళా, హీనంగా చూడకుదేన్నీ, కవితా మయమేనోయ్ అన్నీ' అని ప్రారంభించిన శ్రీశ్రీ రచనను పై నిర్వచనంతో ముగించి, దాని కొక నిర్వహణ శిల్పాన్ని కల్పించి నిండుదనాన్ని సంతరించారు. నవకవనానికి ఆయన చెప్పిన లక్షణాలు నిర్వచనస్ఫూర్తి కంటె నినాదవైఖరిని ఎక్కువగా పొందుపరుచుకున్నాయి. ఆవేశానికి ఆలోచనను జోడించే కవితా ధోరణికి నినాద నిర్వచనాల సమ్మేళనం ఎలా అర్థవంతంగా ఉంటుందో శ్రీశ్రీ ప్రయోగ నైపుణ్యంతో ప్రదర్శించి చూపించారు. నినాద నిర్వచనాలకు శ్రీశ్రీ హిమవన్నగ శిఖరం.

శ్రీశ్రీ తరువాత నినాద ధోరణిని కొందరు పోషిస్తే నిర్వచనఫణితిని మరికొందరు గౌరవించారు. డా॥ సి. నారాయణరెడ్డి గారి వచనకవితల్లో నిర్వచన ఫణితి ఒకనిండు దనాన్ని ప్రదర్శిస్తున్నది. కవితను ఆలోచనామయంచేసే కవులకు ఈ మార్గం ఉపాదేయం. నేటియువ కవులెందరో ఈ ఫణితిని పాథేయంగా వాడుకుంటున్నారు. అయితే కొందరు నిర్వచనాలనే కవితలుగా వ్రాయటం శోచనీయం. కవితలో నిర్వచనం కలికితురాయిగా మెరవాలి. అప్పుడే అది శిల్పం. రెడ్డిగారిది అటువంటి శిల్పమార్గం.

'నిర్వచనం', 'నినాదం' అనే పదాలు ఇప్పుడు కవితలో పారిభాషిక పదాలుగా రూఢికెక్కాయి. నిర్వచనాన్ని ఆత్మాభివ్యక్తికి అనువుగా ఆధునిక కవులు వాడుకొంటున్నారు. నినాదాన్ని ఆదర్శాభివ్యక్తికి ఉపకరణంగా ఉపయోగించుకుంటున్నారు. నిలిచి చెప్పేది నిర్వచనం. పిలిచి చెప్పేది నినాదం అంటే బాగుంటుందేమో! నిలిచిచెప్పటంలో నిగ్రహంతో కూడిన కొంత సూక్తి పాటవం ప్రకటిత మవుతుంది. పిలిచి చెప్పటంలో ఎదుటివారిలో నిద్రాణమైన చైతన్యాన్ని మేల్కొలిపి ప్రజ్వలింపజేసే ప్రతాపస్ఫూర్తి ప్రస్ఫుటమవుతుంది. నిర్వచనం నిండుకుండ. నినాదం నిర్ఝరి. నిర్వచనం పయోదమాలిక; నినాదం వర్షధార. నినాదం వరదనీరు: నిర్వచనం నిండిన చెరువునీరు. నినాదం పరుగు; నిర్వచనం నడక.

"నా దృష్టిలో నడక సంస్కృతిలాంటిది. పరుగు నాగరికతలాంటిది. అందుకే వీటిని తల్లి తండ్రీ అన్నారు. వ్యక్తిగా, కవిగా నా జీవిత గమనం ఈ రెండింటి సమన్వయం" అన్నారు నారాయణరెడ్డిగారు. 'నడక నా తల్లి'కి ముందు మాటగా వ్రాసిన 'నా మాటలో'. ఈ మాటలు నిర్వచన నినాదాలకు క్రొత్త

వ్యాఖ్యానాలు. తండ్రి తల్లిలో తనను తాను బిడ్డగా పునఃసృష్టి చేసుకుంటాడు. బీజం తండ్రిది, ఖారం తల్లిది. ఫలం సంతానం. రుచి దాని విలువ. నినాదం నిదానంగా మారితే నిర్వచనం. నాగరికత - జాతిరక్తంగా మారితే సంస్కృతి. తండ్రి బిడ్డకై తేజస్సును ధారపోస్తాడు; తల్లి సంతానంకోసం రక్తాన్ని పంచి ఇస్తుంది. నాగరకతలోని తేజస్సు సంస్కృతిని ఉత్తేజపరిచే ఔజ్జ్వల్యం. సంస్కృతిలోని రక్తం జాతి వ్యక్తిత్వం. తేజస్సు రక్తగతంగా పొంగిన ఓజస్సు సంతానం. కవిత్వం నా మాతృభాష అన్నారు రెడ్డిగారు. "సమత నా భాష', 'కవిత నా శ్వాస' అని దానినే వ్యాఖ్యానించారు. సమతయే సంస్కృతి. దానిని బోధించేదే మాతృభాష. భాష కవి శ్వాస. బాసగా మారిన శ్వాస కవిత.

కవులలో రెండు రకాలవాళ్ళుంటారు. కాలం పిలుపు విని, కలాన్ని ఝళిపించి కదనరంగంలో దూకేవారు. కాలాన్ని కలంతో కళ్ళు తెరిపించి తమతో నడిపించుకొని పోయేవారు. అంటే కాలం వెంటనడిచే కలాలు కొన్ని, కాలాన్ని తమ వెంట నడిపించే కలాలు మరికొన్ని అన్నమాట. మొదటి వర్గానికి నినాదం శ్వాస, రెండవ వర్గానికి నిర్వచనం ఊపిరి. నినాదం ఉద్యమానికి ఊపిరి పోస్తుంది, నిర్వచనం ఉపదేశానికి శ్వాసను చేకూరుస్తుంది. ఉద్యమంలో శ్వాస ఉద్వేగాన్ని పొందుతుంది. ఉపదేశంలో ఊపిరి సౌమ్యతను భజిస్తుంది. నినాదంలో కవిత కాహళగా మ్రోగుతుంది. నిర్వచనంలో కవిత కాగడాగా వెలుగుతుంది. కాలంతో శ్రుతి కలిపేది కాహళా. కవితను వెలిగించేది కాగడా. జీవితానికి ప్రమాణం కాలం కాదు, కాలానికి జీవితం ప్రమాణం. నినాదం కాలం చెప్పే కబుర్లు చెబుతుంది. నిర్వచనం జీవితం చెప్పే అనుభవాన్ని అందిస్తుంది. కవితకు రెక్క నినాదం, డొక్క నిర్వచనం.

పరుగెత్తే కవితకు పారుదెక్కువ. నడిచే కవితకు నాట్యమెక్కువ. కవితను పరిగెత్తించేది కాలం. కాలాన్ని కవితగా నడిపించేది శిల్పం. పరుగెత్తే కాలానికి నడిచే శిల్పానికీ అక్షరానుబంధం కవిత. కవిత కాలాన్ని ఎప్పుడూ అనుసరిస్తూనే తనవైపు ఆకర్షిస్తుంది.

ఈ ఉపశ్రుతి నారాయణరెడ్డి గారి మాటల్లో వినవస్తున్నది.

"ఎన్నిసార్లు చెక్కితే వో శిల్పం<br>
ఎన్నిసార్లు తీర్చితే వో చిత్రం<br>
కబుర్లు చెప్పకే వో కాలమా!<br>
ఎన్ని సార్లు చస్తే వో జీవితం".

(ఆంధ్రప్రభ; 11-2-1985)

# ఫిజియాలజీ – సైకాలజీ

అది 1910 మే నెల. యేట్స్ దొర అధ్వర్యవంలో ఉపాధ్యాయ పరిషత్తు మూడవ వార్షిక సమావేశం జరుగుతోంది. ఈ సందర్భంగా ఉన్నత విద్యాలయ ప్రధానోపాధ్యాయుల సమావేశం కూడా ఏర్పాటయింది. అందులో ప్రధాన చర్చనీయాంశం ఏమిటంటే - ఇంగ్లీషు బోధన భాషగా పట్టభద్రులైన విద్యార్థులు ఆధునికశాస్త్ర విషయాలను తెలుగులోకి అనువదించటానికి గాని, ప్రసంగించటానికి గాని సామర్థ్యాన్ని ప్రకటించటం లేని కారణంగా, వారికి అటువంటి సామర్థ్యాన్ని కలిగించేటట్లు విద్యావిధానంలో తేవలసిన మార్పులు. ఆ అంశాన్ని గురించి గిడుగు వేంకట రామమూర్తి పంతులుగారు ఉపన్యసించారు. అనువాదంలోనూ, వ్యాసరచనలోనూ గ్రాంథిక భాషకు బదులు వ్యావహారిక భాషను ప్రవేశపెడితే అది సాధ్యమవుతుందని నొక్కి వక్కాణించారు. రెండవ రోజు వ్యావహారిక భాష ప్రయోజనాన్ని గురించి గంభీరోపన్యాసం చేశారు. వారి వాదాన్ని సదస్సులలో ఎవరూ ఖండించలేదు కాని, ఏదో ప్రళయం ముంచుకుని వస్తున్నదని మాత్రం గ్రాంథిక భాషావాదులు భయపడ్డారు. ఆ సమావేశంలో కిళాంబి రామానుజాచార్యులు గారు కూడా ఉన్నారు. వారప్పుడు విజయనగరం మహారాజా వారి కళాశాల ప్రధానాచార్యులు. గ్రాంథిక భాషాభిమాని. వారు ఆగబట్టుకోలేక గిడుగు వారిని ఒక ప్రశ్న అడిగారు. "పంతులుగారూ! మీరు తెలుగు భాషా మాధుర్యమును చెడగొట్ట దలచినారా"? అని. దానికి గిడుగు పిడుగు సమాధానమిది—"ఆ మాధుర్యము కాగితము మీద ఉండగా కంటికి కనపడేదో! మాటలాడునప్పుడు చెవులకు వినబడేదో! ఆలోచించండి. మీకే తెలుస్తుంది."

'ఆలోచించండి' అన్నది ఆచార్యులవారికే గాదు, అఖిలాంధ్ర పండిత లోకానికి వర్తిస్తుంది. దేశం క్రమంగా ఆలోచించింది. వాదులాడు కొన్నది. క్రమంగా మాటలాడే మాటలు కాగితాల మీద కెక్కాయి. ఈ రోజు కాగితాలు కూడా మాటలాడుతున్నాయి. వ్యావహారిక భాషోద్యమ పితామహునికి జోహారు లర్పిస్తున్నాయి.

గిడుగు వేంకట రామమూర్తి పంతులుగారి వ్యక్తిత్వం ఆధునికాంధ్ర పాండిత్యానికి అభివ్యక్తిగా నిలిచింది. (ఎమర్జెన్స్ ఆఫ్ మోడరన్ తెలుగు స్కాలర్‌షిప్) ఆ వ్యక్తిత్వం హరివిల్లులా ఏడురంగులతో శోభిస్తుందని ఆయన కృషి సూచించింది. అవి - 1. మాతృభాషా సాహిత్యాల పరిజ్ఞానంతోపాటు సంస్కృతాంగ్ల భాషా సాహిత్యాలలో పాండిత్యం. 2. సాహిత్య చరిత్ర నిర్మాణానికి దేశచరిత్రల పరిశోధన ప్రాముఖ్యం. 3. భాషా వికాసాధ్యయనానికి శాసన పరిశోధనావశ్యకత. 4. ఆధునిక శాస్త్ర దృష్టితో భాషా శాస్త్రాధ్యయనం. 5. భాషా శాస్త్రనిర్మాణానికి మానవశాస్త్రం వంటి శాస్త్రాల పరిజ్ఞానపుతోడ్పాటు. 6. భాషా స్వరూప స్వభావాల నిర్ణయానికి తులనాత్మకాధ్యయన ప్రాముఖ్యం. 7. భాషాసాహిత్యోద్యమ ప్రవక్తలకు శాస్త్రీయ దృక్పథంతో కూడుకున్న వాద నైపుణ్యం, వక్తృత్వం వన్నె చేకూర్చే గుణాలు. ఈ లక్షణాలు ఏడూ కలిసి గిడుగువారిని ఆధునికాంధ్ర పాండిత్య వ్యక్తిత్వ భగీరథునిగా దిద్ది తీర్చాయి.

20 వ శతాబ్ది తొలి ఉషస్సులో తెలుగులో ప్రాచీన శాసన లిపిని చదువ గలిగిన పండితులు త్రిమూర్తుల్లాగా ముగ్గురే ఉండేవారట. వారు - గిడుగు వేంకట రామమూర్తి, గురజాడ అప్పారావు, జయంతి రామయ్య పంతులు. వీరిలో చతుర్ముఖ స్థానీయుడు గిడుగువారు. ఆయన సవర భాషకు లిపిని, వ్యాకరణాన్ని నిఘంటువును, వాచకాలను నిర్మించిన బ్రహ్మకల్పుడు. హరిజనులకోసం మొదటి పాఠశాలను నిర్వహించిన ఉదారుడు. తెలుగులో గ్రంథ పరిష్కార విమర్శ పద్ధతికి ప్రాచుర్యం కలిగించిన ప్రాచార్యుడు. వీటన్నింటినీ మించి వ్యావహారిక భాషోద్యమానికి ప్రప్రథమ మహావక్త. ఆధునికాంధ్ర మహావక్తలలో గిడుగు వారు పిడుగులాంటివారు. వారి వక్తృత్వ శక్తిని గురించి జొన్నలగడ్డ సత్యనారాయణ మూర్తిగారి ప్రశంస ఇది - "శ్రీరామమూర్తి ఆయుధము విజ్ఞానము... సభాంగణమున నీతని యెదుట నిలిచిన పండితుడు ఆంధ్రమండలమున లేడు. ఎదుటి వాడెంత దుండగీడైనను, ఒక మారు చెంపపెట్టు పెట్టినట్లును, వేరొక మారు ముక్కునకు సూటిగా గ్రుద్దినట్లును, ఇంకొకతూరి చింతబరిక చేబూని మీదకురికి నట్లును, మరొకప్పుడు కుత్తుకబట్టి చిత్తుచేసినట్లును ఈతడు వాదించును. ఈతని పండ్ల పటపటయందు వాడియైన తర్కమున్నది. ఈతని తీక్ష్ణ దృక్కులందు మిరుమిట్లుగొలుపు సారస్వతమున్నది. ఈతని బల్లెంపుటుక్తులందు కోసైన

మీమాంస యున్నది. ఈతని పిడికిలియందు బలమైన విశ్వాసమున్నది... ఈతని విజయము ఆంధ్రజాతి విజయము."

1933 నవంబరులో తెలికచర్ల వెంకటరత్నం గారు గిడుగువారి సప్తతి తమ జన్మదినోత్సవ సంచిక 'వ్యాస సంగ్రహము'ను సంపాదించి వెలువరించారు. అప్పటికే వ్యావహారిక భాషోద్యమం దేశంలో బాగా వ్యాపించి, పద్యాలను సైతం వ్యావహారికంలో వ్రాసే ప్రయోగాలను కొందరు కవులు చేపట్టారు. గిడుగు వేంకట సీతాపతిగారైతే శతకమే వ్రాశారు. భోగరాజు నారాయణ మూర్తిగారి 'గురుస్మరణ' వ్యావహారిక పద్య రచనకే కాక, గిడుగువారి యశస్సుకు కూడా పతాకగా నిలుస్తుంది. అందులోని ఒక పద్యం-

"చిన్నయసూరి సూత్రముల
    జిక్కి కృశించి, విషాదమొందుతూ
వున్న తెనుంగు, శృంఖలము
    లూడి, సుఖంబుగ మేడమీద
గూర్చున్నది, నూత్నకాంతి గను
    చున్నది, హాయిగ నేడు సంచరి
స్తున్నది, రామమూర్తి విబు
    ధోత్తమ! నీ శ్రమకున్ ఫలంబుగన్."

వ్యావహారిక భాషా రచనంలో పద్య కవిత ఒక ప్రయోగంగా మాత్రమే నిలిచినా, మిగిలిన ప్రక్రియలన్నీ దానిలోనే నేడు సాగుతున్నాయి. వ్యావహారికభాష నేటి సాహిత్యంలో సజీవంగా ప్రవహిస్తోంది. ఒకనాటి ప్రయోగం నేడు ప్రవాహం.

జొన్నలగడ్డ సత్యనారాయణమూర్తి గారు గిడుగువారి వ్యావహారిక భాషోద్యమాన్ని గురించి సమీక్షిస్తూ 1933 లో ఇలా అన్నారు. "ఈతని కర్తవ్యమింకను పూర్తికాలేదు. ఈ వరలో నీతడు తన సమయమంతను భాషయొక్క 'ఫిజియాలజీ'కై వెచ్చించెను. భాషలోని 'సైకాలజీ'కై ఈత డొక నిముసమైన నుపయోగింపలేదు."గిడుగు వేంకటరామమూర్తిగారి కర్తవ్యాన్ని వారి కుమారులు గిడుగు వేంకట సీతాపతి గారు కొనసాగించారు. భాషయొక్క ఫిజియాలజీని తండ్రి, భాషలోని సైకాలజీని కొడుకు ఆవిష్కరించారు. ఆ కాలంలో కవులు తమ

కావ్యాల్లో ప్రయోగించిన పదాలకు ప్రాచీన కవుల రచనల్లోని ప్రయోగాలను ప్రమాణాలుగా చూపించి సమర్థించుకునే వారు. గిడుగువారు ప్రాచీనకవుల ప్రయో గాల్లో కూడా వ్యావహారిక పదా లున్నాయని ఎత్తి చూపించే వారు. ప్రవాహరూప మైన జీవద్భాషలో పదాలు, పదాలకు అర్థాలు, పదప్రయోగాలూ మారుతూ ఉంటా యనీ, ఆయాకాలాల్లో నివసించిన కవులు వ్యవహారంలో నుంచే పదాలను గ్రహించి ప్రయోగించే వారనీ, కొన్ని ప్రాచీన గ్రంథాలు వ్యావహారికంలో రచింపబడ్డాయనీ, గ్రామ్యభాషను నిరసించే పండితుల గ్రాంథికరచనల్లో కూడా వ్యావహారిక రూపాలు కుప్పలు తెప్పలుగా కనపడుతున్నాయనీ, ప్రాచీన కవుల రచనల్లో గ్రామ్యాలని చెప్పబడేవి నిజానికి గ్రామ్యాలు కావనీ, వాటికి గతి కల్పిం చని దోషం వ్యాకరణాలదే అనీ రామమూర్తి పంతులుగారు వాదించారు. గ్రాంథిక భాషలో తప్పులు లేకుండా వ్రాయలేరనీ, మాట్లాడలేరనీ నిరూపించారు. గ్రాంథిక భాషావాదుల చేతకూడా ఆ సత్యాన్ని ఒప్పించారు. నాటకం, పత్రికా రచన, సినిమా, రేడియో, మొదలైన ప్రక్రియలకు గ్రాంథికభాష పనికిరాదని ప్రతి పాదించారు. బోధనకూ, నటనకూ, రచనకూ, అనువాదానికీ వ్యావహారిక భాష సుకరమని స్పష్టంచేశారు. వ్యావహారికభాష అంటే జీవద్భాష అని వారి వాదం. ఈ వ్యవసాయమంతా భాషయొక్క 'ఫిజియాలజీ'కి సంబంధించిందే.

గిడుగు వేంకట సీతాపతి గారు తండ్రి గారి కృషికి చేదోడు వాదోడుగా ఉండేవారు. సవర భాషా వ్యాకరణం, సవర - ఇంగ్లీషు, ఇంగ్లీషు - సవర నిఘంటువులు, సవర వాచకాలూ మొదలై వాటిలోనే కాక తండ్రిగారి గ్రంథా లకు తుది రూపాలను మలచటంలోనూ వారెంతో సాయపడ్డారు. వారిద్దరి కృషి అవిభాజ్య భాషా తపస్సు. అయితే సీతాపతి గారు ఒక భాషా పరిశ్రమలోనే కాక, ఛందశ్శాస్త్రంలోనూ, కవితా వ్యాసంగంలోనూ, సంగీత నాట్య విద్యల్లోనూ, అభి నయంలోనూ, నాటక రచనలోనూ, బాల సాహిత్య సృష్టిలోనూ, ఆంధ్ర నిఘంటు విజ్ఞాన సర్వస్వ నిర్మాణంలోనూ తండ్రిగారి కంటె విశేషంగా ప్రజ్ఞను సాధిం చారు. గ్రామ్యాగ్రామ్య చర్చలతోనే ఆగక సీతాపతి గారు జాతి మనోభావాలను, అభిరుచులను, సంస్కృతిని వ్యక్తం చేసే తెలుగు నుడి కారాలను, జాతీయాలను, సామెతలను గురించి విశేషంగా కృషిచేసి, కావ్యభాషలోకి వాటిని మారిస్తే, ఎలా అందం చెడిపోతుందో వివరించారు. తెలుగు వ్యవహారంలోనూ, ఛందస్సులోనూ 'పూనిక' నిర్వహించే పాత్రను తేట పరిచారు. వృత్తాలు భిన్న మాత్రాకాలైన

పదాలతో విచిత్ర గతులతో నడిచే హొయలను భావవ్యంజకంగా విశ్లేషించి చూపించారు. కందం, సీసం, ద్విపద, రగడ, మొదలైన దేశివృత్తాల్లోని వైవిధ్యాన్ని గురించి సూక్ష్మవిశేషాలను వెలువరించారు. వారి 'తెలుగులో ఛందోరీతులు' ప్రామాణిక ఛందోనుశీలనగ్రంథం. తెలుగు సాహిత్య చరిత్రను ఇంగ్లీషులో వ్రాశారు. సంస్కృత 'రత్నపాంచాలిక'ను తెలుగు నాట్యరూపకంగా మలిచారు. వీణ మీద అద్భుతంగా వాయించగలరు. రాగ రసభావాలను సమన్వయించి పదాలకు బాణీలు కట్టారు. క్షేత్రయ్య పదాలను కొన్నింటిని సంస్కృతీకరించారు. భాషకూ, భావానికీ పద్యగతికీ, భావాభివ్యక్తికీ వారధి కట్టిన వీరిబహుముఖప్రజ్ఞ భాషలోని 'సైకాలజీ'ని వ్యక్తీకరించింది.

భాషా శాస్త్రానికి 'ఫిజియాలజీ' ఒక పార్శ్వం. 'సైకాలజీ' మరొక పార్శ్వం. ఆధునికాంధ్ర భాషా పాండిత్య వ్యక్తిత్వానికి రామమూర్తి గారు కుడిభాగం, సీతాపతి గారు ఎడమ భాగం.

నా అదృష్టం ఏమిటంటే- సీతాపతి గారూ, నేనూ 1960లో ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ వారు పోటీ రచనలకు ఇచ్చిన బహుమతులను అందుకొన్నాం. వారి గ్రంథం 'తెలుగులో ఛందోరీతులు,' నా రచన 'తెలుగు సాహిత్యంలో వీర రసం.' వారిని నేను 1961 అక్టోబరు 1వ తేదీన కలుసుకుని నా గ్రంథం ముద్రిత ప్రతిని సమర్పించుకున్నాను. వారూ వారి గ్రంథ ప్రతిని నా కిచ్చారు. వీరరసమంటే వారి కెంతో ఇష్టమని ఆ రోజు తెలుసుకున్నాను. నన్నెంతో ఆప్యాయంగా పలకరించి నా కృషిని మెచ్చుకున్నారు. ఆ తరువాత వారు వీరరస ప్రధానమైన నాటకం 'కట్టబ్రహ్మన్న' వ్రాసి అకాడమీ బహుమతి మరోసారి పొందారు.

నిజానికి గిడుగువారి జీవితాలు రెండూ కలిసి ఒక వీరరస కావ్యం. అందులో పూర్వభాగం తండ్రికథ. ఉత్తర భాగం కొడుకు కథ. గిడుగువారి సంస్మరణ సభలు (జనవరి 27,28,29 తేదీల్లో హైదరాబాదులో జరిగాయి) తెలుగుజాతి వారి కర్పించే వీరనీరాజనాలు.

(ఆంధ్రప్రభ; 18-2-1985)

# విద్యలో వెలుగులు విలువలు

"మనం అనంతమైన శాస్త్ర విజ్ఞానాన్ని సముపార్జించాం. కాని, అది బాహిరమైన నాగరకతను మాత్రమే మనకు నేర్పింది. ఇప్పుడు మనకు కావలసింది హృదయ పరిపాకం. అది అందించే ఆంతరమైన సంస్కృతి. నాగరకుడైన మానవుడు మేధతోపాటు హృదయాన్ని కూడా విశాలం చేసుకోవాలి."

—బర్ట్రెండ్ రసెల్

"మానవుణ్ణి దయామయునిగా తీర్చిదిద్దినప్పుడే విద్య పరిపూర్ణమవుతుంది. విద్య మేధకు శిక్షణ నివ్వటమే కాకుండా హృదయానికి నిర్మలత్వం ప్రసాదించాలి. ఆత్మకు క్రమశిక్షణ అలవరచాలి"

—డాక్టర్ సర్వేపల్లి రాధాకృష్ణ

శాస్త్రవేత్తలూ, విద్యావేత్తలూ మానవునికి విద్య వలన కలగవలసిన ప్రయోజనాలను గురించి ఎలా భావిస్తారో పై రెండు సూక్తుల వలన స్పష్టమవుతుంది.

"విద్య రెండు రకాలు. ఒకటి - విషయ వివరాలను అందించేది. రెండు- జీవన వ్యవస్థను తీర్చిదిద్దేది. మొదటిదానివలన ప్రకృతిలోని లోకంలోని వార్తలు, విశేషాలు భౌతిక స్థితిగతులూ తెలుస్తాయి. ఇది ఎటువంటిదంటే రెండు పాళ్ళు హైడ్రోజన్, ఒక పాలు ఆక్సిజన్ కలిస్తే నీరు అవుతుందని చెప్పేది. రెండవది నీరు ఎలా ఏర్పడుతుందో చెప్పేది కాదు. నీటి యెద్దడి ఏర్పడినప్పుడు దొరుకుతున్న కొద్ది పాటి నీటిని అందరూ సమంగా ఎలా పంచుకుని జీవించాలో నేర్పేది"

—స్వామి వివేకానంద

భారతదేశానికి స్వాతంత్ర్యం వచ్చి ముప్పయి యేడేళ్ళయినా విద్యార్థుల సమగ్ర వ్యక్తిత్వాన్నీ, మూర్తిమత్వాన్నీ నిర్మించే విద్యావిధానాన్ని రూపొందించుకోవటంలో ఇంకా సఫలం కాలేదు మన యత్నం. ఈ ఫిబ్రవరిలో జరిగిన

నాగపూర్ విశ్వవిద్యాలయ వజ్రోత్సవాల సందర్భంగా భారత రాష్ట్రపతి శ్రీ జైల్‌సింగ్ "విద్యారంగంలో ఆధునిక వైజ్ఞానిక సాంకేతికాభివృద్ధికి సుసంపన్నమైన భారతీయసంస్కృతి దోహదం చేసేలా విద్యావేత్తలు కృషి చేయాలనీ, విద్యార్థి వ్యక్తిత్వం సమగ్రంగా అభివృద్ధి చెందితే తప్ప సామాజికాభివృద్ధి సాధ్యం కాదనీ వక్కాణించారు. (ఆంధ్రప్రభ 10-2-1985). ఇటువంటి అభిప్రాయం ఇప్పటిదే కాదు. భారత రాష్ట్రపతిగా పనిచేసిన రాధాకృష్ణ పండితుడు 1949 లో యూనివర్సిటీ ఎడ్యుకేషన్ కమీషన్ అధ్యక్షులుగా తమ రిపోర్టులో కూడా ఇలా తమ అభిప్రాయాన్ని వ్యక్తం చేశారు. "మనం ఒక నాగరకతను నిర్మించుకొంటున్నాం. అది కర్మాగారం కాదు, వర్క్‌షాపు కాదు. నాగరకత యొక్క నాణ్యత భౌతిక వస్తుసంభారం వల్ల కానీ, రాజకీయ యంత్రాంగం వల్లగానీ, ఏర్పడదు. అది మానవుల శీలసంపద మీద ఆధారపడి ఉంటుంది. విద్యయొక్క ప్రధాన కర్తవ్యం ఉత్తమ శీలాన్ని పెంపొందించటం" అన్నారు. దాదాపు మూడున్నర దశాబ్దాలుకడచిన తరువాత కూడా నేటి భారత రాష్ట్రపతి ఇటువంటి అభిప్రాయాన్నే వ్యక్తం చేస్తున్నారు. అంటే మనదేశంలో విద్యా విధానం అభిలషించిన గమ్యాన్ని ఇంకా అందుకోలేదన్న మాట !

భారత ప్రధాని శ్రీ రాజీవ్‌గాంధి విద్యావిధానంలో క్రొత్త మార్పులను ఒక యేడాదిలోగా తీసుకుని రావాలని ఒక దృఢ సంకల్పంతో ఉన్నారని వారి మాటలవలన స్పష్టమవుతున్నది. మార్పు తెచ్చేటప్పుడు లక్ష్యం ముందు నిర్దేశింపబడాలి. నేటి విద్య పౌరులకు జీవనోపాధి కల్పించటంతో పాటు జీవిత లక్ష్యాన్ని కూడా అందించాలి. శాస్త్రీయమైన దృక్పథంతోపాటు శీలసంపదను కూడా సమకూర్చాలి. "భయము, భక్తి, విశ్వాసము, గల ఏకైక విద్యయే ఆశాజ్యోతి" అని రాజాజీ భావించిన విధంగా విద్య రూపొందాలి. "భారతీయ విద్యను సరిగా అర్థము చేసుకోవటానికి ప్రయత్నించాలి. విద్య హృదయస్థానంనుండి వెలువడే దివ్య తేజస్సు. విద్యపరమార్థము శీల నిర్మాణము. ముఖ్యముగా మనము త్యాగశీలతను, పవిత్ర గుణములను పోషించుకోవాలి. గుణశీలురు కాలేనివారు విద్యావంతులు కాలేరు" అని భగవాన్ శ్రీ సత్యసాయిబాబావారు ప్రబోధించినట్లుగా విద్యా ప్రయోజనాన్ని గుర్తించాలి. "భౌతిక విజ్ఞానాన్ని అందించటమే విద్యావిధాన లక్ష్యమైతే అది ప్రపంచ ప్రగతిని వమ్ము చేస్తుంది. శీలమే జీవితం,

శీలమే శక్తి. శీలమే నిజమైన పవిత్రత. మెదడులో సమాచారాన్ని నింపే విద్యా విధానం విద్యార్థి వ్యక్తిత్వ వికాసానికి పోషకంగా ఉండే శీలాన్ని ధ్వంసం చేస్తుంది. కాబట్టి స్వార్థరాహిత్యం, వినయం, నిరాడంబరత అనే దివ్య గుణాలు విద్యార్థి వ్యక్తిత్వంలో అంతర్భాగాలుగా రాణించాలి. అవి వారికి అంతశ్శక్తిని కలిగించే సత్త్వంగా ఏర్పడాలి. అన్నింటికీ మూలమైన శీలమే వ్యక్తిత్వానికి జీవం. దానివలన శాంతి సౌఖ్యాలు కరతలామలకా లౌతాయి"- అన్న బాబావారి సందేశాన్ని విద్యావిధానంలో మార్పు తెచ్చే విద్యావేత్తలు మనసుల్లో ఉంచుకోవాలి.

విద్యావిధానం మనిషిని మనీషిగా మార్చి ఆగిపోరాదు. మనిషిని విలువలు తెలిసిన మానవునిగా మలిచే ధ్యేయంతో సాగాలి. విద్యార్థులకు మంచి మార్కులు రావటమేకాదు ప్రధానం. మంచి రిమార్కులు రావటం ముఖ్యం. 'ఎడ్యుకేషన్ ఏజిటేషన్' కలిగించేదిగా ఉండరాదు. 'ఎలివేషన్' కలిగించేదిగా మారాలి. విద్య విషయానందం కాక విద్యానందాన్ని వెలిగించాలి. ప్రసిద్ధ న్యాయశాస్త్రవేత్త శ్రీ నానీ పాల్కీవాలా అన్నట్లు - "దేశం ఈనాడు ఆర్థికంగా వెనుకంజ వేస్తున్నది. కాని, అంతకంటే పెద్ద ప్రమాదం నైతిక, ఆధ్యాత్మిక తిరోగతి", ఈ తిరోగతి నుండి పురోగతిని సాధించలేకపోతే విద్యావిధానానికి అసలు గతే లేకుండా పోయే ప్రమాదం ఉంది.''

నేటి విద్యా విధానంలో మార్పు తప్పక రావలసిందే. అయితే, అందుకు ముఖ్యంగా ఎన్నుకోవలసిన లక్ష్యం ఏమిటి? - మానవత్వ గుణ శిక్షణ. విద్యా బోధనలో అవశ్యంగా అందించవలసిన అంశం ఏమిటి? మానవత్వపు విలువల బోధన 'ఎడ్యుకేషన్ ఇన్‌హ్యూమన్ వాల్యూస్'. మానవత్వగుణశిక్షణ సేవా భావంతో సమున్మేషించాలి. విలువల బోధన శీల నిర్మాణానికి తోడుపడాలి. సమాచారంతోపాటు సంస్కృతిని ప్రసాదించే విద్యయే నేటి భారతపౌరులకు కావాలి. ప్రజాస్వామ్య వ్యవస్థ పటిష్ఠం కావాలంటే శీలవంతులైన విద్యావంతులను విద్యారంగం తయారు చేయాలి. నైతికంగా పతనమవుతూ ఎంత నైపుణ్యాన్ని సాధించినా జాతి వ్యక్తిత్వాన్ని నిర్మించుకోలేదు. దేశభక్తిని, సేవాసక్తిని, శీలశక్తిని, నైతికోన్నతిని, ఆత్మవిశ్వాసాన్ని విద్య యువతరానికి ప్రసాదించాలి. విద్యలో విలువలకు విలువ పెరగాలి.

"నీవు తత్త్వవేత్తగా ఉండు. కాని, నీ తాత్త్విక జ్ఞానంతో పాటు నీవు మానవునిగా కూడా జీవించు" అంటాడు డేవిడ్ హ్యూమ్. మానవుడు కొత్తగా ఎన్ని సిద్ధాంతాలు ప్రసాదించాడు ? ఎన్ని భౌతిక విజయాలు సాధించాడు ? ఎన్ని వైజ్ఞానిక ప్రయోగాలు చేశాడు ? అన్నదే కాదు ప్రధానం. ఇన్ని సాధిస్తూ మానవునిగా ఎన్ని విలువలను రక్షించి పోషించాడన్నదే విద్యా ప్రమాణం. "విద్యా విధానము ఒక వ్యక్తిని పరిపూర్ణ మానవునిగా తయారుచేయ" వలెనని స్వామి వివేకానంద అన్నారు. "మనస్సుకు శరీరానికి, ఆత్మకు సంబంధించి నదిగా విద్యా విధానం ఉండా"లని మహాత్మాగాంధి బేసిక్ విద్యా విధానంలో సూచించారు. ఈ లక్ష్యంతోనే రవీంద్రనాథ్ టాగూర్, అరవింద ఘోష్, అనిబి సెంట్ మొదలైన పెద్దలు విద్యా విధాన సంస్కరణలను సూచించారు. ఆధు నికంగా భగవాన్ శ్రీ సత్యసాయిబాబా వారు సత్యము, ధర్మము, శాంతి, ప్రేమ, అహింస అనే మౌలికమైన మానవత్వపు విలువలపై నిర్మింపబడిన విద్యా విధానం విద్యార్థులకు వ్యక్తిత్వ వికాసానికి పోషక మవుతుందని ప్రబోధిస్తున్నారు. ప్రయోగాత్మకంగా విద్యా సంస్థలను నెలకొల్పి, వాటిలో ఆదర్శ విద్యా శిక్షణను విద్యార్థులకు అందిస్తున్నారు.

నేటి విద్య పదార్థ విజ్ఞానం (ఇన్‌ఫర్‌మేషన్)తో ఆగరాదు. పరివర్తన కలిగించే జ్ఞానం (ట్రాన్స్‌ఫర్‌మేషన్) గా మారాలి. విద్య పాండిత్యానికే కాదు, అనుభవపారమ్యానికి తోడుపడాలి. విద్య జీవనోపాధియే కాదు. సంస్కృతిని జీవింపచేయాలి. విద్య చింతనకే కాదు, శీల పోషణకు తోడు పడాలి. విలువలే విద్యకు గుణాలు. పంచ గుణాలే విద్యకు పంచ ప్రాణాలు. "సత్య, ధర్మ, శాంతి, ప్రేమ, అహింసలు - ఇవే నిజంగా పంచ ప్రాణములు. ఇవి లేకపోతే మనం మానవులమే కాదు. ఇవి అయిదు ప్రత్యేకంగా వేర్వేరు పనులు చేస్తున్నాయి. కాని, అన్నింటి యందు కూడా సమన్వయ మున్నది."

"ఇవి అన్యోన్య సంబంధముతో కూడి ఉంటున్నవి. సత్యము ధర్మముతో చేరాలి. ధర్మము ప్రేమతో ఉండాలి. ప్రేమను శాంతితో అనుభవించాలి. ఈ శాంతి అహింసలోనికి ప్రవేశించినప్పుడే ఇది ఏకత్వమైన దివ్యత్వంగా రూపొందుతుంది. అనేకత్వాన్ని ఏకత్వంగా చేసినప్పుడే ఈ ఏకత్వంలోనే

మానవత్వం వస్తుంది. ఇట్టి మానవత్వంలోనే ఏకత్వం సులభంగా ఏర్పడుతుంది. ఈ ఏకత్వంలో స్వచ్ఛత సహజంగా వస్తుంది. ఈ స్వచ్ఛత దివ్యత్వంలో ప్రవేశిస్తుంది. ఏకత్వం, దివ్యత్వం, స్వచ్ఛత, - ఈ మూడింటి సమ్మిశ్రిత స్వరూపం మానవత్వం" — బాబా.

ఈ మానవత్వపు విలువలతో శిక్షణ - బోధన జరగాలన్న పిలుపును ప్రపంచ దేశాలు ప్రత్యేక శ్రద్ధతో వింటున్నాయి. దాదాపు నలభై దేశాలు ఈ విధానాన్ని అమలు జరిపే యత్నాలు చేస్తున్నాయి. మనదేశంలో కొన్ని రాష్ట్రాలు విద్యా విధానంలో ఈ విలువల విద్యను పాఠశాలల్లో ప్రవేశ పెట్టాయి. ప్రయోజనాత్మక ఫలితాలను సాధిస్తున్నాయి. జాతీయ విద్యా విధానంలో మానవత్వపు విలువల శిక్షణకు - బోధనకు ప్రాధాన్యం కలిగిననాడు విద్యార్థుల సమగ్ర వ్యక్తిత్వ మూర్తిమత్వ వికాసం కోసం మనదేశం కన్న కలలు నిజం కాగలవు.

మానవత్వ గుణ శిక్షణ బోధనాంశమే కాదు. జీవిత పరమావధి. భారత దేశం ప్రపంచాని కందించే అభినవ విద్యా పారితోషికం. ఈ పంచ గుణ విద్య ప్రపంచానికి పరంజ్యోతి. విద్యలో వెలుగులు విలువలు.

(ఆంధ్రప్రభ; 25-2-1985)

# మంట - వెలుగు

"జన్మెత్తిన మానవునకు
జీవితమే పరమధనం
అయితే అది ఒకమారే
అతని కొసగబడిన వరం" —శ్రీ సోమసుందర్.

ఆధునిక కవితలో మానవుడే నాయకుడు. అతని బ్రతుకులోని మంటలే వస్తువు. మానవధర్మం ఒకనాడు సాహిత్యాన్ని జీవింప చేస్తే, మానవ జీవిత సంఘర్షణం ఈనాడు సాహిత్యాన్ని ముందుకు నడిపిస్తున్నది. "నిజంగానే నిఖిల లోకం నిండు హర్షం వహిస్తుందా" అన్న ఆలోచన అక్షర జగత్తులో అభ్యుదయ గీతా లను ఆలపింప చేస్తున్నది జీవితంలో మానవుడు వేదనను అనుభవిస్తున్నప్పుడు అతడు అగ్నిలా మండుతాడు. నిర్వేదాన్ని భజించినప్పుడు అతడు జ్యోతిలా వెలుగుతాడు. అభ్యుదయ పథం అతని బ్రతుకులో అగ్నిసూక్తం, ఆత్మాన్వేషణ పథంలో అతని నడక వెలుగుబాట.

అభ్యుదయ దృక్పథం మానవుణ్ణి వ్యక్తి నుండి విశ్వం వైపు నడిపించింది

"నా యింటి పేరు ప్రపంచం
ప్రజలే నా కుటుంబం
వెదజల్లుతా దిగ్దిగంతం
అప్పుడు నా జీవితమే ప్రబంధం."

అన్న శ్రీశ్రీ తెలుగు సాహిత్యాన్ని మానవ కేంద్రంగా విశ్వవీథులలో పయనింప చేశాడు. 'దేశమంటే మట్టి కాదోయ్ - దేశమంటే మనుషులోయ్' అన్న గురజాడ సూక్తికి విశ్వవ్యాప్తిని కల్పించాడు. 'నేను సైతం ప్రపంచాగ్నికి సమిధనొక్కటి ఆహుతిచ్చాను' అని విశ్వ మానవ ప్రతీకగా తాను పలికాడు. కార్మిక కళ్యాణం కోసం కలం పట్టి కదనరంగంలో దూకాడు. అభ్యుదయ ప్రస్థానానికి శంఖ నాదం పూరించాడు. మనిషికి దూరంగా కనిపించింది భుగభుగమండే అరుణ జ్వాల. ఆ వైపు కవితనూ, మనిషినీ నడిపించుకు పోయాడు శ్రీశ్రీ.

ఆ ప్రస్థానం నాటికీ, నేటికీ సాగుతూనే ఉంది. మానవశక్తి గుర్తింప బడింది. తిరుగుబాటులో తెగువ తెచ్చుకున్నాడు మనిషి. నడిచే బాటలో అడ్డంకు లను అవగాహన చేసుకున్నాడు. మంటల్లో నడిచాడు. మంటలను హాలాహలంగా మ్రింగాడు. మంటగా మారి నలుదిక్కులా వ్యాపిస్తున్నాడు. అతనికి కావలసింది సాంఘిక న్యాయం, ఆర్థిక సమత్వం, పీడిత జనాళిపై సానుభూతి, ఆకలి చావు లపై అనుకంప, అంతఃకరణంలో మానవత్వపు విలువ. "మానవుడిగా మేలుకో నేస్తం - ఏలుకో ఈ విశ్వం సమస్తం" అన్నది శ్రీశ్రీ పిలుపు.

మానవుడు అభ్యుదయ గీతాన్ని పాడుతూ, విప్లవ శంఖాన్ని పూరించాడు. మానవత్వాన్ని మేల్కొల్పటంలో ప్రారంభమైన అభ్యుదయపథం మానవుణ్ణి మహాజ్వాలగా మార్చేంత వరకూ పురోగమించింది.

"పూరుకుంటానా నేను
కసిగా కసాయిగా
ఉపద్రవం లాగ ఉవ్వెత్తుగాలేచి
సంహారాన్ని స్యందనం చేసి
ఉద్రేక తరంగాలే తురంగాలుగా
ఆగ్రహం కొరడాని చేబూని
సాయుధ విప్లవ బీభత్సుని సారథినై
భారత కురుక్షేత్రంలో
నవయుగ భగవద్గీతా ఝంఝను ప్రసరిస్తాను
మంటల చేత మాట్లాడించి
రక్తం చేత రాగాలాపన చేయిస్తాను" —శ్రీ శ్రీ.

అభ్యుదయ ప్రస్థానంలో మానవుడికీ మంటలకీ అవినాభావ సంబంధం భావింపబడింది. అతని బాధలు మంటలు, కోపతాపాలు మంటలు, తిరుగుబాటు ధోరణులు మంటలు, నడిపే ఉద్యమాలు మంటలు, చేసే నినాదాలు మంటలు, విప్లవాలు మంటలు. "మానవుడు అనాదిగా మంటల్లో బతుకుతున్నాడు - మంటల గంటలను మ్రోగిస్తూ మహోద్యమ ద్వారాలు తెరుస్తున్నాడు." అని వ్యాఖ్యా నించారు డా॥ సి. నారాయణరెడ్డి గారు. అభ్యుదయ మానవుడు ఉద్యమించే ప్రవృత్తికీ, ఉన్మేషింపచేసే ఆత్మాభివ్యక్తికీ మంటలు ప్రతీకలు నేటి కవికి.

ఆధునిక సాహిత్యంలో నాయకుడైన మానవుడు మంటల్లో బ్రతికే విధానాన్ని అయిదు అంచెలలో వివేచించవచ్చు.

1. మంటలను చూస్తున్న మానవుడు
2. మంటలలో నించున్న మానవుడు
3. మంటలను మ్రింగుతున్న మానవుడు
4. మంటలను త్రొక్కుతూ నడుస్తున్న మానవుడు
5. మండుతున్న మానవుడు

మంటలను చూస్తున్న మానవుడు అభ్యుదయాన్ని ఆకాంక్షిస్తున్న పురోగమన వాది. మంటలలో నించున్న మానవుడు అభ్యుదయ మార్గాన్ని ప్రబోధిస్తున్న ఉద్యమశీలి. మంటలను మ్రింగుతున్న మానవుడు పీడితవర్గ బాధామయ గాథలను ప్రయోగాత్మకంగా ప్రపంచిస్తున్న మానవతా వాది. మంటలను త్రొక్కుతూ నడుస్తున్న మానవుడు ఉద్యమ శంఖారావం పూరిస్తూ సమాజాన్ని చైతన్యవంతం చేస్తున్న కార్యశీలి. మండుతున్న మానవుడు విప్లవమే తానుగా అభివ్యక్తమవుతున్న ఆగ్రహ శీలి. ఈ అయిదు అవస్థలూ మానవ ప్రతినిధులుగా నిలిచే కవులలో ప్రత్యక్షమవుతాయి. ఇవన్నీ అభ్యుదయ కవితా ప్రస్థానంలో మజిలీలే.

తెలుగులో వెలసిన అభ్యుదయ సాహిత్యంలో ఈ అయిదు మజిలీలూ కనబడతాయి. మానవునికి మంటలను చూపి మహాప్రస్థానం సాగించమని చెప్పింది శ్రీశ్రీ. మంటలలో నించున్న మనిషిని మహనీయంగా పరిచయం చేసింది దాశరథి. మంటలను మ్రింగుతున్న మానవుణ్ణి వివిధావస్థలలో వ్యక్తం చేసింది ఆరుద్ర, కాళోజీ, సోమసుందర్, కుందుర్తి మొదలైనవారు. మంటలను త్రొక్కుతూ నడుస్తున్న మానవుణ్ణి సాహిత్య క్షేత్రంలో నడిపింప చేసింది దిగంబర కవులు. మంటగా మండుతున్న మనిషిని చిత్రించింది విప్లవ కవులు.

మండుతున్న మానవుడికి అభివ్యక్తిని కల్పిస్తున్నది ఆధునిక కవిత. "మంట లేని ఆ దుఃఖ మెందుకు కళ్ళనిండా" అని హెచ్చరించాడు శివారెడ్డి. "మానవత నగ్నంగా, ఉద్విగ్నంగా - నూతన వ్యక్తీకరణం కోసం చూస్తోంది" అని పసికట్టాడు గుంటూరు శేషేంద్ర శర్మ.

మనిషికీ, మంటకూ ఎంత చరిత్ర ఉందో, మనిషికీ వెలుగుకూ అంత గాథ ఉంది. వెలుగులా జీవించే మనిషిని చూడాలని మానవవాదులు భావిస్తు న్నారు. మానవతా వాదం అన్ని ఉద్యమాల్లో అంతర్గర్భితంగా ప్రవహిస్తుంది. మనిషి హితాన్ని కోరుతూ దాన్ని మానవుడే సాధించాలని ఆ వాదం ఆకాంక్షి స్తుంది. వ్యక్తికి సమష్టికి ఉండే సంబంధాలను బలపరుస్తూ సమాజ చైతన్యాన్ని వేగవంతం చేయటానికీ, మానవశక్తికి అభివ్యక్తిని కల్పించటానికీ యత్నిస్తుంది. అభ్యుదయ కవితా వాహినిలో అంతర్వాహినిగా ప్రవహిస్తూ విశ్వమానవత సాధించే విలువలను వివేచిస్తూ మనిషిలోని మహనీయతను చూపిస్తూ, అతని లోని కాలుష్యాన్ని ప్రక్షాళనం చేస్తున్నది మానవతా వాదం.

"మనిషిని మించిన మహాశక్తి లేదని
మనిషినే ఆరాధిస్తున్న మనిషిని నేను" —బాపురెడ్డి

మంటగా మండేవాడు విప్లవవాది. వెలుగులా వెలిగేవాడు మానవతావాది. వెలుగులో నుండే మంట పుట్టింది. మంట వెలుగుగా జీవితంలో మిగిలిపోతుంది. మంటల్లో మండే మానవుడు జీవితంలో నిలిచే వెలుగుగా మారటమే జీవిత గమ్యం - కవితా పరిణామం. మంట పరిణామం; వెలుగు ఫలితార్థం.

(ఆంధ్రప్రభ; 5-3-1985)

# తెలుగు సాహిత్యరూపకం

1956 నవంబరు ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర అవతరణం జరిగింది. తెలుగు వారందరూ ఒక గొడుగు నీడలో చేరారన్న సంతోషోత్సాహాలు ప్రజాహృదయాల్లో వెల్లివిరిసాయి. సాహితీలోకం రసోల్లాసాన్ని వెలార్చింది. ఆ సంతోషాతిశయంలో నుంచి తెలంగాణంలో ఆవిర్భవించిన సాహిత్య రూపకం 'భువన విజయం'. నేనప్పుడు ఉస్మానియా విశ్వవిద్యాలయ ఆర్ట్సు కళాశాల ఆంధ్ర విద్యార్థి సంఘానికి అధ్యక్షునిగా ఉండేవాణ్ణి. గుంటూరులో కవిసమ్రాట్ విశ్వనాథ సత్యనారాయణగారు అల్లసాని పెద్దనగా, శ్రీ జమ్ములమడక మాధవ రామశర్మ గారు మహామంత్రి తిమ్మరుసుగా "భువన విజయం" నిర్వహింపబడింది. ఆ వార్త విన్న విద్యార్థులం హైదరాబాదులో కూడా'భువన విజయ' కార్యక్రమాన్ని ఏర్పాటు చేయాలని నిర్ణయించుకున్నాం. 'దేశభాషలందు తెలుగు లెస్స' అని ప్రకటించిన ఆంధ్రభోజుని ఆస్థాన వైభవాన్ని,సాహితీ రసికత్వాన్ని రూపొందించే రూపక కార్యక్రమాన్ని విద్వాంసులతో ప్రదర్శింపచేద్దామని ప్రయత్నాలు చేశాం. ఆచార్య దివాకర్ల వెంకటావధానిగారిని ఆ కార్యక్రమాన్ని రూపొందింప ప్రార్థించాం. తత్ఫలితంగా మొదటిసారి 'భువన విజయ' సాహిత్య రూపకాన్ని ఉస్మానియా విశ్వవిద్యాలయ మహిళా కళాశాలలోని దర్బారు హాలులో ఏర్పాటు చేశాం. వేలాది సంఖ్యలో ప్రేక్షకులు వచ్చారు. తెలుగుదనం, తెలుగుపద్యం హృద్యంగా లాస్యంచేసి ఆ ప్రయోగం అశేష ప్రజాదరాన్ని చూరగొన్నది.

ఈ మొదటి ప్రదర్శనంలో శ్రీకృష్ణదేవరాయలుగా శ్రీ కప్పగంతుల లక్ష్మణశాస్త్రిగారూ, మహామంత్రి తిమ్మరుసుగా నేనూ వ్యవహరించాం. శ్రీయుతులు కేశవపంతుల నరసింహశాస్త్రి, దివాకర్ల వేంకటావధాని, సన్నిధానం సూర్యనారాయణశాస్త్రి, పాటిబండ మాధవశర్మ, చెలమచెర్ల రంగాచార్యులు, వేటూరి ఆనందమూర్తి, ఉత్పల సత్యనారాయణాచార్యులు, దాశరథిగారలు అష్ట దిగ్గజాలుగా అభినయించారు. వారిలో కేశవపంతులవారు పెద్దనగా, ఆనంద మూర్తిగారు నంది తిమ్మయగా, దివాకర్లవారు భట్టుమూర్తిగా, ఉత్పలవారు

పింగళిసూరనగా, దాశరథిగారు తెనాలి రామకృష్ణుడుగా, ప్రతిభావంతంగా తమ తమ పాత్రలను నిర్వహించి సభికుల మన్ననలను అందుకున్నారు. ఆనాడా సాహితీ రూపకం ప్రదర్శింపబడిన ముహూర్తబలం ఏమిటో గాని తెలంగాణంలో ఆప్రదర్శనం ఒక విధమైన సాహితీ చైతన్యానికి కారణభూతమైంది.

అప్పుడు మొదలైన 'భువన విజయం' దివాకర్లవారి సూత్రధారిత్వంలో ఎన్నో ప్రదర్శన లిచ్చింది. క్రిందటి ఆదివారం అంటే 10-3-1985 నాడు తాడేపల్లిగూడెంలో 'భువన విజయం' జరిగింది. దానితో 300 ప్రదర్శనలు పూర్తి అయ్యాయి.

దాదాపు మూడు దశాబ్దాలుగా మూడు వందల ప్రదర్శన లిచ్చిన భువన విజయానికి ప్రజలలో ఆదరణ నానాటికీ పెరుగుతూనే ఉంది, కాని, తరగటం లేదు. పల్లెపట్టులలో కూడా ఈ ప్రదర్శనం జరిగినపుడు జనులు తండోప తండాలుగా వచ్చేవారు. దాదాపు నూరు పద్యాలకు తక్కువ లేకుండా అష్టదిగ్గజ పాత్రధారులు చదువుతారు. అయినా ఆబాలగోపాలం ఆసక్తితో వాటిని వింటున్నారు. ఈ రూపకంలో ఒక ప్రత్యేకత ఉంది. రాయల పాత్రనూ, తిమ్మరుసు పాత్రనూ పోషించే వారు ఆహార్యాలంకరణం చేసుకుంటారు. అష్టదిగ్గజ పాత్ర ధారులు పండితుల తలపాగాలు, శాలువాలూ ధరించి ఆనాటి కవులను స్ఫురింప చేస్తారు. ఆయా కవులు రచించిన పద్యాలనే సామాన్యంగా ఆయా పాత్రధారులు చదువుతారు. మొత్తం మీద ఒకనాటి రాయల సాహిత్య సభ ఎలా నిండుగా జరుగుతుందో ప్రదర్శించి, ప్రేక్షకుల హృదయాల్లో ఒక దండి అనుభవాన్ని అందించేలా రూపకం దాదాపు మూడు గంటలసేపు సాగుతుంది. ఆంధ్ర ప్రబంధాలలోని పద్యాలను హృద్యంగా చదువుతూ ఉంటే సామాన్యజనులు కూడా సముత్సాహంతో వినటం నేటికీ ప్రత్యక్ష సాక్ష్యం.

తెలంగాణంలో సాహిత్యచైతన్యం కలగటానికి భువన విజయ సాహిత్య రూపకం సముచిత పాత్ర నిర్వహించిం దనటం చారిత్రక సత్యం. ఒకనాడు తెలంగాణా రచయితల సంఘం కవి సమ్మేళనాలను జరిపి యువతరంలో కవితా చైతన్యాన్ని మోసులెత్తింప చేసింది. ఆ తరువాత దివాకర్ల వారి ఉపన్యాస పరంపర సాహితీ సమవగాహనను జాగృతం చేసింది. ఆ తరువాత వారి అధ్య

ర్యవంలో నిర్వహింప బడుతున్న భువన విజయ సాహిత్య రూపకం సాహితీ రసికత్వాన్ని ప్రజలలో వ్యాపింప చేయటానికి బలంగా తోడ్పడింది. తెలుగు పద్యంలోని ఒడుపులు, పద్యం భావ యుక్తంగా చదవటంలోని చెణుకులు తెలుగువారి హృదయాలను ఈ నాటికీ ఉర్రూత లూగింప చేస్తున్నవి.

'భువన విజయం'లో నాటికీ నేటికీ పాల్గొంటున్న ప్రజ్ఞామూర్తి ఆచార్య దివాకర్ల వేంకటావధాని గారు. వారు ఆచార్యులైనా, ఆంధ్రశాఖకు అధ్యక్షులైనా, కళాప్రపూర్ణులైనా, ఎన్నిసాహితీ సంస్థలలోనో ఎనలేని గౌరవాల నందుకున్నా భువన విజయంలో పాల్గొనటం మాత్రం మానలేదు. 'భువన విజయం' ఒక నాటకమని వారెన్నడూ భావించలేదు. పద్యరచనలోని హృద్యమైన కవితా మాధుర్యాన్ని ప్రజలకు పంచిపెట్టటానికి భువన విజయం ఒక వాఙ్మయ యజ్ఞమని భావించారు. దానిలో పాల్గొంటున్న విద్వాంసులకందరికీ అదేభావాన్ని ఆదర్శంగా అందించారు. వారితో పాటు ఆ ప్రదర్శనంలో పాల్గొంటున్న విద్వాంసులందరూ దానిని సాహితీ సమారాధనంగానే భావించి ఆ రూపకానికి ప్రాణం పోస్తున్నారు. సాహితీ రూపక ప్రక్రియ కొక అభినవరూపాన్ని కల్పించారు.

మూడు దశాబ్దాల మహోజ్జ్వల జీవితాన్ని నిర్వహించిన ఈ సాహితీ రూపకంలో ఎందరో కవులు, పండితులు పాల్గొన్నారు. కేంద్ర మంత్రులు శ్రీ పి. వి. నరసింహారావు గారు ఒకసారి శ్రీకృష్ణదేవరాయల పాత్రను పోషించారు. ఆ పాత్రకు ఒక ఉన్నత ప్రమాణాలను కల్పించినవారు శ్రీ గుంటూరు శేషేంద్ర శర్మగారు. పెద్దన పాత్రకు మొదట్లో పెద్దరికం కలిగించినవారు శ్రీ కేశవ పంతుల నరసింహశాస్త్రిగారు. తరువాత ఆ పాత్ర నొక మేరుశిఖరంలా మలచిన వారు దివాకర్లవారు. పాటిబండవారు ఒకప్పుడు నందితిమ్మయ పాత్రకు పారిజాత పరిమళాలను సమకూర్చారు. ఇప్పుడు రాయల పాత్రకు శ్రీ అయ్యదేవర పురుషోత్తమరావు, తిమ్మన పాత్రకు శ్రీ అక్కిరాజు సుందరరామకృష్ణ గారలు రాగ రంజితమైన రసికతను సంతరిస్తున్నారు. తిమ్మరుసు పాత్రకు ప్రాణం పోస్తున్న వారు డా॥ ముదిగొండ శివప్రసాదుగారు. ధూర్జటి పాత్రను చైతన్యవంతంగా పోషిస్తున్నవారు శ్రీ ముదిగొండ వీరభద్రమూర్తిగారు. అప్పటికీ ఇప్పటికీ ఉత్పలవారు పింగళి సూరన పాత్రలో తాము జీవిస్తూ, ప్రేక్షకులను జీవింపచేస్తున్నారు. అయ్యల రాజు రామభద్రుడుగా డా॥ కె. రాజన్నశాస్త్రిగారు, మాదయగారి మల్లనగా డా॥ తిరు

మల శ్రీనివాసాచార్యగారు ప్రదర్శన కొక నిండుదనాన్ని కలిగిస్తున్నారు. భట్టుమూర్తి పాత్రను శ్రీ తిరుమల శేషాచార్య, శ్రీ ఐ. సీతాపతిరావు గారలు నిర్వహిస్తున్నారు. తెనాలిరామకృష్ణ పాత్రను డా॥ జి.వి. సుబ్రహ్మణ్యం జనరంజకంగా పోషిస్తున్నాడు. ఈ ముప్పయ్యేళ్ళలో ఆయా పాత్రలను పోషించిన వ్యక్తులొక్కొక్కసారి మారియుండవచ్చు. కొందరు దివంగతులై యుండవచ్చు. అయినా, ఆయా పాత్రలలో జీవిస్తున్న పండితుల కృషితో ఆ రూపకం నేటికీ అజరామరంగా ముందుకు సాగుతూ ఆంధ్రుల మన్ననల నందుకొంటున్నది. మదరాసు, బొంబాయి, హోసూరువంటి ప్రాంతాల్లో కూడా ఈ రూపకం ప్రజాదరణ పొందగలిగింది.

తెలంగాణలో దివాకర్లవారి బృందం ప్రదర్శించే 'భువన విజయం' సాటిలేని మేటి సాహిత్య రూపకమనిపించుకున్నది. తీరాంధ్రంలో కొందరు పండితులు, కవులు ఈ రూపకాన్ని మరొక తీరుగా ప్రదర్శిస్తున్నారు. శ్రీయుతులు జమ్మలమడక మాధవరామ శర్మ, ఆచార్య యస్వీ జోగారావు, కరుణశ్రీ జంధ్యాల పాపయ్య శాస్త్రి, కొండవీటి వెంకటకవి, డా॥ ప్రసాదరాయ కులపతి, బృందావనం రంగాచార్యులు, డా॥ జంధ్యాల మహతీశంకర్ మొదలైన పెద్దలు ఈ రూపకంలో ఆయా పాత్రలను ప్రశంసనీయంగా పోషిస్తున్నారు. యువసంఘాలు దీనిని ప్రయోగాత్మకంగా చేపట్టి నిర్వహించటం యెడనెడ కనపడుతున్నది. ఎన్నితీరుల ఎందరు ప్రదర్శించినా 'భువన విజయా'నికి ప్రజలలో మన్నన మాత్రం సన్నగిల్లటం లేదు.

చారిత్రకుల దృష్టిలో అష్టదిగ్గజా లెవరు' అనే ప్రశ్న చర్చలకూ, రాద్ధాంతాలకూ రంగభూమి కావచ్చును కాని, ప్రజలకు మాత్రం ఆంధ్రభోజుని 'భువన విజయం' ఒక అమృతానుభూతి. రాష్ట్ర అవతరణోత్సవాలలో; ఉగాది వేడుకలలో ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం వారు ఈ సాహితీ రూపకాన్ని ఎన్నోసార్లు ప్రదర్శింపచేసి ప్రజాభిరుచిని గౌరవించారు. మొదటి ప్రపంచ తెలుగు మహాసభల కార్యక్రమాలలో దీనికి చోటు కల్పించారు. నేడు 'భువన విజయం' తెలుగువారు నిండుగుండెలతో ఆనందించే సాహితీ రూపక ప్రయోగం.

దివాకర్ల వారు భువన విజయంతో పాటు మరికొన్ని సాహితీ రూపకాలను రూపొందించి ప్రయోగించారు. వాటిలో భారతావతరణం, కనకాభిషేకం,

శారదా ధ్వజం, ప్రజల మన్ననలకు పాత్రమయ్యాయి. 'కవిబ్రహ్మ' రూపకల్పనం జరుగుతున్నది. తీరాంధ్రంలో మరికొన్ని సాహితీ రూపకాలను పండిత కవులు రూపొందిస్తున్నారు. ప్రాచీనాధునిక కవుల పాత్రలతో వివిధ ప్రయోగాలను చేస్తున్నారు. కొన్ని పేరడీలు, అధిక్షేపాత్మక రూపకాలు, కూడా వెలువడుతున్నాయి. ఏమైనా, భువన విజయానికున్న ప్రాచుర్యం మిగిలిన వాటి కున్నట్లు కానరాదు. ఒక్కటి మాత్రం నిజం. ఆంధ్రప్రదేశ్ అవతరణంతో పాటు తెలుగునేలపై సాహితీ రూపకాల ఆవిర్భావం కూడా జరిగిందని చెప్పాలి.

ఆంధ్ర సాహిత్య చరిత్రను రూపకంగా చిత్రీకరించాలన్న భావన కూడా మాలో ఉన్నది. దాదాపు ఇరవై యేళ్ళ క్రితం అటువంటి ప్రయోగం హైదరాబాదు లోని వివేకవర్ధిని కళాశాల తెలుగు శాఖవారి అధ్వర్యవంలో మేము ప్రదర్శించాం. అది ఎందరినో ఆకర్షించింది. వ్యయ ప్రయాసలతో కూడుకున్న ఆ ప్రయోగం ఆ తరువాత మరలా ప్రాచుర్యానికి రాలేదు. ఆంధ్రప్రదేశ్ సాంస్కృతిక శాఖ శాఖవారు ఆటువంటి ప్రయోగాన్ని చేపట్టి తెలుగు సాహిత్య చరిత్రలోని మహో జ్జ్వల ఘట్టాలను తెలుగు ప్రజలకు అందించ గలిగితే నేటి యువతరం తెలుగు దనాన్ని మరింత అవగాహన చేసుకొనటానికి వీలౌతుంది. విశ్వనాథవారి రేడియో రూపకాలు శ్రవణానందాన్ని కలిగించాయి. 'తెలుగు సాహిత్య రూపక ప్రదర్శనం' శ్రవణానందంతో పాటు నయనానందాన్ని, రసానందాన్ని కూడా కలిగించే నూత్న ప్రయోగాన్ని అందించగలదు.

తెలుగు వారి సాహితీ వైభవాన్ని సామాన్య ప్రజల కందించే ప్రయత్నం ప్రభుత్వం చేపట్టాలి. తెలుగు సాహిత్య చరిత్రకు రూపక మర్యాదలో అభినవ రూప వైభవాన్ని అందించాలి. రాష్ట్ర సాంస్కృతిక శాఖ ఈ ప్రయోగాన్ని చేపట్టి, తగిన పండితుల, కళాకారుల సాయంతో దానికి తగిన రూపకల్పన చేసి, రాష్ట్రంలో నలుమూలలా ప్రదర్శన లిప్పించి ప్రజలలో ఉత్తమ సాహిత్యావ గాహనను కలిగించాలి. 'తెలుగుదేశం' తెలుగు జాతికి సమర్పించే వెలుగు తోర ణంగా ఈ సాహితీ రూపక ప్రయోగం రూపొందగలదని ఆశిద్దాం !

(ఆంధ్రప్రభ; 18-3-1985;)

# 2

సాహిత్య చరిత్రను కావ్యంగా వ్రాయటం ఎంత కష్టమో, రూపకంగా చిత్రించటం కూడా అంత కష్టమే. పూజ్యులు మధునాపంతుల సత్యనారాయణ శాస్త్రిగారు 'ఆంధ్ర పురాణం' రచించి సాహిత్య చరిత్రతో ముడిపడియున్న రాజులనూ, కవులనూ కావ్యప్రక్రియ నాశ్రయించి చిత్రించారు. ఆంధ్రపురాణం ఒక అపూర్వ చారిత్రక కావ్యంగా తెలుగులో వెలువడింది. పండితుల ప్రశంసలను అందుకొన్నది. సహృదయుల సమ్మానాలను పొందగలిగింది.

సాహితీ జగత్తుకు చరిత్ర సమాదరణీయమైతే, సామాన్య ప్రజకు కవి జీవితాలు ఆస్వాద మధురాలుగా ఉంటాయి. అయితే, తెలుగు కవుల జీవితాలు సమగ్రంగా మనకు తెలియవు.

అందులోనూ ప్రాచీన కవుల చరిత్రలు కొన్ని పుక్కిడి పురాణాలుగా ఉంటూ చారిత్రక ప్రామాణికత్వాన్ని ఎన్నోచోట్ల పరిపోషించుకోలేకపోతున్నాయి. కట్టుకథలు కూడా కమనీయంగా ఉంటాయని కవుల చరిత్రలు మనకు ధ్రువ పరుస్తున్నాయి. తెలుగువారి హృదయాల్లో చోటు చేసుకున్న ప్రాచీన మహాకవులెందరో ఉన్నా వారి కథలను గాథలుగా రసవత్తర సన్నివేశాలుగా చెప్పుకో గలిగిన వారు కొందరే మిగులుతారు. వారందరిలో అగ్రతాంబూలం పోతన్న గారికి దక్కుతుంది. ఆయన వెంట శ్రీనాథుడు వెలుగులు నింపుకుంటాడు. తెలుగునాట పోతన భాగవత కవిత కెంత ప్రచారం ఉందో, ఆయన బాధామయ జీవితానికీ, భక్తి ప్రపత్తికీ అంత ప్రాచుర్యం ఉంది. పోతన జీవితంలోని సహజమైన సంఘర్షణ ప్రజల హృదయాన్ని ఆకట్టుకొంటుంది. పోతన రాజులకు కావ్య కన్యను అంకితమీయని ఉదాత్తాశయాన్ని పాటించి భగవదంకితంగా భాగవతాన్ని రచించి ఆయన ఎదుర్కొన్న అగచాట్లు జనుల హృదయాల్లో సానుభూతినీ, సహానుభూతినీ సృష్టింపగలిగాయి. ఆయనలోని భక్తి పారవశ్యం కవితామయంగా జాలువారినప్పుడు సామాన్య ప్రజసైతం రసలోకంలో విహరించి తన్మయత్వం భజిస్తుంది. పోతన జీవితంలో నాటకానికి తగిన సంఘర్షణ, సన్నివేశ చాతుర్యం, సహృదయ రసానుభవ శక్తి సహజంగా ఉండటంవల్ల ఆ మహాకవి జీవితం రూపక గౌరవాన్నే కాక, చలనచిత్ర వైభవాన్ని కూడా పొందింది. 'అభినవ

పోతన' వానమామలై వరదాచార్యుల వారి పోతన కావ్యం ప్రజాదరణాన్ని చూరగొన గలిగింది.

విశేషమేమంటే యుగకర్తగా కీర్తింపబడే శ్రీనాథుని జీవిత విశేషాలు మన కెన్ని తెలిసినా ఆయనను ప్రజల భావనాజీవితంలోని పాత్రగానే మనం మన్నిస్తాం. ఒక విధంగా పోతన కథలో శ్రీనాథుడు ప్రతినాయకుడు. చారిత్ర కంగా వారిద్దరు బావమరదులని చెప్పటం అసంబద్ధం. కాని, లోకానికి వారిద్దరూ స్వయంగా బావమరదులు. వారిద్ద రుంటేనే కథ. ఆ కథ లేకపోతే ఆ నాటకం లేదు. ప్రజాభిరుచి వేరు. చారిత్రకుల సత్య దృష్టి వేరు. ప్రజలు పరంపరగా వారి కథలకు అల్లిక పెట్టారు. ఆ అల్లికతో నాటకమాడితేనే ఆమోదించి ఆనందిస్తారు.

పోతన జీవితం చలన చిత్రాలలో కూడా రూపొందింపబడింది. కీ. శే. చిత్తూరు నాగయ్యగారు పోతన పాత్రను తెలుగువారి హృదయాల్లో ఉన్న ఊహా పాత్రకు ఊపిరిపోసి చూపించారు. వా రా పాత్రలో జీవించారు, జనులను జీవింప చేశారు. ఆయన ప్రక్కన శ్రీనాథ పాత్రకు జీవం పోసినవారు కీ. శే. జంధ్యాల గౌరీనాథశాస్త్రి గారు. ఆ కవులతోపాటు ఆ కళాకారులూ ఆంధ్రుల హృదయాల్లో అజరామరంగా నిలిచిపోయారు. ఆ తరువాత ఆ పాత్రల పరువాన్ని కాపాడిన వారు శ్రీ గుమ్మడి వెంకటేశ్వరరావుగారు, కీ. శే. ఎస్. వి. రంగారావు గారు. పోతన భాగవతంలోని పద్యాలను జాతి మర్చిపోతున్నా పోతన జీవితంలోని విలువలను మాత్రం కళ జ్ఞాపకం చేస్తున్నది. శ్రీనాథుని ప్రౌఢ సాహితిని యువతరం మననం చేసుకోలేకపోతున్నా ఆ మహాకవి చాటువులను రసికత్వాన్ని స్మృతిపథంలో నిలుపుకొంటున్నది. దానికి కారణం ఆ కవుల జీవితాలు నాటకీ యంగా రాణించటమే. మాన్యశ్రీ నందమూరి తారక రామారావుగారు శ్రీనాథుని పాత్రను పోషించాలనే ఆశయంతో చలన చిత్రాన్ని రూపొందించే ప్రయత్నం చేస్తున్నారని వింటున్నాం. తెలుగుజాతి సాహితీ రసికత్వం ఇంకా సజీవంగా ఉన్నదనటానికి ఆ ప్రయత్నం ఒక తార్కాణం. భక్తికి పోతన్న, రక్తికి శ్రీనాథుడు సాహిత్య చరిత్రలో అపూర్వ రస చిత్రాలు. అద్భుత అనుభవ సూత్రాలు.

శ్రీనాథుడు కేంద్రంగా పోతన జీవితాన్ని తులనాత్మకంగా చిత్రించే యత్నాలు సాహితీ రూపక మర్యాదలో చెదురు మదురుగా సాగాయి. అందులోనూ

సాహిత్య చరిత్ర రూపకంలో అంతర్భాగంగా ఆ ఘట్టాన్ని రూపొందించిన ప్రయోగం 1965 లో జరిగింది. వివేకవర్ధినీ సాయం కళాశాల ఆంధ్ర సారస్వత సమితి 1965 జనవరి 27 వ తేదీన 'ఆంధ్ర సాహితీ దర్శనం' అనే - ఆంధ్ర సాహిత్య ప్రగతిని చిత్రించే సాంస్కృతిక కార్యక్రమాన్ని శ్రీ కొత్తపల్లి ఆంజనేయ శర్మ ఆధ్వర్యంలో నిర్వహించింది. చాళుక్య యుగంనుంచి దక్షిణాంధ్ర యుగం దాకా ఆరు ఘట్టాలను ఎన్నుకొని వాటిని ఆరు దృశ్యాలుగా ప్రదర్శించటం జరిగింది. భారతావతరణ ఘట్టాన్ని-'ఆదికవి' అనే పేర ఆచార్య దివాకర్ల వారురచించి నన్నయగా పాత్రధారణం చేశారు. తిక్కన యుగాన్ని "కవిబ్రహ్మ" అనే పేరుతో రచించి తిక్కనగా కీ. శే. పాటిబండ మాధవ శర్మగారు అభినయించారు. ఆ రంగంలో అప్పటి మంత్రులు మాన్యశ్రీ శ్రీ ఎం.ఆర్. అప్పారావుగారు మనుమసిద్ధిగా వ్యవహరించారు. ఎర్రన యుగాన్ని కీ.శే. నిడుదవోలు వెంకటరావు గారు "ప్రబంధ పరమేశ్వరుడు" అనే రంగాన్ని రచించి స్వయంగా ఆ పాత్రను పోషించారు. మాన్యశ్రీ తెన్నేటి విశ్వనాథం గారు వేమారెడ్డి పాత్రను నిర్వహించటం విశేషం. నాలుగో రంగం కవి సార్వభౌముడు. ఆ రంగాన్ని నేనే నిర్మించి శ్రీనాథుని పాత్రను నిర్వహించాను. శ్రీ ఉత్పల సత్యనారాయణా చార్యుల వారు బమ్మెర పోతనగా ఆ పాత్రకు జీవం పోశారు. అయిదో రంగం 'భువన విజయం' ఆరో రంగం 'విజయభువనం'. రాయల సాహితీ సభా విశేషాలను రూపక రంగంగా నేను రచిస్తే, రఘునాథ రాయల సభను శ్రీ వేటూరి ఆనందమూర్తిగారు రూపక రంగంగా రచించి స్వయంగా చేమకూర వెంకట కవి పాత్రను ధరించారు. ఆ రంగంలో శ్రీ బాలాంత్రపు రజనీకాంతా రావుగారు క్షేత్రయ్యగా, శ్రీమతి నాయని కృష్ణకుమారిగారు రామభద్రాంబగా, శ్రీమతి పి. యశోదారెడ్డిగారు రంగాజమ్మగా వ్యవహరించారు. ఆనాడు శ్రీకృష్ణదేవరాయల పాత్ర నిర్వహించినవారు మాన్యశ్రీ పి.వి. నరసింహారావుగారు. ఆహార్య ధారణం లేకపోయినా ఆనాడు ఆ రూపకం రక్తి కట్టింది. ఆరు శతాబ్దాల ఆంధ్ర సాహిత్య పరిణామం దర్శనీయంగా రూపొందింది.

రూపక చిత్రణంలో చారిత్రకాంశాల కంటె రసవత్తర సన్నివేశ కల్పనానికే కొంత ప్రాధాన్యం ఏర్పడటం సహజం. అందులోనూ పోతన జీవితాన్ని శ్రీనాథుని జీవితంలో భాగంగా చిత్రించటం రూపక ప్రక్రియ నాశ్రయించటం

వల్లనే వీలు పడింది. శ్రీనాథుని జీవితంలోని చరమరంగం ప్రదర్శనకు ఎన్ను కోవటం జరిగింది. చెరసాలలో శ్రీనాథుడు. పోతనను ఫ్లాష్‌బాక్ పద్ధతిలో ప్రవేశ పెట్టబడటం విశేషం. ఆ పాత్రల మనస్తత్వాలను తులనాత్మకంగా చిత్రించటం, ప్రవృత్తి నివృత్తులకు గల తారతమ్యాన్ని సహృదయ సమీక్ష చేయటం ఆ రంగ ప్రయోజనం. ప్రవృత్తిలో నుంచి నివృత్తి ఎలా సహజంగా అల్లుకుని పూలుపూసి ఫలవంతమవుతుందో ఆ యుగ చైతన్య మూర్తుల సాహితీ దృక్పథాల ననుసరించి సమీక్షించటం ఆ రంగధ్యేయం. సాహితీ రూపకం సామాన్య జనుల నాకర్షిస్తూనే సాహితీ తత్త్వాన్ని దర్శింపచేయాలి. శ్రవణానందంలో మంచి ఆలోచనా మృతాన్ని సృష్టించాలి. సాహిత్య రూపకం నాటకం లాగా చలన చిత్రం లాగా సజీవ పాత్రలతో పాటు సాహితీ తత్త్వాన్ని కూడా సహృదయుల కందించాలి. అందుకు ప్రయోగాలు వెలువడాలి. ప్రజల మధ్య వాటిని ప్రదర్శించాలి.

పోతన తరువాత తెలుగు వారి హృదయాలలో స్థిరమైన పీఠం కల్పించు కున్న వాడు వేమన. 'కామి గాక మోక్షగామి కాడు' అనే సూక్తి ఆయన పట్ల అన్వర్థం. రక్తి నుండి విరక్తి వైపు పయనించిన ఆ కవిలోని పరిణామం పరమ రమణీయం. కవిత ఆతని మారుతున్న జీవిత ఘట్టాలకు, ప్రవృత్తులకు ప్రత్యక్ష వ్యాఖ్యానం. వేమన కవిత ఆయన జీవితాన్ని దర్శించటానికి అమరిన గవాక్షంలా ఉంటుంది. సాహితీ వేత్తలకు ఆయన పద్యం కావాలి. సామాన్య జనానికి ఆ పద్యం వెనుక ఉన్న వేమన యోగి కావాలి. భోగయోగాల మధ్య పద్యవారధి వేమన సాహితీ యాత్ర. సాహిత్య చరిత్ర రూపకంలో వేమన్న ఒక్కడూ ఒక రంగాన్ని ఆక్రమిస్తాడు. అతని జీవితం ఒక యాత్ర. ఆ యాత్రలో అతనిది ఏకైక పాత్ర.

పోతన, వేమనల తరువాత ప్రజాదరణం పొందిన సాహితీ మూర్తులు త్యాగయ్య, తెనాలి రామకృష్ణుడు, క్షేత్రయ్య, శ్రీకృష్ణదేవరాయలు, రామదాసు. పదకర్త అయిన త్యాగయ్య జీవితం నిధికీ, రాముని సన్నిధికీ ఉన్న అంత రాన్ని చూపించే నాదవేదసారం. కృతులలో జాలువారిన సుకృతి ఆ మహితాత్ముని జీవితం. పాటా, భక్తీ సంగమించిన సాహిత్య తీర్థం. క్షేత్రయ్య జీవితం నాట్య సంగీత పదద్వయ మంజీరనాదం. భక్తికి మూలమైన భగవద్రతి శృంగార రసోన్నిద్రంగా సాగిన మధుర ఫణితి ఆయన పద సాహిత్యం. మధుర భక్తిలోని

అవస్థా భేదాల కోసమే ఆయన జీవితాన్ని చూస్తాం. వింటాం. రామదాసు కథ భగవంతుణ్ణి నమ్ముకున్న భక్తుడు పడే బాధ. ఈ ముగ్గురూ ప్రజల హృదయాలలో మొదట భక్తులు, ఆపైన కవులు. రామకృష్ణుడు వికటకవిగా ప్రసిద్ధుడు. అతని జీవితం రాయల జీవితంతో అల్లుకొని పోయింది. వీరిద్దరి జీవితాలూ ప్రజలలో మహాకవుల జీవితాలుగా జీవించటంలేదు. రామకృష్ణుని హాస్యచమత్కారమే ఆయన జీవితం. రాయలవారి సాహితీ పోషణమే ఆయన రాసిక్యం. ప్రజలలో ఆయా పాత్రలు ఏయే గుణాలతో జీవిస్తున్నారో వాటికి ప్రాధాన్యతను కల్పించు కుంటూనే సాహితీ వ్యక్తిత్వాలను కూడా సహృదయ మనోమందిరాల్లో స్థాపించ టానికి సాహితీ రూపకం కృషిచేయాలి.

సాహితీ రూపకాలు అచ్చమైన నాటకాలు కావు. నాటకీయతను అందగించు కునే రమణీయ సాహితీ సన్నివేశ సంవిధాన శిల్పాలు. అవి చారిత్రక సత్యాలుగా నూటికి నూరుపాళ్ళూ రాణించకపోవచ్చు. కాని, అసత్యగాథాలహరి కూడా కాదు. వాస్తవానికి ప్రజలలో వ్యాపించియున్న వాఙ్మయగాథలకూ ఒక అంతరంగ సంవిధానం, ప్రజల గుండెల్లో గూడుకట్టుకున్న కవుల వ్యక్తిత్వాలకు చతుర రూపకరంగప్రయోగం - సాహితీరూపకం. కవుల ప్రభావం జాతిమీద ఉంది. వాళ్ళను గూర్చిన కలలు జాతి కళ్ళల్లో నేటికీ మిలమిలా మెరుస్తున్నాయి. ఆ కలల్లోని కళలను కవుల కవితా వ్యక్తిత్వాలకు రూపకాలంకారాలుగా అలంకరించే వాఙ్మయ రూపక ప్రక్రియయే సాహిత్యరూపకం. గత సాహితీ వైభవాన్ని కన్నుల పండువుగా, వీనుల విందుగా చేసే ప్రక్రియ సాహిత్య రూపకం.

(ఆంధ్రప్రభ; 26-3-1985)

# గిడుగు భాషా పరిశోధన సంస్థ

మార్చి 23, 24, 25 తేదీలు బరంపురంలోని తెలుగువారికి సాహిత్య రసోల్లాసాన్ని కలిగించిన వేడుక రోజులు. బరంపురం ఒరిస్సా రాష్ట్రంలోని గంజాం జిల్లాలో ఉన్న నగరం. అందులో ఆంధ్ర భాషా సాహిత్యాలకూ కళా సేవకూ అంకితమైన సాహిత్య సంస్థలలో ప్రాచీనమైంది 'ఆంధ్ర భాషాభివర్ధనీ సమాజం'. 1909 లో స్థాపింపబడిన ఆ సమాజం 1984 నాటికి 75 సంవత్సరాలు పూర్తి చేసుకుని పై తేదీలలో ప్లాటినం జూబిలీ వేడుకలను వైభవోపేతంగా జరుపుకున్నది. ఆ వేడుకలను తెలుగులో అమృతోత్సవాలని సార్థకంగా పిలుచు కొన్నది. దాదాపు 300 మంది సభ్యులున్న ఆ సమాజం అటు ఒరిస్సా ప్రభుత్వాన్ని గాని ఇటు ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వాన్నిగాని ఎటువంటి ఆర్థిక సహాయాన్నీ అర్థించకుండా స్థానిక ఆంధ్రాభిమానుల సహాయ సహకారాలతోనే ఉత్సవాలను సముత్సాహంగా జరుపుకోవటం విశేషం.

బరంపురంలోని ప్రకాశం హాలులో సమావేశమైన వేలాది తెలుగు ప్రజలు ఆంధ్ర భాషకూ, సాహిత్యానికీ ఆ ప్రాంతం ఆదినుండీ చేస్తున్న సేవా విశేషాలను స్మరించుకుని హర్షోత్సాహాలను ప్రకటించారు. బరంపురం పేరు వినగానే ఆంధ్ర సాహితీ లోకానికి 'వేగుచుక్క గ్రంథమాల' స్మృతిపథంలో మెరుస్తుంది. ఆ గ్రంథమాల తెలుగులో వెలసిన గ్రంథమాలలలో అత్యంత ప్రాచీనమైనది. భాగవతుల నృసింహ శర్మగారూ, తాపీ ధర్మారావుగారూ దానిని స్థాపించి నిర్వహించారు. తెలుగులో తొలి అపరాధ పరిశోధక నవలను గ్రంథమాల ప్రచురించినట్లు స్పష్టమవుతున్నది. గ్రంథమాల వెలువరించిన ప్రచురణలలో ముఖ్యమైనవి ఉగ్రభైరవము, పద్మరాగము, చపల, కాశీఘట్టు రహస్యములు, విషమ రహస్యము, దుర్గాదాస్, కాంతాపహరణము, ఉత్తమ వంచకులు, నేనే, వాడే పీడు మొదలైనవి. తాపీ ధర్మారావు గారి 'ప్రొద్దు పొడుపు', వారణాసి అచ్యుతరామకవిగారి 'కవిసురతాణి పరిణయము' అనే గ్రంథాలు ప్రత్యేకంగా పేర్కొనదగినవి.

వ్యావహారిక భాషోద్యమాన్ని సాగించిన గిడుగువారికి బరంపురం సహకార రంగస్థలంగా నిలిచింది. నానావర్ణ పంక్తి భోజనాల వంటి సంస్కరణ చైతన్యానికి ఆ నగరం ఆసట బాసటగా నిలిచింది. గురజాడవారి అభ్యుదయ కవితా ప్రస్థానానికి ఆ పట్టణం స్ఫూర్తిశక్తిగా పరిఢవిల్లింది. కవితకూ, నవలకూ, భాషా సాహిత్య విమర్శకూ ఆ సాహితీ క్షేత్రం ఇప్పటికీ చైతన్య క్షేత్రంగా వెలుగొందుతున్నది. నిన్న మొన్నటిదాకా ఉప్పల లక్ష్మణరావుగారు ఆ నగరంలో సాహితీ చైతన్యానికి సమున్నత కేంద్రంగా ఉన్నారు. వారి రచనల్లో 'అతడు - అమె' తెలుగు నవలా ప్రయోగాల్లో విశిష్ట స్థానాన్ని గడించుకున్న రచన అప్పటికీ ఇప్పటికీ భాషా సాహిత్యాలకు పట్టుకొమ్మ బరంపురం.

ఆంధ్ర భాషాభివర్ధనీ సమాజం ప్రతినెలా సాహిత్య సాంస్కృతిక సభలలో ఏదో ఒకదాన్ని తప్పక నిర్వహిస్తూ వస్తున్నది. సమాజానికి సొంత భవనం, సమావేశ మందిరం వుండటంవల్ల తన కార్యక్రమాలను నిర్విఘ్నంగా, నిర్విరామంగా జరుపుకోవటానికి వీలవుతున్నది. అమృతోత్సవాలలో సాహిత్యోపన్యాసాలూ, భాషా సదస్సు, కవిసమ్మేళనం ముఖ్య కార్యక్రమాలుగా జరిగాయి. సాంస్కృతిక కార్యక్రమాలలో "భువన విజయం" పతాకగా నిలిచింది. ఆ ఉత్సవాల ప్రారంభ సభలో ముఖ్య అతిథిగా ఒరిస్సా రాష్ట్ర గవర్నర్ మాన్యశ్రీ బి. ఎన్. పాండే హెల్గొని జ్యోతిని వెలిగించి శుభాశీస్సులను అందించారు. రెండవ రోజు సభలో ఒరిస్సా రాష్ట్ర సాంస్కృతిక శాఖామాత్యులు మాన్యశ్రీ గంగాధర మహాపాత్ర ముఖ్య అతిథిగా పాల్గొన్నారు. ముగింపు సమావేశంలో డిప్యూటీ స్పీకర్ మాన్యశ్రీ చింతామణి ధ్యానసమంత్ర ముఖ్య అతిథిగా పాల్గొన్నారు. ఒరిస్సా రాష్ట్ర భాషా సాంస్కృతిక వికాసంలో తెలుగువారు నిర్వహిస్తున్న సమన్వయాత్మకమైన కృషికి, సహజీవనాత్మకమైన ప్రవృత్తికి, తెలుగు భాషా సాహిత్యాలపట్ల వారి కున్న గాఢమైన అనురక్తికి ఆ అమృతోత్సవాలు అక్షరోదహరణాలుగా అందగించాయి.

మార్చి 24వ తేదీన జరిగిన భాషా సదస్సు సాహితీ జిజ్ఞాసువులకొక ఆలోచనామృతంగా అందగించింది. సదస్సులో ఎన్నుకొన్న చర్చాంశం "ఆధునిక తెలుగు సాహిత్యంలో ప్రామాణిక భాష ఆవశ్యకత". ఆ సదస్సుకు అధ్యక్షత వహించే అదృష్టం నాకు కలిగింది. ఆచార్య దివాకర్ల వేంకటావధానిగారు ముఖ్య

అతిథిగా, శ్రీ ఆవంత్స సోమసుందర్, డా॥ బూదరాజు రాధాకృష్ణ, డా॥ ముని గొండ శివప్రసాద్, డా॥ తిరుమల శ్రీనివాసాచార్య గారలు వక్తలుగా పాల్గొన్నారు. దాదాపు మూడు గంటలపాటు నడచిన ఆ సదస్సులో ప్రామాణిక భాషను గురించీ, సాహిత్యంలో దాని వినియోగాన్ని గురించి ఎన్నో విలువైన అంశాలు వెలుగులోకి వచ్చాయి.

ఆచార్య అవధానిగారు ప్రామాణిక భాషకు నియతి అవసరమని నొక్కి వక్కాణించారు. సోమసుందర్‌గారు తెలుగులో కృష్ణా గోదావరీ గుంటూరు జిల్లాల భాష కొంతవరకు ప్రామాణిక గౌరవాన్ని పొందిందనీ, అయితే పదాలను కావాలని వికృతం చేసే పద్ధతి అంత మంచిది కాదనీ పేర్కొన్నారు. డా॥ బూద రాజు రాధాకృష్ణగారు సృజనాత్మక, శాస్త్ర సాహిత్యాలలో భాషాస్థితులను వివేచిస్తూ, ప్రామాణిక భాషా వినియోగంలో ఆత్మీయతకూ, ఆబ్జెక్టివిటీకి ఉన్న తేడాలను తెలియచెప్పారు. రచయితల్లో సామాన్య లక్షణాలను, అసామాన్య లక్షణాలను విశ్లేషించారు. డా॥ శివప్రసాద్‌గారు మాట్లాడుతూ ప్రామాణిక భాషా స్వరూపాన్ని నిర్ణయించటంలో ప్రచారసాధనాల పాత్ర శక్తిమంతంగా ఉంటుందనీ, సాహిత్యంలో ఆ భాషను వినియోగించేటప్పుడు తీవ్రవాదాలకంటె సమన్వయ దృక్పథం సమాదరణీయమని పేర్కొన్నారు. డా॥ శ్రీనివాసాచార్య గారు ఈ ఉద్యమంలో విద్యార్థులూ, యువకులూ ప్రయోజనాత్మకమైన పాత్ర నిర్వహించినప్పుడే అర్థవంతమైన ఫలితాలు సాధ్యమని భావించారు. ఈ చర్చ ఒకనాటితో తేలేదికాదని, ఒక సదస్సుతో ముగిసేదికాదనీ అందరూ భావించారు. అయితే అటువంటి ఆలోచనకు సదస్సు ఒక ప్రారంభం చేసిందని అందరూ సంతోషించారు.

అధ్యక్షునిగా సదస్సును నిర్వహించిన నాకు ఆ సదస్సులో వెలువడిన విలువైనఅంశాలు సదస్సుకు నివేదించే అవకాశందొరికింది.సమకాలీన భాషకు ప్రామాణికత్వం ఏర్పడటానికి సామాజిక రాజకీయార్థికాది పరిస్థితులు తోడ్పడినంతగా కేవల శాస్త్రీయ ప్రమాణాలు దోహదం చేయలేదేమో. శిష్టవ్యావహారికంలో వున్న రూపాలు ప్రచార సాధనాల ప్రభావంవల్ల సామాన్యప్రజల్లో వ్యాపించి స్థిరపడతాయి. పత్రికలలోని భాష అన్నిప్రాంతాల వారూ చదువుతున్నారు. అర్థం చేసుకుంటున్నారు. ఆ బాణీలోనే రచనలు చేస్తున్నారు. కాని, పత్రికలు వారి

వారి గృహాల్లో, నిత్యవ్యవహారంలో మాట్లాడే భాష మాండలిక భాషా పదాలతో, యాసలతో సాగుతూ ఉంది. సాహిత్యవేత్తలు ఉపన్యసించే ధోరణి ఒకరకంగా, సంభాషణా ధోరణి మరొక రకంగా ఉండటానికి అవకాశా లున్నాయి. ఒక ప్రాంతంలోని మాండలికం మరో ప్రాంతంలో విపరీతార్థాన్నిస్తుంటే అది ప్రామాణిక భాషలో సముచితమైన అర్థంలో స్థిరపడి పోతున్నది. భాషకు బహిరంగ వ్యాకరణం కంటె అంతరంగ వ్యాకరణమే ముఖ్యం. పారిశ్రామికంగా అభివృద్ధి చెందిన ప్రాంతంలో వాడుకలో ఉన్న భాషే ప్రామాణిక భాషగా రూపొందే అవకాశాలు ఎక్కువగా ఉంటాయి. తెలుగులో అలాగే జరుగుతున్నది కూడా. ఒకవేళ ప్రామాణిక భాషను గురించిన నిర్ణయాలు ఏపరిషత్తయినా, ఏసదస్సైనా చేసినా వాటిని ప్రభుత్వ సంస్థలు గౌరవిస్తాయా? ఒకవేళ ప్రభుత్వమే ఒక సంస్థ ద్వారా అటువంటి ప్రయత్నం చేసినా పత్రికలూ, రచయితలూ, ప్రజలు దానిని తమ వ్యాసంగాల్లో వినియోగించే విధానాన్ని మన్నిస్తారా? అనేవి ఆలోచింపవలసిన అంశాలు. భాషను ప్రమాణీకరించే విధానంలో రచయితల, పాత్రికేయుల, ప్రచారసాధన ప్రయోగకర్తల, ప్రజల పాత్రను వివేచించ వలసి ఉంటుంది. వారి ప్రయోగాలను ప్రయత్నాలను సమన్వయించ వలసి వుంటుంది. సాహిత్యంలో భాషానుభూతిని కలిగించే భాషా ప్రయోగానికీ, ప్రామాణిక భాషా స్వరూపానికీ వున్న సారూప్య విభేధాలను వివేచింప వలసి వస్తుంది. ఇంత ప్రయత్నం జరిగినా వేగంగా మారిపోతున్న భాషా రూపాలను ఎప్పటికప్పుడు, కనీసం పదేళ్ళకొకసారియైనా, సమీక్షించి శాస్త్రీయమైన విశ్లేషణం చేయివలసి ఉంటుంది.

సదస్సు నిర్వహించిన కార్యకర్తల ఉద్దేశంలో రెండు అంశాలు స్పష్టమయ్యాయి. ఒకటి - ప్రామాణిక భాషను రూపొందిచటం. ప్రయోగాత్మకంగానైనా శాస్త్రీయంగా జరగాలని ఆకాంక్ష. రెండు: ఆధునిక సాహిత్య ప్రక్రియల్లో రచయితలు వాడుతున్న భాషలో సమర్థవంతమైన అభివ్యక్తి క్రమంగా మందగిస్తున్న సూచనలు కనపడుతున్న ఈ తరుణంలో ప్రామాణిక భాష అభివ్యక్తికి ఒక శక్తిమంతమైన రూపాన్ని కల్పించటానికి దోహదం చేస్తుందా అనే ఒక ఆశ! నిజానికి ఈ రెండంశాలూ ఆంధ్ర సాహితీ లోకంలో అంతర్మథనరూపంగా సాగుతున్న సజీవ సమస్యలే. వాటిని ఆంధ్రభాషాభివర్ధనీ సమాజం ప్రజలముందు

ప్రతిపాదిస్తున్నది. ఆంధ్రులు ఆలోచింపదగిన అత్యంత ఆధునిక భాషా సమస్య ఇది. అమృతోత్సవాలు ఆంధ్రసాహితీ లోకానికి అందించిన ఆలోచనాలోచనం ఇది.

సదస్సు ఏకగ్రీవంగా ఒక నిర్ణయాన్ని తీసుకున్నది. "నేడు తెలుగులో ప్రామాణిక భాషను రూపొందించుకొనే ప్రయత్నం సశాస్త్రీయంగా సాగాలనీ, ప్రచారసాధనాల్లో, ప్రభుత్వ ప్రచురణల్లో దానిని వినియోగించే యత్నం చేయాలనీ, విశేషించి పత్రికల్లో ఆ భాషను వాడే దీక్షను సంపాదకులూ, ప్రతికాధిపతులు పూనేటట్లు సూచించాలనీ, సాహితీ ప్రక్రియలలో రచయితలు భాషా ప్రయోగాన్ని చేస్తున్నప్పుడు ప్రామాణిక భాషాస్వరూపాన్ని సగౌరవంగా మన్నించాలనీ, ఈ సదస్సు తెలుగు ప్రజకు విన్నవిస్తున్నది. ఈ కార్యం సమర్థవంతంగా నిర్వహింప బడటానికి ఒక పరిశోధన అధ్యయన కేంద్రం స్థాపింప బడాలనీ, ఆ కేంద్రానికి గిడుగువారి పేరు ఉంచాలనీ, అది బరంపురంలో స్థాపింప బడాలనీ, పరిస్థితులు అనుకూలిస్తే ఒరియా భాషాధ్యయన కేంద్రాన్ని కూడా బరంపురంలో నెలకొల్పాలనీ, ఆ రెండు సంస్థలూ అక్కాచెల్లెళ్ళవలె కలిసి పనిచేయాలనీ, సంస్థలకు ఆంధ్ర, ఒరిస్సా రాష్ట్రాల ప్రభుత్వాలు ఆర్థిక సహాయాన్ని అందించాలని కోరాలనీ తీర్మానించటమైనది." ఇది ప్రవాసాంధ్రుల కోరిక కాదు. ప్రామాణిక భాషాభిమానులైన ప్రజలందరి కోరిక.

(ఆంధ్రప్రభ; 3-4-1985)

# సాహిత్యం మీద దాడి

1972 డిసెంబరులో ప్రసిద్ధ పాశ్చాత్య సాహిత్య విమర్శకుడు రెనెవెలక్ వ్రాసిన 'సాహిత్యం మీద దాడి' (ది ఎటాక్ ఆన్ లిటరేచర్) అనే వ్యాసం 'ది అమెరికన్ స్కాలర్' అనే పత్రికలో ప్రచురించబడింది. ఆ తరువాత 1982లో అదే పేరుతో పదకొండు సాహిత్య విమర్శన వ్యాసాలు గల సంపుటిగా వెలువడింది. రెనెవెలెక్ సాహిత్య విమర్శ ప్రపంచ దేశాల్లో చాల వరకు ప్రామాణిక గౌరవాన్ని సంపాదించుకొన్నది. ఆధునిక సాహిత్య రంగాల్లో వివిధ సాహిత్య సిద్ధాంతాల రాద్ధాంతాలను ప్రక్రియా ప్రయోగాల విలువల వివేచనలలో వెలువడిన వివాదాలను సమీక్షించి సాధికారికంగా సాహిత్య స్వరూప స్వభావాలను నిర్ధారణం చేయగల విద్వద్విమర్శకుడుగా ఆయన సాహితీ జగత్తులో ఒక సమున్నత స్థానాన్ని సముపార్జింపగలిగాడు.

20 శతాబ్ది ఉత్తరార్ధంలో సాహిత్యం మీద దాదాపు నాలుగు విధాలుగా దాడులు జరిగాయని ఆయన విశ్లేషించాడు. వాటిని స్థూలంగా పేర్కొంటే ఇలా ఉంటాయి. 1. రాజకీయ సిద్ధాంతాల ప్రేరణతో సాగిన దాడి. 2. భాష మనిషిలోని లోతైన భావాలనూ, అంతర్దృష్టినీ, విశ్వ రహస్యాలనూ అభివ్యక్తం చేయగలిగిన సామర్థ్యం లేనిదనే వాదం ప్రేరణగా సాగిన దాడి. 3. కవితా సౌందర్య తత్త్వానికి వ్యతిరేకంగా సాగిన దాడి. 4. భావ ప్రసార ప్రక్రియా భేదంగా రూపాన్ని మలుచుకునేదే సాహిత్యం కాబట్టి ఆధునిక ప్రసార సాధనాల ద్వారా రూపొందించే ప్రక్రియే సాహిత్యమని భావించేవారు సాగించే దాడి. ఈ నాలుగు రకాల దాడులూ సాహిత్య రంగంలో దుమారాలను రేపి, మౌలికమైన సాహిత్య తత్త్వాన్ని దర్శించటానికి అడ్డంకులను సృష్టించి, సాహిత్య విమర్శ మార్గంలో సంక్షోభాన్ని కలిగించాయని రెనెవెలక్ భావించాడు. దాడుల వలన కొన్ని విలువలు నేల కొరిగి పోయాయి. అయినా, సాహిత్యతత్త్వదర్శకులు తిరుగు దాడులు చేసి కొన్ని మౌలికమైన విలువలను సంరక్షించగలిగారు. ఈ తిరుగు దాడుల ఫలితంగా ఆ దాడులు కొన్ని దుమ్ము కొట్టుకుని పోయినాయి. చివరకు ఆ దాడులు ఏయే ప్రయోజనాలకోసం సాగాయో వాటిని విజయవంతంగా సాధించలేకపోవటమే కాకుండా, చేరుకోవలసిన గమ్యాన్నీ, చూపవలసిన వెలుగునూ సమర్ధనీయంగా ప్రదర్శింపలేక పోయాయి.

పూర్వ యుగాలలో సాహిత్యం పాలక వర్గాల ప్రయోజనాలకు ఊడిగం చేయటానికే ప్రధానంగా సృజింపబడింది. అభివృద్ధి నిరోధక లక్షణం దాని స్వభావం. ఉన్నత వర్గాల ఔన్నత్యాన్ని చిత్రించటమే దాని నైజం. వర్గవిభేద కల్పన, మేధావివైఖరి, సామాన్య ప్రజలకు అందరాని మ్రాని పండులా ఉండటమే దాని ఘనత. కాబట్టి అటువంటి సాహిత్యాన్ని సమూలంగా మట్టుపెట్టాలి. మానవునికి రాజకీయంగా అభివృద్ధి సాధించి, సాంఘికంగా అభ్యుదయాన్ని అందించే సాహిత్యమే ఆధునిక యుగంలో ఉపాదేయం అనేదే రాజకీయపరంగా సాగే దాడిలోని తాత్పర్యం.

భాషకూ, అభివ్యక్తికీ వాస్తవంగా సంబంధంలేదనీ,మనిషిలోని అంతరంగావస్థలను వ్యక్తం చేసే వాచ్యమైన శక్తి భాషకు లేదనీ,ఆంతరమైన బీభత్సాన్నిగానీ, సౌందర్యాన్నికానీ పదాలు ప్రత్యక్షంగా మోసుకొని రాలేవనీ, శబ్దంకంటె నిశ్శబ్దమే అభివ్యక్తికి సమర్థవంతమైనదనీ, ఒకవేళ అంతర్వ్యక్తిని శబ్దం వ్యక్తం చేయటానికి ప్రయత్నించినా అది సమగ్రంగా ప్రాతినిధ్యం వహించేటట్లు రూపొందదనీ అందువలన శబ్ద చిత్రాలనో, భావచిత్రాలనో ప్రతీకలనో, నాదాలనో ఆశ్రయించి ప్రసరింపవలసి వస్తుందనీ భాషాపరంగా సాహిత్యం మీదదాడి చేసేవారి అభిప్రాయం.

సాహిత్యం ఒక కళ అనీ, సాహిత్యానుభూతి అలౌకికమనీ భావించే సంప్రదాయం మీద తిరుగుబాటు మూడవది. ఈ తిరుగుబాటు దారులు కళానుభూతికీ, భౌతికానుభూతికీ ఉన్నభేదాన్ని పరిగణింపరు. సంప్రదాయ వాదుల సౌందర్య దృష్టినీ, సంవిధాన శిల్పాన్నీ, ఆకృతి శిల్పాన్నీ, సంవాదశిల్పాన్నీ, అర్థవిస్పష్టతనూ వీరు విశ్వసింపరు. కవితలోని భవ్యకవితావేశం కంటె, భౌతికాంశ విశ్లేషణం వీరి మతంలో ప్రధానం. వీరి దృష్టిలో కవిత కంటె కవివేరు, కవితా వస్తువు వేరు, కవితాకళ వేరు.

ఇక నాల్గవ దాడి సాంకేతిక దృష్టి ప్రధానమైనది. మనం నివసిస్తున్నది ఎలక్ట్రానిక్ యుగంలో భావప్రసారం లిఖిత సాహిత్యానికే పరిమితమై ఉండే రోజులు గతించాయి. వైజ్ఞానికంగా మనం ఎంతో పురోగతిని సాధించాం. నేటి సాహిత్యం ప్రచార సాధనాల ప్రక్రియలమీద ఆధారపడి ఉంది. జనజీవనంమీద టి. వి. ప్రభావం బలంగా ఉంది. నేటి మానవుడు విద్యుత్కాంతి ద్వారా సాహిత్యాన్ని సృష్టిస్తున్నాడు, దర్శిస్తున్నాడు, పఠిస్తున్నాడు, పదిల పరచుకొంటున్నాడు. ప్రసరణమే నేటి సాహిత్య జీవితం. ఇంత కంటె సాహిత్య ప్రమాణం మరొకటి ఉండబోదు అనేది ఈ వాద తాత్పర్యం.

ఈ వాదాలన్నింటిలోనూ సర్వ సామాన్యంగా కనపడే కొన్ని అంశాలు న్నాయి. సాహిత్యానికి సౌందర్యతత్త్వపరంగా కానీ, శాస్త్ర పాండిత్యపరంగా కానీ ఉండే నాణ్యతను ప్రమాణంగా అంగీకరించకపోవటం వీటిల్లో వినపడే సామాన్యధర్మం. అయితే, సాహిత్యాన్ని ఆధునికయుగ చైతన్యాన్ని దృష్టిలో పెట్టుకొని తమ తమ దృక్పథాల కనుగుణంగా నిర్వచించుకోవటానికి అవి యత్నించాయి. అందులోనూ నిత్యవ్యవహారంలో ఉండే అభివ్యక్తికీ, సాహిత్యంలో కనపడే అభివ్యక్తికీ కొంత భేదం ఉండక తప్పదని గుర్తించాయి. కానీ, సాహిత్య ప్రమాణాలను నిర్దేశించటంలో మాత్రం నూతన మార్గాలను అన్వేషించాయి. క్రొత్త పరికరాలనూ, పద్ధతులనూ నిర్దేశించాయి.

ఈ దాడులన్నీ సామూహికంగా సాహిత్య ప్రక్రియ లన్నింటి మీదా లక్షింపబడినవి. సాహిత్యంలో ఇతిహాసాలున్నాయి, పురాణాలున్నాయి, భావకవిత్వ ప్రక్రియ లున్నాయి. రూపకవిశేషా లున్నాయి, నవల, కథానిక వంటి వచన ప్రక్రియలున్నాయి, విమర్శవంటి వివేచన పద్ధతు లున్నాయి, జానపద సాహిత్యంలోని మౌఖిక ప్రక్రిల సముదాయా లున్నాయి. వీటన్నింటికీ ఆ యా ప్రక్రియా స్వరూప స్వభావాలనుబట్టి ప్రమాణాలు భేదిస్తూ ఉంటాయి. వీటన్నిటిలో కవిత్వానికి ఒక ప్రత్యేక ప్రతిపత్తి ఉంది. దానికీ సౌందర్యతత్త్వానికీ అవినాభావ సంబంధం ఉంది. కవితా ప్రక్రియలను, తదితర ప్రక్రియలను సమాంతరంగా భావించి అభివ్యక్తిలో సామ్యాన్ని కోరటం కళాత్మకమైన విలువలను కల్లోలం చేయటమే అవుతుంది.రాజకీయ ప్రమేయంతో సాగే దాడి ప్రక్రియలోని విషయానికి, భావజాలాని కిచ్చిన విలువ, దాని విశ్వజనీనమైన కళాత్మక శక్తికి ఇవ్వటం లేదు. ప్రబోధానికి, ప్రచారానికి యిచ్చిన గౌరవం కళాభివ్యక్తికి ఇవ్వటం లేదు.కవితకు కాని, కళాప్రక్రియలకు కాని రాజకీయ,సామాజిక, ఆర్థికశాస్త్ర ప్రమాణాలు విలువలనునిర్ధారించే నికషోపలాలుకాజాలవు భాషకు అభివ్యక్తి లేదనటం పరిహాసాస్పదం. అయితే, వాచ్యంగా చెప్పటం కళాస్వభావం కాదు. అది కళారాహిత్య చిహ్నం. కళాభివ్యక్తికి సృజనాత్మక శక్తి ముఖ్యం. శబ్దం అర్థ సమర్పణంలో వ్యంగ్య శక్తిని ప్రదర్శిస్తుంది. భాషకు కళ జీవన ధర్మం. వాచ్యమైన వాక్కు కళావాహినిగా భాసిస్తే భాష బలహీనంగానే కనబడుతుంది. భావప్రతీకగా, అనుభూతికి ఆలంబనంగా భాషను దర్శించినప్పుడే కళాజగత్తులో భాష ఆస్వాద మధురంగా అందగిస్తుంది. సాహిత్యంలో రచయిత తన ధర్మనాన్ని సృజిస్తాడు,

తన భావాలను అభివ్యక్తీకరిస్తాడు. తన కోరికలను కళాత్మకంగా ప్రసారం చేస్తాడు. కవి కవితను ప్రజలకోసం చెబుతున్నా, వారి కందు బాటులో ఉన్న భాషను గ్రహిస్తున్నా, దానిని కళగా ఆవిష్కరిస్తాడు. ఆ కళాగౌరవం లేకపోతే కవితకు, ప్రచారానికీ, పత్రికా రచనలకూ, ప్రకటనల పద్ధతికీ తేడాలేకుండా పోతుంది. ప్రచార సాధనాలే సాహిత్య ప్రతిపత్తికి ప్రమాణాలని భావిస్తే సాహిత్య ప్రమాణాలకే స్వస్తి చెప్పే తరుణం ఆసన్నమవుతుంది. సాహిత్యం సమాజానికి రాజకీయ విద్యను బోధించటానికి ఉపకరణంగా కానీ, ప్రజలలో కొన్ని సిద్ధాంతాల ప్రచారానికి సాధనంగా కానీ భావించే వారి మాట అటుంచి, సాహిత్యాన్ని ఒక కళగా సమాదరించే సహృదయ జగత్తు మాత్రం సౌందర్య తత్త్వం సాహిత్య ధర్మంగా సమ్మానిస్తుంది.

నిజంగా ఈ యుగంలో కావలసింది సాహిత్యాన్ని కళగా దర్శింపగల సౌందర్య దృష్టి, దాన్ని అనుశీలించి అనుభవింప గల ప్రామాణిక ప్రవృత్తి. వీటిని విశ్వజనీనంగా వినిర్మించుకో గలిగినప్పుడు ఈ నాలుగు దాడులలోని దౌర్బల్యం స్పష్టమవుతుంది. అప్పుడు రాజకీయ దృక్పథం సాహిత్యంలోని మౌలి కాంశాలను మూలమట్టం చేయలేదు. భాషావాదం సాహిత్యంలోని కళాభివ్యక్తిని నిర్వీర్యం చేయలేదు. సౌందర్య తత్త్వ వ్యతిరేక వాదం మానవ కళానుభూతిని మరుగుపరచలేదు. ప్రచార సాధనాల సాంకేతిక వాదం ప్రసారం కంటె ప్రధాన మైన సాహిత్య కళావ్యక్తిత్వాన్ని సంకుచింప చేయలేదు.

యుగాలు మారవచ్చు. అభిరుచులు భేదించవచ్చు. ప్రయోగాలు వెలయ వచ్చు, ప్రయోజనాలు వేరు కావచ్చు. కాని, సాహిత్యం మానవత అనుభవిస్తున్న అనంతానుభూతుల అక్షర శిల్ప జగత్తు. అది కల కాదు, కళ. ఏ కాలంలోనైనా కవి వ్యక్తి కాదు, మానవతను ప్రతిబింబించుకున్న మహనీయశక్తి. కవితలో వస్తువు కరిగిపోతుంది. రూపం అనుభూతిలో జాలువారుతుంది. చివరకు మిగిలే రుచి కళ. కళ కాని కవిత కంకాళం. సాహిత్యంలో వెలిగే కళ సమాజంలో జీవించే సృజనాత్మక చైతన్యం దాడులు సాహిత్యరూపాన్ని వంచగలవే కాని సాహిత్యతత్త్వాన్ని త్రుంచలేవు.

(ఆంధ్రప్రభ; 10 4-1985)

# నవశతాబ్ది తలుపు తట్టి పిలుస్తోంది

"మన విద్యావిధానాన్ని సమీక్షించుకునే సత్వర తరుణం ఆసన్నమైంది. ఎందుకంటే- మనకు స్వాతంత్ర్యం వచ్చి నాలుగు దశాబ్దాలు కావస్తోంది. అంత కంటే విశేషం - రాబోయే శతాబ్ది మన ముంగిటి తలుపును గట్టిగా తట్టి పిలుస్తోంది" అన్నారు భారత రక్షణ మంత్రి మాన్యశ్రీ పి. వి. నరసింహారావు గారు— ఏప్రిలు 6 వ తేదీన హైదరాబాదు కేంద్ర విశ్వవిద్యాలయ స్నాతకోత్సవ సందేశంలో.

పదిహేను సంవత్సరాలలో రాబోతోంది భావి శతాబ్ది. దాని అడుగుల చప్పుడును ఆలకించి ఆహ్వానిస్తోంది అఖిల ప్రపంచం. ఇనబింబంలా ఉదయించబోయే ఇరవై ఒకటవ శతాబ్ది ఉషఃకాంతులను ప్రసరిస్తున్నట్లు విజ్ఞులందరూ విలోకిస్తున్నారు. గుడ్ ఫ్రైడే సందేశంలో పోప్ జాన్ పాల్ భవిష్యత్ శతాబ్ది ఆగమనాన్ని ప్రస్తావించి దీనజన కారుణ్యాన్ని ప్రజావళికి ప్రబోధించారు. ప్రభుత్వాధినేతలు, ప్రధాన మంత్రులు, శాస్త్రజ్ఞులు, కళావేత్తలు, సాహితీ స్రష్టలు, సాంస్కృతిక ప్రయోక్తలు - ఏ నోట విన్నా, ఏ సభా వేదిక చూచినా రాబోయే శతాబ్ది రాకను గురించిన ప్రస్తావనలు వినవస్తున్నై. మార్పు రావాలన్న తహతహ ప్రతివారి హృదయంలో ప్రభాతభేరిలా వినిపిస్తోంది. ఏమిటా మార్పు? ఏమిటా తీర్పు! ఎవరి పిలుపుతో వారా మార్పును పిలుస్తున్నారు. ఎవరి దృక్పథంతో వారు ఆ తీర్పును సూచిస్తున్నారు.

21 వ శతాబ్ది కాలగర్భంలో తయారై మన ముందుకు వస్తుందా? మనమే ఆ శతాబ్దిని రూపొందించుకోవాలా? అన్నది మొదటి ప్రశ్న. తలుపు తట్టుతున్న శతాబ్ది భూతలంమీదకి దిగివస్తున్న అవతారమూర్తిగా భావించటం కదలివస్తున్న కాలాన్ని కన్నులారా చూచి గుర్తించటం. తలుపులు తీయటానికి మనం సిద్ధం కావాలి. క్రొత్తకు ఆహ్వానం పలికే ఆలోచన చేయాలి, అర్ఘ్య పాద్యాదులివ్వటానికి అభినవ విధానాన్ని రూపొందించుకోవాలి. మనలో మార్పే

మన ముంగిటితలుపు. దానిని తెరవటానికి ఒకటిన్నర దశాబ్ది కావాలా? నిజమే. అప్పటికైనా తెరిస్తే అభ్యుదయాన్ని సాధించినట్లే అన్నది ఆశావాదం. తలుపు తెరిస్తే కాని భావి శతాబ్ది లోనికి రాదని భావించటం మన కాలజ్ఞానం. ఎవరో ఎప్పుడో వచ్చి మనల్ని బాగుచేస్తే కాని బాగుపడమనే తటస్థ విధానం మన కర్మ మౌఢ్యం శతాబ్ది మనం ఆహ్వానించక పోయినా వస్తుందనేది వాస్తవ సత్యం. అయితే, ఆ శతాబ్ది మనం రూపొందించుకొన్నట్లుగా ఉండాలని కృషి చేయటం వీరధర్మం. కాలం, మన కల కాదు, మన కృషికి ఫలం. భవిష్యత్తు ప్రారబ్ధం కాదు, ప్రయత్న ఫలం. తనంతట తాను వచ్చే శతాబ్ది తలవని తలంపుగా తలమీద పడే భారం, మనం కోరితెచ్చుకున్న శతాబ్ది పరిణామాన్ని వరించిన హృదయ పరిపాకం. క్రొత్త శతాబ్ది హటాత్ పరిణామం కాదు. క్రొత్తను కోరుకునే పాత శతాబ్ది సాధించిన అభ్యుదయ పథం.

భావి శతాబ్దిని ముందుగానే భావించటం భవిష్యద్దర్శనంలో ఒక ముందడుగు. అయితే, కొందరు భావించగలరేకాని దర్శించలేరు. భావించే వారిలో భవిష్యత్తు స్పృహగా జీవిస్తుంది. దర్శించే వారిలో భవిష్యత్తు వర్తమానంగా ప్రవహిస్తుంది. దర్శనం సృజనాత్మకతకు ప్రాణం పోస్తుంది. సృజనాత్మకతయే శతాబ్దోదయం. సృజనాత్మకత మొదట సమాజంలో స్పృహగా బయలుదేరుతుంది. ఆపైన అది సంఘర్షణగా గానీ, ఉద్యమంగా గానీ చైతన్య రూపం తాలుస్తుంది. ఆ చైతన్యం ఆయారంగాలలోని ప్రతిభామూర్తులలో నాయక లక్షణంగా వెలుగొంది ఆ ప్రయోగమే శతాబ్దప్రవృత్తిగా పరిణమిస్తుంది. ఇక్కడ మరొక విషయం గమనించాలి. ఆధునిక కాలంలో శతాబ్ది దీర్ఘకాల ప్రమాణం. దశాబ్ది ఒక్కొక్కసారి స్వల్ప ప్రమాణం కావచ్చు. శతాబ్ది పాదం (పాతికేళ్ళు) పరిగణింప దగ్గ కాలం. కొన్నిసార్లు ఇటువంటి కాలప్రమాణాలను దశలుగా, యుగాలుగా ఆయాసందర్భాలను బట్టి పిలుస్తుంటారు. సాహితీ జగత్తులో శతాబ్దాలు యుగాలుగా విభక్తంకావటం సాధారణం. వాటిలోనూ సృజనాత్మకత ప్రయోగగౌరవం పొందిన కాలాన్ని యుగం అంటారు. పరిణామం చెందుతున్న కాలాన్ని సంధియుగమంటారు.

తెలుగు సాహిత్య చరిత్రలో పందొమ్మిదవ శతాబ్ది ఉత్తరార్ధం ఒక సంధి యుగంగా విమర్శకులు భావిస్తారు ఇరవయ్యో శతాబ్దిలో ఒక దశాబ్దం కడచిన

తరువాత కాల్పనికకవితా యుగం ప్రారంభమైనట్లుగా గణిస్తారు. ఏమైనా యుగంముందడుగుకు గుర్తు, శతాబ్ది ఒక ప్రస్థానానికి ప్రతీక. ఒక శతాబ్ది చరమ పాదంతో ప్రగతి సమీక్ష జరగటం సహజం, భవిష్యత్తుకు బాట వేసి కోవటం సమంజసం. మనం సమీక్షాయుగంలో ఉన్నాం. విద్యా విధానాన్ని ఒక వెలుగుబాటగా మలుచు కోవాలని మథనపడుతున్నాం.

పార్టీలు మారినప్పుడల్లా పథకాలు మారటం, ప్రభుత్వాలు మారినప్పుడల్లా పద్ధతులు మారటం మన విద్యావిధానంలో పరిపాటి అయిపోయింది. పంచవర్ష ప్రణాళిక అనే పరిధిలో దాన్ని బిగించటం, ఆచరణలో అతి జాప్యం చేయటం మనకొక అలవాటైపోయింది. ఈసారి విద్యావిధానంలో వచ్చే మార్పు కనీసం రెండు దశాబ్దాల కాలమైనా నిలిచే సామర్థ్యం కలది కాకపోతే 21 వ శతాబ్ది తలుపుతట్టే చప్పుళ్ళు తాటాకు చప్పుళ్లైపోయే ప్రమాదం ఉంది.

విద్యా విధానంలో నేడు ముఖ్యంగా వివేచింపవలసిన అంశా లేమిటి? ఒకటి జీవన ప్రమాణం, రెండు జీవిత విధానం విద్యవలన మనిషి పొందే ఆర్థిక ప్రతిఫలం జీవన ప్రమాణాన్ని నిర్దేశిస్తుంది, విద్యవలన మనిషి పొందే సంస్కారం జీవిత విధానాన్ని నిర్ణయిస్తుంది. శాస్త్ర విజ్ఞానం, సాంకేతిక పరిజ్ఞానం, వృత్తి విద్యా వివేకం మనిషిలోవి నైపుణ్యాలను పెంచి, జాతి భౌతిక ప్రగతికి తోడుపడుతున్నాయే కాని, నైతిక ఆధ్యాత్మిక ప్రవృత్తుల అభి వృద్ధికి మాత్రం అంతగా సహాయకారులు కావటం లేదు. విద్యకు జీవన ప్రమాణం, జీవిత విధానం రెండు పాదాలవంటివి. ఒక కాలు బలంగా ఉండి మరొకటి లేకపోతే నడక కుంటిది కావటం తప్పదు. ప్రమాదం రాకతప్పదు.

ఈ సమస్య ఒక భారతదేశానికే సంబంధించింది కాదు. ప్రపంచ దేశా లన్నింటిలోనూ దావాగ్నిలా మండుతున్న సమస్య. దీనికి తరణోపాయం విద్యా సమస్యను దర్శించే పద్ధతిలోనే ఉంది. ఏప్రిల్ 7 వ తేదీన జమ్మూ విశ్వవిద్యా లయ స్నాతకోత్సవంలో ఉపన్యసిస్తూ భారత ఉపరాష్ట్రపతి మాన్యశ్రీ ఆర్. వెంకట్రామన్ ఈ అంశాన్ని నొక్కి వక్కాణించారు. "ఉపాధికి ఒక పాస్‌పోర్టు వంటింది పై చదువు అన్న అభిప్రాయాన్ని తొలగించాలి. చిన్నప్పుడే పిల్లలకు మంచి గుణాలు నేర్పకపోతే ఏ విద్యా సంస్కరణ అయినా సత్ఫలితాలు ఇస్తుం

దని నేను అనుకోను. ఏ సంస్కరణకైనా నిర్దిష్టమైన లక్ష్యాలు ఉండాలి. ఆ లక్ష్యాలను నిర్వచించకుండా బోధనా పద్ధతిలో మార్పుతెచ్చినందు వల్ల ఫలితం ఉండదు. సైనిక శక్తి, విజ్ఞానం, సాంకేతిక రంగాల్లో ఒక దేశం ఎంతగా అభివృద్ధి చెందినప్పటికీ సద్గుణాలు లేకపోతే అది దేశమనిపించుకోలేదు. దేశభక్తి, పనిపట్ల శ్రద్ధ, జాతీయ సమైక్యత, మత సామరస్యం, నిజాయతీ, క్రమశిక్షణ వంటి గుణాలను పెంపొందించేదిగా ఏ విద్య లక్ష్యమైనా ఉండాలి''- అని ఆయన అన్నారు. (ఆంధ్రప్రభ 8-4-1985) ఈ మాటలు మన దేశానికే కాదు ప్రపంచ దేశాలలో పెక్కింటికి వర్తిస్తాయి.

నేటి విద్యాసమస్యల్లో మొదట పరిష్కరింపవలసింది ఒకే ఒకటి. అది విద్య ఉద్యోగానికా ? విజ్ఞానానికా ? నడవడికకా ? అన్న మీమాంస. ఈ మూడింటి ముచ్చటైన మేళవింపే విద్యాలక్ష్యం కావాలి. చదివిన చదువుకూ చేసే ఉద్యోగానికీ పొంతన కుదరని ఉదంతాలు ఎన్నో ఉన్నాయి. ఉద్యోగంలో చేరి ఉన్నతెలివిని పోగొట్టుకొన్న వృత్తాంతా లెన్నో ఉన్నాయి. ఉద్యోగం వ్యాపారంగా మారటం కొన్ని చోట్ల కనపడుతుంది. ఉద్యోగంలోని ముఖ్య ధర్మమైన సేవాభావం లోపించటం విచారింపదగిన అంశం. విద్య ఉద్యోగా న్నిచ్చేది గానూ, సేవాభావాన్ని హృదయంలో నింపేదిగానూ రూపొందాలి. విజ్ఞానం విధ్వంసనానికీ, విద్వేషానికీ, స్వార్థానికీ దారి తీయకుండా మనిషిలోని విశ్వశ్రేయోభావాన్ని పెంచేదిగా విద్యవలన మానవుడు పొందాలి. విద్య నడవడికలో ప్రతిబింబించక పోతే అది ఒక మిథ్య; విద్యావంతుడో గాజుపూస, గడ్డి బొమ్మ.

విద్యకు లక్ష్యం నిర్దేశించాలంటే ముందు జీవిత గమనానికే గమ్యం నిరూపించుకోవాలి. అందుకు ఈ మూడు సూత్రాలు గమనింప దగినవి.

1. మనం జీవనాధారము కోసమే కాకుండా జీవిత సార్థక్యం నిమిత్తం జీవిస్తున్నామనే సత్యాన్ని గుర్తించాలి.

2. వివేకం లేని విజ్ఞానం, విచక్షణలేని నడత ప్రయోజనం లేనటువంటివి.

3. జ్ఞానము కంటే మించినది ప్రపంచంలో లేదని అను కొంటారు. నా దృష్టిలో జ్ఞానము కాదు గొప్పది. నడవడికే గొప్పది. మన ప్రవర్తన పైననే దేశం మంచిచెడ్డలన్నీ ఆధారపడి ఉంటాయి.

(—భగవాన్ శ్రీ సత్యసాయి బాబా)

ఈ గమ్యంతో విద్యావిధానాన్ని రూపొందించి శ్రీ సత్యసాయి ఉన్నత విద్యాసంస్థ ప్రయోగాత్మకంగా నిర్వహిస్తున్నది ఆ విద్యావిధానాన్ని సమీక్షిస్తూ జాతీయ విద్యావిషయక శిక్షణ మండలి (ఎన్.సి.ఇ.ఆర్.టి) డైరెక్టరు డాక్టర్ పి. ఎల్. మల్‌హోత్రా ఇలా అన్నారు. "అక్కడ విద్యార్థులు విద్యాభ్యాసం పొందుతున్న విధానమెలాంటిదైనా అదే మనదేశానికి తగిన విధానమనే దృఢమైన అభిప్రాయం నాకు కలిగింది. దేశమంతటా మానవాభ్యుదయ శిక్షణ ద్వారా ప్రజల మనసులను, హృదయాలనూ పరివర్తింపచేసే 'దీర్ఘయాత్ర'కు మనమంతా ఆయత్తం కావాలి."

ఇవి ఒక విద్యావేత్త మాటలే కావు, 21 వ శతాబ్ది—విద్యారంగంలో ప్రవేశించటానికి తలుపు గట్టిగా తట్టుతున్న చప్పుళ్ళు. ఇప్పటికే గడియలు తీయటం జరిగింది. తలుపులు తెరుచుకుంటున్నవి. వెలుగు విశ్వమంతా పడుతున్నది భారతదేశం వెలుగు కిరణాలతో విద్యాప్రణాళికలను రూపొందించుకోబోతున్నది. ఇక—ఒక దశాబ్ది ముందే అడుగు పెట్టాలి భావి శతాబ్ది.

(ఆంధ్రప్రభ: 17-4-1985)

# విమర్శ – పారిభాషిక పదజాలం

సాహిత్య విమర్శ కావ్యానుశీలనం చేసే టప్పుడు క్రొత్త విలువలను వివేచించటానికి సరిక్రొత్తవైన పారిభాషిక పదాలను సృష్టించుకోవటం సహజం. విమర్శకుడు దార్శనికుడైనప్పుడు లేదా అభినవ దృక్పథాన్ని ప్రసరిస్తున్నప్పుడు లేదా నూత్న పద్ధతులలో విమర్శ వెలయిస్తున్నప్పుడు అభినవ పారిభాషిక పదజాలం అతనికి అవసరం అవుతుంది. పారిభాషిక పదాలు విమర్శకు శాస్త్ర ప్రవృత్తిని కలిగించటంతో పాటు సంగ్రహమూ, సారవంతమూ అయిన సాంకేతికాభివ్యక్తిని సంతరించి పెడతాయి. 20వ శతాబ్దిలో వెలసిన పాశ్చాత్య విమర్శ ధోరణులను గమనిస్తే సరిక్రొత్త పారిభాషిక పదజాలాన్ని అనుశీలన విధానంలో సృష్టించుకోవటం ఒక ప్రధాన లక్షణంగా స్పష్టమవుతుంది. అది విమర్శకొక సృజనాత్మక శక్తిని సమకూర్చిందని భావింపవచ్చు.

ప్రసిద్ధ పాశ్చాత్య సాహిత్య విమర్శకుల రచనలను సమీక్షిస్తే ఆధునిక విమర్శ వివేచనను వికసింప చేసిన అనేక నూత్న పారిభాషిక పదాలు మనకు ప్రత్యక్షమవుతాయి. ఉదాహరణకు కొన్నింటిని గమనిద్దాం. ఐ. ఎ. రిచర్డ్స్ విమర్శలో వెలుగులోకి వచ్చిన విశిష్ట పారిభాషిక పదాలు - 'టోన్' 'ఇన్టెషన్' 'ఎఫెక్ట్' 'సెన్స్' 'ఫీలింగ్'; టి. ఎస్. ఎలియట్ విమర్శ వ్యాసంగంలో మొగ్గ తొడిగినవి - 'డిస్సోసియేషన్ ఆఫ్ సెన్స్‌బిలిటీ', 'ఆబ్జక్టివ్ కోర్రిలేటివ్'; ఎఫ్. ఆర్. లీవిస్ అనుశీలనలో ఆవిష్కృతమైనవి 'కాంక్రీట్‌నెస్', 'రియలైజేషన్', 'ఎనాక్ట్‌మెంట్'; ఎంప్సన్ విమర్శలో ఎన్నికచేయదగినవి - 'ఆంబిగ్యుయిటీ', 'డబుల్ ప్లాట్'; వింటర్స్ విమర్శలో - 'క్వాలిటేటివ్ ప్రోగ్రెషన్', 'ఇమిటేటివ్ ఫారమ్'; లెవీస్ట్రాస్ వివేచనలో-'బ్రికొలాజ్'; మిషేల్‌ఫుకో రచనల్లో 'ఎపిస్టీమ్'; విక్టర్ ష్లొవిస్కీ వ్యాసాల్లో 'డీఫెమిలియరైజేషన్'; ముకరోవ్‌స్కీలో 'ఫోర్ గ్రౌండింగ్' మొదలైనవి ఆధునిక పాశ్చాత్య విమర్శ క్షేత్రంలో అత్యంత ప్రచారం చెంది ఉన్నాయి. అయితే ఈ విమర్శకులు ఆయా పారిభాషిక పదాలను సృష్టించుకునేముందు పదాలు లేవని చెప్పలేము. కానీ, వాటిని నిర్దిష్టమైన

అర్థంలో ప్రయోగించి వాటికి ఒక సాంకేతిక ప్రతిపత్తిని సంపాదించ టానికి వారు ఆధునికంగా కృషి చేశారని దృఢంగా పేర్కొనవచ్చు. వారు చూపించిన అభినవాభివ్యక్తి ఆ తరువాత విమర్శలో రూఢికెక్కి అనుశీలనంలో ప్రయోగింపబడటం కనబడుతుంది. విమర్శకుని వ్యక్తిగత దర్శనంలోనుండి రూపొందిన ప్రమాణ ప్రతిపత్తి పారిభాషిక శబ్దం. దానిని విమర్శకు డొక క్రొత్త దారిని కల్పించుకోవటానికి ఉపకరణంగా వాడుకుంటాడు. ఒక క్రొత్త విలువను గుర్తించటానికి ఒక క్రొత్త వివేచనం అవసరం. ఒక క్రొత్త వివేచనను వ్యక్తీక రించటానికి ఒక పారిభాషిక పదం అవసరం.

అయితే - ఒక విషయాన్ని మనమిక్కడ గమనించాలి. విమర్శ - రచయితకూ, పఠితకూ నడుమ అవగాహననూ, అనుస్పందననూ అభివృద్ధిచేసే వాఙ్మయ ప్రక్రియ. విలువలను నిరూపించటంలో విమర్శ ప్రదర్శించే నేర్పు మీదా, కావ్యార్థాల కళా సౌందర్యాన్ని వివరించే విజ్ఞతమీదా, అనుభవ వైశిష్ట్యాన్ని అందింపచేసే మెళకువమీదా విమర్శ గౌరవం ఆధారపడి ఉంటుంది. విమర్శ ఎంత శాస్త్రమో అంత కళకూడా. శాస్త్రంగా విమర్శ సాహిత్య ప్రమాణాలను సూత్రించి, కావ్య గుణదోషాలను నిరూపిస్తుంది. కళగా సాహిత్యాభిరుచులనూ, వాటి విలువలను వివేచించి, వినూత్న ప్రయోగాలకు భవిష్యత్ దర్శనాన్ని ప్రసాదిస్తుంది. శాస్త్రంగా సాహిత్య జీవితాన్ని అనుశాసిస్తుంది. కళగా సాహిత్య సౌందర్యాన్ని అనుశీలిస్తుంది సాహిత్య విమర్శకరుడు గట్టిన సిద్ధాంతాల రాద్ధాంతం కాదు. సృజనాత్మకతను పోషించే నవనీతంలాంటి సాహిత్య దర్శనం.

సాహిత్య విమర్శకు మౌలికంగా ఉన్న ఈ మిశ్ర స్వభావాన్ని గమ నిస్తే శాస్త్రరచనకంటె అది విశిష్టంగా ఉంటుందని స్పష్టమవుతుంది. శాస్త్ర రచన పారిభాషిక పదాలతో నిండి సాకేతికంగా నడుస్తుంది. విమర్శ శుద్ధ శాస్త్రంగా వ్యవహరించలేదు. అనుశీలనం దాని జీవితం. విమర్శలో పారిభాషిక పదజాలం పరిమితంగా ప్రయోగింపబడాలిగాని, దానితో నిండి శాస్త్రప్రవచనంలా సాగటం మంచిది కాదు. అందువల్ల విమర్శకులు పారిభాషిక పదాలను విలువలను వివరించ టానికి సాధనాలుగా మాత్రమే గ్రహిస్తారు. ఆ సాధనాలే ఆయా విమర్శకుల వ్యక్తిత్వాలను, అనుశీలింపబడిన కళా స్వభావాలలోని క్రొత్త విలువలను వెలువ రిస్తూ ఉంటాయి. విమర్శ ప్రగతికి ముందడుగుల్లా వెలుగు నింపుతుంటాయి. ఒక

విధంగా పారిభాషిక పదజాల సృష్టి విమర్శాభ్యుదయానికి అభినవ స్ఫూర్తిని కలిగించే అనుశీలన ప్రమాణ ప్రతిపత్తిగా సాహితీ జగత్తు పరిగణిస్తుందనటం నిర్వివాదాంశం.

ఆంగ్ల విమర్శకులు తమ విమర్శలలో రూపొందించు కొన్నట్లు నూతన పదజాలాన్ని ఆంధ్ర విమర్శకులు రూపొందించు కొనగలిగారా? అన్నది సమీక్షింప దగిన ఒక సమస్య. ఆధునికాంధ్ర విమర్శకులు ప్రాచీన సాహిత్యాన్ని అనుశీలించేటప్పుడు అటు సంస్కృత లాక్షణిక గ్రంథాల్లో ఉన్న పారిభాషిక పదాలనూ, ఇటు పాశ్చాత్య విమర్శలోని మరికొన్ని పారిభాషిక పదాలనూ తెలుగు చేసుకొని వాడుకొంటున్నారు. వాటి లక్షణాలు పూర్వులు చెప్పినవిగా ఉండటం సాధారణంగా కనపడే పరిపాటి. ఆధునిక సాహిత్యానుశీలనంలో చాలవరకు పాశ్చాత్య సాహిత్య విమర్శలోని పారిభాషిక పదాలనే తెలుగులోకి తర్జుమా చేసుకొని, ఆయా లక్షణాలతోనే వినియోగించుకోవటం బహుళంగా కనబడుతుంది. అంటే తెలుగు విమర్శకులు తెలుగు కావ్యాలను అనుశీలించేటప్పుడు ప్రమాణాలుగా క్రొత్త పారిభాషిక పదాలను తెలుగులోనే కల్పించుకోవటానికి అంతగా చొరవ చూపించటం లేదని స్థూలంగా స్పష్టమవుతున్నది. అంటే - విమర్శన మార్గాలతో పాటు, మాటలను కూడా మనం సంస్కృతాంగ్లాది విమర్శలలోనుండే గ్రహిస్తున్నామన్న మాట. ఈ అంశాన్ని విమర్శ లోకం ముందుగా గమనించాలి.

అయితే, మన విమర్శకులు సృష్టించిన పారిభాషిక పదజాలం అసలు లేనే లేదా? అన్న మీమాంస ఏర్పడుతుంది. అసలు లేవని చెప్పటంకూడా అన్యాయమే. ఉదాహరణకు-తెలుగు విమర్శకులు వాడే 'ప్రబంధం' అనే పారిభాషిక పదాన్ని గమనిద్దాం. ఇది సంస్కృత లాక్షణికులు వాడిన అర్థంలో ప్రయోగింపబడింది కాదు. 16 వ శతాబ్దంలో తెలుగు కవులు చేసిన వినూత్న ప్రయోగానికి ఆధునిక విమర్శకులు రూపొందించుకొన్న అభినవ పారిభాషిక పదం. అలాగే 'భావ కవిత్వం' అనే పదం. వీటికి ప్రాచీనార్థాలు కావు ముఖ్యం. విమర్శకులు కల్పించు కొన్న విశిష్టార్థాలే ప్రధానం. ఛందోనుశీలనంలో 'ఛందోరీతి' 'ఛందోవృత్తి' మొదలైనవి కూడా వినూత్న పారిభాషిక పదాలే. కాగా, పరిశీలనవలన తేలే విషయమేమంటే తెలుగులో ఇలా క్రొత్తగా కల్పించుకొన్న పారిభాషిక పదాలు సంఖ్యలో స్వల్పం. పాశ్చాత్య విమర్శకుల్లాగా తెలుగు విమర్శకులు అనుశీలనంలో అభినవ పదజాలాన్ని సృష్టించుకోవటానికి బదులు అనువాదరూపాలనే గ్రహించటం పరిపాటిగా కానవస్తున్నది.

దీనికి కారణం? తెలుగు సాహిత్యంలో వెలువడిన ప్రయోగాలను సంస్కృతాంగ్ల ప్రభావ ముద్రితాలుగానే భావించటం. ఈ పద్ధతి కొంత వరకు మారాలి. ప్రభావం ఉన్నంత మాత్రాన ప్రయోగంలో దేశీయమైన వ్యక్తిత్వం ఉండకుండా పోదు. ఆదేశీయతను అన్వేషించి దేశీ స్వభావాన్ని, దాని వలన అభివ్యక్తమయ్యే విలువలను, వివేచించినప్పుడే అనుశీలనంలో వాటి వ్యక్తిత్వాలను స్పష్టీకరించే పారిభాషిక పదాలను క్రొత్తగా కల్పించుకొనే అవశ్యకత కలుగుతుంది. నన్నయ నుండి నేటి రచయిత దాకా వెలువడిన సాహిత్యాన్ని ఈ విధమైన నవ్యధోరణితో అనుశీలించటం ఆధునిక విమర్శకుల అవశ్య కర్తవ్యం. క్రొత్త చూపుతో, తెలుగుదనంతో, సాహిత్యపు విలువలను వివేచించటం నేటి విమర్శ ప్రస్థానానికి ప్రధాన లక్షణం కావాలి.

పారిభాషిక పదాలను పారిభాషిక పదాలకోసమే విమర్శకులు సృష్టించుకోరు. క్రొత్త విలువలను నూత్నపద జాలంతో వ్యక్తీకరించటానికి చేసే యత్నంలో వాటిని నిర్మించుకుంటారు. అవి పైనుండి తెచ్చుకున్నవిగా ఉంటే సాహిత్యంలోని దేశీయతను బట్టి యివ్వరు. నవ్యతను అనుకరణంగా భావించే ప్రవృత్తి మనలో మారాలి. అప్పుడే సాహిత్య విమర్శలో దేశీయతను సంతరించుకొన్న పారిభాషిక పదజాలం అభివృద్ధి చెందుతుంది. ఇది సంప్రదాయ విరోధంగా కొంతమందికి స్ఫురించవచ్చు. మార్పులోని నేర్పును గుర్తించినప్పుడే సంప్రదాయానికి బలం, నవ్యతకు ఊపిరి. ప్రయోగం పాతదైనా దాన్ని అనుశీలించే విధానంలో నవ్యతను సాధించినప్పుడే విమర్శకు విలువైన జీవితం వెలువడుతుంది. సాహిత్యానికి క్రొత్తరుచులు సమకూరుతాయి.

ఆంగ్ల విమర్శ ప్రభావం ఆంధ్ర విమర్శమీద ఎంత ఉన్నా, అందులో విమర్శకులు కల్పించుకొన్న పారిభాషిక పదాలనన్నింటినీ తెలుగు వారు గ్రహించలేదు. దానికి కారణం ఊహించటం సులభం. ఏ సాహిత్యానికి తగిన దేశీయవలయం దానికుంటుంది. అలాగే అనుభవ వలయం కూడా ఉంటుంది. ఉభయ వలయాలలో అవగాహన ఎంత వరకు సమస్పదంగా ఉండగలదో అంత వరకే పారిభాషిక పదజాలం ప్రసరిస్తుంది. అంతటితో విమర్శ ఆగిపోదు. తన వలయంలో తాను క్రొత్త పదాలను నిర్మించుకోవాలి. అంటే నవ్య సాహిత్యావసరాలకు తోడ్పడే నవ్యార్థాలలో పాత పదాలతోనైనా క్రొత్తవైన పారిభాషిక పదాలను ఏర్పాటు చేసుకోవాలి. అప్పుడే తెలుగు విమర్శ కొక వ్యక్తిత్వం వస్తుంది. ఇతర భాషలలో వెలువడే విమర్శలకు క్రొత్త బాటలు చూపింపగలుగుతుంది.

( ఆంధ్రప్రభ : 24-4-1985 )

# నవ్వుతున్న నాపచేను

ఈ మధ్య హాస్య మహాసభలు జరిగినప్పటినుండీ యువతీయువకుల్లో హాస్యంపట్ల ఒక క్రొత్తదైన అభిమానం మోసులెత్తుతోంది. సాహితీ సంస్థలు హాస్య కవి సమ్మేళనాలు ఉత్సాహంగా జరుపుకోవటం మొదలయింది. కథకులూ, కార్టూనిస్టులూ, కవులూ, కళాకారులూ, వివిధ ప్రక్రియల్లో హాస్యరసాన్ని ఆవిష్కరించే అభినవ ధోరణుల కోసం కృషిచేయటం కనపడుతోంది. హాస్య కథలకూ, హాస్య వ్యాసాలకు, హాస్యగల్పికలకూ పోటీలు కూడా కొన్ని పత్రికలూ, సంస్థలూ నిర్వహించటానికి ముందుకు వస్తున్నాయి. హాస్యం మనిషిలోని మల్లెపూవు లాంటి నవ్వును పరిమళింపచేసే మహనీయ సాధనంగా మానవాళి గుర్తించే టట్లు ఒక చిన్న పాటి ఉద్యమంలా కళారంగం సిద్ధమవుతోంది.

"ఏ దేశంలోనైనా చూడండి. కవులూ, నవలాకారులూ, కథకులూ కావలసినంత మంది ఉంటారు. కాని, హాస్యరచనా వైదుష్యం కలవారు బహుకొద్ది మంది" అన్నారు కీ.శే. మునిమాణిక్యం నరసింహారావుగారు. ఆ మాట నిజం. హాస్యాన్ని అనుభవించాలన్నా, సృష్టించాలన్నా మనిషి కొక ప్రత్యేక చిత్తవృత్తి కావాలి. ప్రకృతిలో వికృతిని వివేచించే ప్రతిజ్ఞతోపాటు, దానిని సున్నితంగా వ్యక్తీకరించే నేర్పు కూడా ఉండాలి. హాస్యాన్ని ఒక ప్రక్రియలో ప్రయోగించ టానికి ముందు జీవితంలో హాస్యాన్ని మాటల్లో, మన్ననల్లో, సరసోక్తుల్లో, విరసోక్తుల్లో పన్నీటిజల్లులా చిలికించే రసిక ప్రవృత్తి రమణీయంగా మనిషిలో వికసించాలి. నవ్వటం ఒక విలాసం కాదు. ఒక జీవన సరళి. జీవితంలో నవ్వ దగిన విషయా లేమిటో తెలిసి, నవ్వకూడని విధంగా నవ్వకుండా, నవ్వవలసిన రీతిగా నవ్వించే నేర్పే హాస్యకౌశలం.

హాస్యంలో ముఖ్యంగా నాలుగంశా లుంటాయి.

1. నవ్వు నవ్వుకోవటానికీ నవ్వించటానికీ పుట్టినా నవ్వే దానికంటే నవ్వించ టానికే అది వినియోగపడాలి.

2. నవ్వుకు నొప్పించే గుణమున్నా నొప్పించక, తా నొవ్వక తప్పించుక తిరిగే స్వభావం దాని కుండాలి.

3. నవ్వు జీవితాన్ని కవ్విస్తున్నట్లుగా ఉండాలి కాని బ్రతుకును బట్టబయలు చేస్తున్నట్లు పరిణమించరాదు.

4 నవ్వు ఉపరంజనంతోపాటు ఉపదేశాన్ని కూడా వ్యంగ్యసుందరంగా అందించాలి. ''నవ్వునాలుగందాల చెరుస్తుం''దంటారు పెద్దలు. నాలుగందాల అంటే నాలుగు విధాలు అనీ, నాలుగు రకాలైన అందాలు అనీ అర్థం చెప్పుకుంటారు ప్రజలు. ఆ నాలుగందాలు ఈ నాలుగంశాలే. హాస్యానికి ఎదుటివాడు నవ్వకుండా తానే నవ్వుకుంటే ఒక విధంగా ఒక అందం చెడినట్లే. హాస్యానికి ఎదుటివాడు నొచ్చుకుంటే మరొక విధంగా రెండో అందం భగ్నమైనట్లే. హాస్యం వాచ్యమై రుచ్యం కాకపోతే మూడో విధమైన అందం ముక్కలైపోయినట్లే. నవ్వు మెరుపులా మెరిసి చీకటి బ్రతుకుల్లో ఒక చిన్నబాటనైనా చూపకపోతే అది అడివి గాసిన వెన్నెలే. నవ్వుకు నాలుగందాల నాణ్యత ఉంది. తెలివిగా నవ్వించటం, తొలకరి జల్లులా నవ్వటం హాస్యానికి రెండు రెక్కలు. హాస్యంలో మొరటుదనం మొగం మొత్తేటట్లు చేస్తుంది. వెగటుదనం లేకుండా వెలగటమే హాస్యంలోని వెలుగు.

నవ్వటం, నవ్వించటం మనిషికి మాత్రమే భగవంతుడిచ్చిన మహనీయ వరాలు. నవ్వు శృంగారానికి తలపువ్వు, వీరానికి అభిమానరేఖ, రౌద్రానికి భుజకీర్తి, కరుణానికి కర్ణాభరణం, అద్భుతానికి ముంజేతి కంకణం, భయానకానికి బావమరది, బీభత్సానికి పినతల్లి, భక్తికి మౌక్తికమణి, వత్సలానికి కడగొట్టు బిడ్డ. నవ్వు నవరసాలకీ కరతలామలకం. నవ్వి చెడిపోయిన రసం లేదు. నవ్వటం, నవ్వించటం తెలియకపోతే రసభంగం తప్పదు. భంగపాటు కలిగించని హాస్య భంగిమ వాఙ్మయానికే ఒక అపూర్వాలంకారం.

జీవితంలో లేని హాస్యం సాహిత్యంలో జీవించదు. దైనందినిక జీవితంలోని హాస్యం ప్రవాహం లాంటిదైతే,సాహిత్యంలో తరగలు కట్టే రసాంకు హాస్యం

నురుగు లాంటిది. హాస్యస్రష్ట జీవిత కుసుమాల్లో నుంచి జుర్రిన మకరందాన్ని తేనెటీగలాగా మధుబిందువుగా మలుచుకుంటాడు. హాస్యానికి సన్నివేశం రంగ స్థలం, రసికత్వం ఆహార్యం, వక్రత ఆంగికం, వ్యంగ్యం వాచికం, ఆహ్లాదం సాత్త్వికం. హాస్యం నడిచినట్లుండరాదు, నటించి నట్లుండాలి. అప్పుడే అది శివం కరం. హాస్యం సత్యాన్నే చెపుతుంది. అయితే సుందరంగా సోయగాలు పోతుంది. ప్రకృతిలోని సత్యాన్ని సుందరంగా చెపితే కవిత కావచ్చు, కళ కావచ్చు. హాస్యం ప్రకృతిలోని వికృతిని కూడా సత్యసుందరంగా వ్యక్తీకరిస్తుంది. వికృతిని ఆభాసగా మార్చే విద్య హాస్యం. ఆభాసను ఆస్వాదించి అసలు సత్యాన్ని అరగించి ఆరోగ్యంగా జీవించటం హాస్య జీవితం. వ్యక్తీకరణలో భాసించే వ్యతిరిక్తతను అనుకూలంగా అన్వయించుకొని అనుభవంలో ఆనందబిందువుగా మలచుకోవటం హాస్యరసం.

హాస్యానికి ఆదరణ కలుగుతున్న ఈ తరుణాన్ని ఆధునికులు ఎలా మలుచుకొని సమాజానికి శ్రేయస్సు కలిగించే ప్రయోగాలను నిర్వహిస్తారో ఆసక్తితో గమనింపదగిన అంశం. ప్రాచీన కావ్యనాటకాలలోని హాస్యం నవ్వించగలిగిందే కాని సమాజచైతన్యాన్ని కవ్వించలేకపోయింది. నవ్యాంధ్ర సాహిత్య వీథుల్లో హాస్యం కవ్వించటం నేర్చుకొని సంస్కరణోద్యమానికి ఆసట బాసటగా నిలిచి సహకారోద్యమాన్ని సాగించింది.

వీరేశలింగం గారి ప్రహసనం, చిలకమర్తివారి చతురోక్తి, పానుగంటి వారి ప్రౌఢోక్తి, భమిడిపాటివారి హాస్యోక్తి, మొక్కపాటివారి చలోక్తి, ముని మాణిక్యంవారి రసోక్తి తెలుగువారి జీవితంలో చిమ్మచీకటులను చిమ్మివేసినవెన్నెల మొలకల్లా పనిచేశాయి. గురజాడవారి సరసోక్తి జాతిప్రవృత్తి మీద చెరగని ముద్రలు వేసింది. బురద నీరులా వరదలు పారుతున్న మూఢాచార ప్రవృత్తికి చిల్ల గింజల్లాగా పనిచేసిన హాస్య రచనలు తెలుగువారి జీవితంలోనూ, సాహిత్యంలోనూ హాస్యరసానికి ఉన్న ప్రతాపాన్నీ, ప్రభావాన్నీ ప్రకటించి నిరూపించాయి. జాతి పునరుజ్జీవన వికాసంలో హాస్యం నిర్వహించిన పాత్ర అపూర్వం. జాతిని నొప్పించకుండా కవ్వించిన కళాకౌశల్యం 20వ శతాబ్ది పూర్వార్ధంలో ఆంధ్ర దేశంలో ప్రదర్శించింది హాస్యం.

భావ కవిత్వ యుగం నుంచీ హాస్యం తెలుగులో అధిక్షేపాన్ని ఆలంబ నంగా చేసికొని తన ఆస్తిత్వాన్ని నిలుపుకొంటున్నది. హాస్యానికి కవిత పుట్టిల్లు, నాటకం మెట్టిన యిల్లు. తెలుగులో నాటకాలూ, నాటికలూ హాస్యంతో ఎక్కువగా కాపురం చేస్తున్నాయనవచ్చు. పాత్రల నాశ్రయించిన హాస్యం గౌరవపాత్రంగా నిలిచింది తెలుగులో. తెలుగునవల హాస్యాన్ని - పండక్కి పుట్టింటికి పిలిచి, ఆడ బడుచును గౌరవించినట్లే అప్పుడప్పుడూ చీరసారెలుపెట్టి వేడుకలు చేస్తున్నది. కథానికలో హాస్యం కాలికి గజ్జెకట్టినప్పుడే నర్తిస్తుంది. హాస్యానికి పుట్టినిల్లయిన కవితాకుటీరం ఆమె ఊసును చెప్పుకుంటూ ఉబలాటపడుతోంది. క్రమేణ కవితలో హాస్యం కనుమరుగౌతోంది. హాస్యానికి ముద్దుబిడ్డలు కార్టూన్లు, జోకులు. ఈ మధ్యనే పుట్టిన మినీకవిత అప్పుడప్పుడూ చిరునవ్వులు చిందిస్తోంది.

ఏమైనా, అభ్యుదయ కవిత్వయుగంలో సాహిత్యరంగం ఆవేశానికి అంకితమై పోవటంతో హాస్యం పుట్టింటికి రావడం వెనకబడింది. తిట్టులో మొట్టి నట్లున్న హాస్యం బ్రదుకులో గిట్టుబాటు కాకుండా పోయింది. ఆగ్రహంలో హాస్యం అనుగ్రహాన్ని పొందలేక పోయింది. విప్లవ కవితా ధోరణిలో హాస్యం వికృతిని వెలార్చినా నినాద ఝంఝులకు నిలువలేక పోతోంది. ఆధునిక కవితకు ఉపదేశం ఒక ధర్మమైనా చెప్పేవిధంలో ఉద్విగ్నత సన్నగిల్లింది. హాస్యం అందంగిచవలసిన చోట అపహాస్యం రుద్రనాట్యం చేస్తోంది. నవత కవ్వించినా నవ్వించటం లేదు. కవ్వింపుతో చేసే ఉపదేశం దండోపాయంలా సాహితీ రంగాన్ని రణరంగంలా మారుస్తోంది. లోకం సామదాన భేదాలను రుచిచూచే అభివ్యక్తికోసం అర్రులు చాస్తున్నది. సామంలో ఉన్న సౌజన్యం, దానంలో ఉన్న ఔదార్యం, భేదంలో ఉన్న వక్రత సాహితీ రంగంలో సమాజ పరిణా మానికి ప్రేరకంగా సాధకంగా సాత్త్వికంగా ప్రయోగింపబడాలంటే హాస్యం సరికొత్త పాత్ర నిర్వహించక తప్పదు.

నేటి సమాజంలో ముఖ్యంగా కనపడేది ద్వంద్వ ప్రవృత్తి. అది మానవ ప్రకృతిలోని ముఖ్యమైన వికృతి. ఈ వికృతి జాడ్యానికి కీలెరిగి పెట్టేమందు హాస్యం. మనిషికి మానవత్వం ప్రకృతి, దానవత్వం వికృతి. దానవత్వానికి వెన్నెముక స్వార్థం. సమాజంలోని స్వార్థంనుండి పరపీడన పరాయణత్వం ప్రకో

పిస్తుంది. పీడించే ప్రవృత్తిని తాడించే పద్ధతిలో ఎదుర్కోవటం నేటి సాహిత్య స్వభావం. ఈ పద్ధతి పరిణామం కంటె ప్రతిఘటనను ప్రజ్వలింప చేస్తున్నది. ప్రతిఘటన సంఘర్షణకు దారి తీస్తున్నది. ఇది తీవ్రమైన మార్గం, విప్లవ పంథా.

విప్లవం సాధించే ఫలితం వివేకం సాధించ గలదా? అన్నది నేటి ప్రశ్న. వివేకం కలిగించని విప్లవం సమగ్రం, సఫలం కాలేదు. సమాజ వికాసానికి మూలమైన వివేకం హాస్యం సాధింప గలదా? సంస్కరణాన్ని సాధించే సంస్కారాన్ని సన్నద్ధం చేసిన హాస్యం జాతిలో సహజీవనాన్నీ సమసమాజాన్నీ నిర్మించే సామాజిక చైతన్యాన్ని సమకూర్చగలదనే ఆశ జాతిలో చిగురెత్తుతున్నది. నవ్వుతూ నవసమాజాన్ని సృష్టించే నవయుగం ఉదయించాలని నవ వైతాళిక గీతాలను లోకం ఆహ్వానిస్తున్నది. నవ్వు నాలుగందాలను ఆహ్వానిస్తున్నది.

నవ్వుకు లోకాన్ని మార్చే బలముంది. కాని, నవ్వును సహజంగా, బలంగా ప్రయోగించే ప్రతిభకోసం ప్రజ ఎదురు చూస్తున్నది. ఈ ప్రతీక్షను చూచి కొందరు నవ్వవచ్చు. నవ్విన నాపచేనే పండుతుందేమో!

(ఆంధ్రప్రభ; 2-5-1985)

# సంవాద సాహిత్యం

ఆధునిక పరిశోధన రంగంలో తులనాత్మక పరిశీలనం ప్రాచుర్యం పొందుతూ ఉన్నది. వివిధ భారతీయ భాషాహిత్యాల మధ్య, పాశ్చాత్య భారతీయ సాహిత్యాల నడుమ ఉన్న సమాంతర లక్షణాలను వివేచించటం, వివిధ ప్రక్రియల వికాసంలో పర్పసర ప్రభావం నిర్వహించే పాత్రను అనుశీలించటం ఈ పరిశీలనంలో పాటింపబడే సామాన్య లక్షణాలుగా విమర్శరంగంలో కనపడుతున్నాయి. ఈనాడు రచయితలు ఏ భాషా సాహిత్యంలో రచనలు చేస్తున్నా, సాధ్యమైనంత వరకు విశ్వ సాహిత్యాలలో జరుగుతున్న పరిణామాలనూ, వాటిని మలుపు తిప్పుతున్న వివిధ ఉద్యమాలనూ, ప్రయోగాలలో ప్రతిబింబిస్తున్న వివిధ ప్రక్రియా లక్షణాలనూ అవగాహన చేసికొని, వాటిని తమ రచనల్లో ప్రతిఫలింప చేసుకొనటానికి యత్నిస్తున్నారు. రచయిత ఏకాంతంగా బతకటం కంటె సంయుక్తంగా జీవిస్తున్నాడు, తన రచనను సంవాదాత్మకంగా సృష్టిస్తున్నాడు. అట్టి రచనల సాహిత్యాంశాలను, విలువలను వివరించటానికి తులనాత్మక పరిశీలనం విమర్శకులకు, పశోధకులకు తప్పని సరిగా చేపట్టవలసిన పద్ధతి అవుతున్నది.

తులనాత్మక పరిశీలనం అనే పారిభాషిక పదానికి మూలం ఇంగ్లీషులో వాడబడుతున్న 'కంపేరిటివ్ స్టడీ'. పాశ్చాత్యులు ఇంతకంటే విశిష్టంగా 'కంపేరిటివ్ లిటరేచర్' అనే పారిభాషిక పదాన్ని విమర్శలో వాడుతున్నారు. దాన్ని తెలుగులో పిలుచుకోవాలంటే 'సంవాద సాహిత్యం' అనవచ్చు ననుకుంటాను. 'కంపేరిటివ్ లిటరేచర్' అనే పదం యౌగికార్థంలో కంటె రూఢ్యర్థంలోనే గ్రహించటం సమంజసం. కంపేరిటివ్ అనే పదానికి తులనాత్మకత, పోలిక, సమాన లక్షణం కలిగిఉండటం అని స్థూలంగా అర్థం. రెండంశాల మధ్య ఉండే పోలికను, సంవాదాత్మకతను అనుశీలించటం విమర్శలోనూ, శాస్త్రంలోనూ ఒక పద్ధతిగా పాటింపబడుతుంది. అయితే కంపేరిటివ్ అనే విశేషణం లిటరేచర్ అనే విశేష్యానికి అనుసంధించినప్పుడు 'తారతమ్యం చొప్పున మేలైన సాహిత్యం' అనే అర్థం కంటె పోలికలున్న సాహిత్యాల నడుమనున్న సంవాదాత్మకతను తులనాత్మకంగా పరిశీలించే సాహిత్య విమర్శ విధానమనే అర్థం గ్రాహ్యమవు

తున్నది. కాబట్టి, ఈ అర్థంలో రూఢికెక్కిన పారిభాషిక పదంగా 'కంపేరిటివ్ లిటరేచర్'ను గ్రహించాలి. అయితే తెలుగులో తులనాత్మక విమర్శ విధానాన్ని వ్యక్తీకరించే 'తులనాత్మక పరిశీలనం' అన్న పదం ప్రాచుర్యం వహించినంతగా 'తులనాత్మక సాహిత్యం' అనే పదం రూఢికెక్కలేదు. దానికి కారణం ఆ పదంలో వాచ్యార్థ ప్రతిపత్తికి కలిగే అనుపపత్తియే. 'సంవాద సాహిత్యం' అంతకంటే మెరుగుగా కనపడుతున్నది. దీన్నికూడా లక్షణార్థంలో గ్రహింప వలసిన లాక్షణిక పదంగానే స్వీకరించాలి.

సంవాదసాహిత్యం పాశ్చాత్యవిమర్శరంగంలో మొదట మౌఖిక వాఙ్మయ శాఖకు చెందిన జానపద కథా ప్రపంచాన్ని అనుశీలించటానికి ఉప యోగపడింది. జానపద పురాగాథలు వివిధ సాహిత్యాల లోనికి వలసపోయి శిష్ట సాహిత్యంలో ఎలా రూపాంతరం చెందాయో అనుశీలించే పద్ధతి ఈ మార్గంలో ప్రాచుర్యాన్ని పొందింది. ఆ విధంగా జానపద శిష్ట సాహిత్యాల తులనాత్మక పరిశీలనానికి సంవాదసాహిత్యం శక్తిమంతమైన సాధనంగా పనిచేసింది. ఇప్పటికి కూడా ఆ విధానం ప్రాచుర్యంలో ఉన్నది. తెలుగులో జరుగుతున్న జానపద సాహిత్య పరిశోధనల్లో ఈ పద్ధతి విరివిగా వినియోగపడుతున్నది.

ఇక శిష్ట సాహిత్య పరిశోధన రంగంలో సంవాద సాహిత్యం నిర్వ హించే పాత్ర మరొక రకంగా కనపడుతుంది. రెండు కాని, అంతకు మించి కాని సాహిత్యాలను ఎన్నుకొని, వాటి మధ్య ఉండే సంబంధ బాంధవ్యాలను గాని, వాటి మధ్య ఉన్న పరస్పర ప్రభావాలను గానీ పరిశీలించే విధానం ఇందులో ప్రాధాన్యం వహిస్తున్నది. ఈ పద్ధతికి మూల పురుషుడుగా ఫెర్నాండ్ బాల్డెన్ స్పెర్జర్‌ను పాశ్చాత్యులు పేర్కొంటారు. ఆయన 'ఫ్రెంచ్ కంపారటిస్ట్స్ స్కూల్'కు ప్రారంభకుడు. ఈ పరిశీలనలో ముఖ్యంగా కనపడే అంశం ఏమిటంటే ఒక సాహిత్యంలో మహా రచయితగా, యుగకర్తగా విశిష్ట ప్రయోక్తగా ప్రఖ్యాతి గాంచిన ఒక వ్యక్తి యొక్క ఆలోచనల ప్రభావం గాని, ప్రక్రియా శిల్ప ప్రభావం గాని మరొక సాహిత్యంలోని రచయితల మీదా ప్రయోగాల మీదా ఎలా ప్రసరించింది, వాటిని ఎలా ప్రభావితం చేసింది, ఎలా పరిణామానికి దోహదం చేసింది, ఎలా ప్రశస్తికి బాటలు వేసింది మొదలైన అంశాలను తులనాత్మకంగా అనుశీలించటం. ఉదాహరణకు 'గెతే' సాహితీ వ్యక్తిత్వం ఫ్రాన్స్, ఇంగ్లండ్-

దేశాల్లో వెలువడిన సాహిత్యాలపై వేసిన ప్రభావాన్ని పరిశీలించటం ఈ కోవకు చెందుతుందన్నమాట. ఇటువంటి అధ్యయనం వల్ల యూరోప్ దేశాల సాహిత్యాల లోని వైవిధ్యంలోని ఏకత్వాన్ని దర్శించటానికి వీలుకలుగుతోంది. ప్రభావ పరిశీలనలకు ప్రాచుర్యం ఏర్పడటానికి దారితీస్తోంది.

లోతుగా ఆలోచించి చూస్తే రెండు సాహిత్యాల మధ్య ఉన్న సమాన లక్షణాలను గానీ, పోలికలను గానీ, ప్రభావాలను గానీ పరిశీలించటం మాత్రమే సంవాద సాహిత్య స్వభావం కాదు. సాహిత్యానికి పై అంశాలన్నీ బహిరంగ లక్షణాలే కాని అంతరంగ లక్షణాలు కావు. సంవాద సాహిత్యం బహిరంగ, అంతరంగ సాహిత్య స్వభావాలను అనుశీలించే పద్ధతికి ప్రాతినిధ్యం వహిస్తుంది. అందువల్ల రెండు సాహిత్యాల సంవాద పరిశీలనంలో సాహిత్య దృక్పథాల, సిద్ధాంతాల తులనాత్మక పరిశీలనం కూడా చోటు చేసుకోకతప్పదు.

సంవాద సాహిత్యం వివిధ భాషాకుటుంబాలకు చెందిన సాహిత్యాల తులనాత్మక పరిశీలనకు తోడ్పడుతుందని చాలా మంది విమర్శకులు భావిస్తున్నారు. ఇందులో కొంత సత్యం లేకపోలేదు. ఉదాహరణకు ద్రావిడ భాషా కుటుంబానికి చెందిన భాషల్లో వెలసిన సాహిత్యాలను భాషను పరిశీలిస్తే వాటిల్లో సామ్యం ఎన్నో రంగాల్లో గమనించవచ్చు. తెలుగు దేశిచ్ఛందాలపై, దేశికావ్యప్రక్రియలపై, నిర్మాణ పద్ధతులపై, జాతీయాలపై, సాహిత్య దృక్పథాలపై తమిళ, కన్నడ సాహిత్యాల ప్రభావం మౌలికంగా ఉండటం సహజం. అయితే, అంతమాత్రంచేత సంవాద సాహిత్యం సఫలీకృతమవుతుందని చెప్పలేము. తెలుగు మీద సంస్కృత ప్రాకృతాంగ్ల,ప్రక్రియా ప్రభావాలను ఆయాకవుల సాహిత్యదృక్పథాల సిద్ధాంతాల ముద్రను కూడా మనం స్పష్టంగా చూడగలుగుతున్నాం. అవి ద్రావిడ భాషా కుటుంబ సాహిత్యాలకంటె విలక్షణమైనవి. అందువలన సజాతీయ, విజాతీయ ప్రేరణలూ, ప్రభావాలూ కలిసి సాహితీ ప్రయోగంలో ప్రవహించే పరిస్థితుల్లో సంవాద సాహిత్యం పాత్ర నేడు సంశ్లిష్టతను ఎదుర్కొంటున్నది. భాషా కుటుంబాల పరిధిని దాటి చారిత్రక పరిణామగతి ననుసరించి సంవాద సాహిత్యం సాగవలసిన అగత్యం ఏర్పడింది. అంతర్జాతీయ సాహిత్యావగాహన లేనిదే ఆధునిక సాహిత్యానుశీలనంలో సంవాద సాహిత్యం సార్థకంగా మనుగడ సాగించ లేదు. నేటి పరిశోధకునికి మాతృభాషా సాహిత్యాలలో మాత్రమే పాండిత్యముంటే

చాలదు. తెలుగులో పరిశోధన చేసే పండితునికి కనీసం ద్రావిడ భాషా సాహిత్యాల పరిచయం కావాలి. భారతీయభాషాసాహిత్యాల పరిణామావగాహన కావాలి, ప్రపంచ సాహిత్య ప్రగతిని తెలుసుకోవటానికి ఆంగ్ల భాష ద్వారా విశ్వ సాహిత్య పరిచయం ఉండాలి. ఇంతటి విద్వత్తును సంపాదించటం సాధ్యమా? అన్నది సమస్యయే. అయినా ప్రయత్నం అవసరం. పిండికొద్దీ రొట్టె.

సంవాద సాహిత్యం ఆధునికకాలంలో ఏ ఒక్కరితోనో నిర్వహింప బడటం అసాధ్యం. అందువలన సుసంఘటితమైన పరిశోధక పండిత సంఘాలు ఇటువంటి కార్యాలను చేపట్టాలి. సామూహికంగా సాధింపగలిగిన సాహిత్య యజ్ఞం ఇది. ప్రాంతీయాభిమానాలను అధిగమించి, సత్యాన్వేషణ చేయగల ప్రవృత్తితో విశాల దృక్పథంతో విశ్వ సాహితీ దర్శనం చేయగల విజ్ఞత, బహుభాషా సాహిత్య పాండిత్యం ఈ ఉద్యమానికి కావలసిన గుణత్రయం.

సంవాద సాహిత్యం సాహితీ ప్రయోగంలోని విలువలను వివేచించటంతో పాటు, దాని సమగ్ర వ్యక్తిత్వాన్ని, వినూత్న శక్తిని, ఆవిష్కరించేదిగా ఉపయోగపడాలి. తెలుగులో సాగుతున్న తులనాత్మక పరిశీలనం సంవాద సాహిత్య స్థాయికి ఎదుగుతున్న దనటంలో అనుమానం లేదు. విశ్వవిద్యాలయాలలో దాదాపు 20 సిద్ధాంత వ్యాసాలు తులనాత్మక అధ్యయన ప్రాతిపదిక మీద వెలువడ్డాయి. క్రొత్తగా చేపట్టే పరిశోధన ప్రణాళికలు చాలావరకు సంవాద సాహిత్యం మీద కేంద్రీకరింప బడుతున్నాయి. హైదరాబాదు కేంద్ర విశ్వవిద్యాలయం వారు సంవాద సాహిత్య శాఖ నొకదానిని స్థాపించడానికి యు.జి.సి. అనుమతించింది. అది రూపొందిననాడు సంవాద సాహిత్య ప్రక్రియకు ఒక శాస్త్రీయమైన అధ్యయన కేంద్రం ఆంధ్రప్రదేశ్‌లో ఏర్పడగలదని, తెలుగులో సంవాద సాహిత్య పరిశోధనల కొక వెలుగుబాట దొరకగలదనీ, ఆశిద్దాం.

(ఆంధ్రప్రభ; 21-5-1985)

# నాద వేద ప్రతిష్ఠ

మే నెల 29 వ తేదీ బుధవారంనాడు హైదరాబాదులోని త్యాగరాయ గాన సభ ప్రాంగణంలో శ్రీ త్యాగరాజ స్వామివారి విగ్రహాన్ని, ఆ నాదబ్రహ్మ ఉపాసించిన శ్రీరామపంచాయతనాన్నీ ప్రతిష్ఠించారు. నిత్య పూజాదికాలతో ఆరాధన నిర్వహించాలని గానసభవారు నిర్ణయించినట్లు పత్రికలలో వచ్చిన వార్తలు సంగీత ప్రియులందరికీ విశేషించి తెలుగువారందరికీ అమితానందాన్ని కలిగించాయి. ప్రముఖ మృదంగ వాద్యనిపుణులు శ్రీ కోలంక వెంకటరాజుగారు త్యాగరాజు స్వామి విగ్రహాన్ని బహూకరించారు. వారికి తెలుగువారి పక్షాన కృతజ్ఞతలు. ఈ నిర్ణయం తీసుకున్న కార్యవర్గసమావేశంలో నేను కూడా ఒక అనుబంధ సభ్యుడనై ఉండటం నా అదృష్టం.

తెలుగు వాగ్గేయకారుల్లో త్యాగరాజ స్వామివారు అగ్రగణ్యులు. వాగ్గేయ కారులెంతమంది ఉన్నా తెలుగులో నలుగురికి పదసాహిత్యంలో విశిష్ట స్థానం ఉంది. ఆ నలుగురూ భక్తిమార్గాన్ని ఆశ్రయించి భగవంతుణ్ణి వాఙ్మయార్చనతో ఆరాధించి కైవల్యాన్ని పొందినవారే. అయితే వారి రచనలు చతుర్విధ పురుషార్థ సాధనానికి సాహిత్య సంగీత వాహికలుగా మనకు అందుబాటులో ఉన్నాయి. అన్నమయ్య రచించిన సంకీర్తన సాహిత్యం ధర్మపురుషార్థ ప్రధానమైనదిగా భావించవచ్చు. త్యాగయ్య ఆలపించిన కృతులు మోక్ష పురుషార్థ సాధనాలుగా సంభావించవచ్చు. క్షేత్రయ్య కూర్చిన పద సాహిత్యం కామపురుషార్థం ద్వారా భగవంతుణ్ణి చేరే మధురభక్తి మార్గానికి సంబంధించినదిగా సమీక్షించవచ్చు. రామదాసు గానం చేసిన కీర్తనలు అర్థపురుషార్థం ద్వారా పరమార్థాన్ని ప్రసాదించే రచనలుగా పరిగణించవచ్చు. ఈ నాలుగు పురుషార్థాలూ భక్తియోగాన్ని ఆశ్రయించి ప్రసరించే ప్రసన్న మార్గాన్ని ఈ పదకర్తలు తెలుగువాణికి అందించి వందనీయు లయ్యారు. అందరిలో త్యాగరాజు భక్తకవిరాజు.

పదకవితా శాఖలన్నింటిలో త్యాగరాజస్వామి వారి కృతులు కర్ణాటక సంగీతానికి కల్పలతలు, తెలుగు పదసాహిత్యానికి పారిజాత సౌరభాలు. త్యాగ

రాజ స్వామి వారి వ్యక్తిత్వంలో మూడుగుణాలు ప్రధానంగా ఉన్నాయి 1. నాద బ్రాహ్మోపాసన శక్తి 2. భక్తిజ్ఞాన పరిపాకం. 3. కవితా లాలిత్యం. సంగీత విద్వాంసులు త్యాగరాజు ప్రసరించిన రాగవైభవాన్ని జీవనగానంగా ఆలపిస్తారు. సమగ్రరాగ ప్రస్తారమే త్యాగరాజస్వామి ధ్యేయమనీ, దానికి ఆలంబనంగా కృతులలోని సాహిత్యాన్ని గ్రహించాడనీ సంభావిస్తారు. కృతిలోని భావం కంటే స్వరప్రస్తారమే ముఖ్యమనీ, దానివలన కలిగేది గానరసమనీ భావించి కృతుల నాలపిస్తారు. వారికి సంగీతం మీద ఉన్నరక్తి అధికం, సాహిత్యం మీద ఉండే భక్తి గౌణం. అయితే, సాహిత్యోపాసకులు త్యాగరాజ కృతులలోని సాహిత్య రసికత్వాన్ని, స్వరభావ సంయోజన సౌలభ్యాన్ని సమీక్షించి భక్తిరససిద్ధిని సాధించు కొంటారు. ఒకరు గానరసోపాసకులు, మరొకరు సాహిత్య రసోపాసకులు.

త్యాగరాజస్వామి సంగీతాన్ని, గీతాన్ని సంవదించి మన కందించి తన కృతిని సుకృతిని చేశారు. వారి కృతుల్లోని సాహిత్యం నీటిలో కరుగుతున్న చక్కెరపలుకుల్లాంటిది. దాని వలన కృతికి రుచి కలిగింది. రుచి అంటే ఆస్వాదనీయత్వం అనీ, కాంతి అనీ రెండర్థాలున్నాయి. ఈ రెండర్థాలూ త్యాగరాజ కృతులకు అన్వర్థాలయ్యాయి. స్వరం భావాన్ని నిర్దిష్టంగా వ్యక్తీకరించటానికి శబ్దాన్నాశ్రయిస్తుంది. దానివలన దానికి ఆస్వాదనీయత్వం సిద్ధిస్తుంది. శబ్దం అర్థవంతం కాబట్టి అర్థదీప్తిని ప్రసాదిస్తుంది. కృతుల్లోని సాహిత్య గౌరవమే అర్థదీప్తి, ఆలోచనామృతం. దానిని ఉపాసిస్తే లభించేది సాహిత్య రసానందం. ఒక్క మాటలో చెప్పాలంటే - కృతులలోని రాగాన్ని ఆలపిస్తే కలిగేది గానరసం, కృతులలోని సాహిత్యాన్ని సమాలోచిస్తే కలిగేది సాహిత్య రసం.

త్యాగరాజస్వామి వారి సాహిత్యం రాగవిరాగ తరంగిణి, జ్ఞానయోగ సంజీవని, నాదబ్రహ్మసుధానిధి. ఆ సాహిత్యంలో ఆత్మీయత ఆత్మతేజస్సులా వెలుగొందుతుంది. అచంచలమైన భక్తియే ఆయన ఆత్మీయత. త్యాగరాజస్వామి జీవితంలోనూ, సాహితీ జీవితంలోనూ భక్తి - ముక్తి కొరకై చేసిన ప్రస్థానం ప్రస్ఫుటంగా ప్రదర్శిత మవుతుంది. భక్తికి భగవద్రతి స్థాయి, ముక్తికి విరక్తి

స్థాయి భక్తి జీవనది, జ్ఞానం మహాంబునిధి. భక్తి జ్ఞానంలో పర్యవసించే ప్రస్థానం త్యాగరాజస్వామి సాహిత్య పరమార్థం.

మధుసూధన సరస్వతులు పేర్కొన్నట్లు భక్తికి మూడు దశలు ముఖ్యం. మొదటిది చిత్తం ద్రవీభూతం కావటం. రెండవది - ద్రవీభూతమైన చిత్తంలో భగవదాకారత ప్రతిఫలించటం. మూడవది - భగవద్రూపరతి స్థాయిగా నిలిచి తన్మయత్వంతో కూడుకున్న బ్రహ్మానంద స్థితిగా పరిణమించటం. ఈ మూడు దశలూ త్యాగరాజస్వామి వారి కృతులలో పరిణామ రమణీయంగా దర్శన మిస్తాయి. అందువల్లనే త్యాగయ్య కృతులు ఇహపర సాధనాలు. పాడితే శ్రవణా నందం, ఉపాసిస్తే బ్రహ్మానందం.

చిత్తం ద్రవీకరించే మానసికావస్థలను వ్యక్తీకరించే కృతులు త్యాగయ్య ఎన్నో రచించారు.రామపంచాయతన విరహంలో ఆయన ప్రదర్శించిన ఆర్తి భక్తికి మూలకందమైన అర్ద్ర ప్రవృత్తిని ప్రసాదిస్తుంది.కామక్రోధ శోక భయాదుల వలన చిత్తం లక్కలా కరగాలి. కరిగిన లక్కపై ముద్రలాగా భగవద్రూపం నిల వాలి. దాని సంతత చింతనం వలన స్థాయి భావస్థితి నందుకోవాలి. త్యాగరాజస్వామి స్వయంగా జీవితంలో ఈ దశలన్నీ దాటి దాశరథిని చేరు కొన్నాడు. కృతులా బాటను పాటగా ఆలపించిన అక్షర చిహ్నాలై ఆ అను భూతిని నేటికీ అభినవంగా అందిస్తున్నవి.

ఆయన పాటల్లోని మాటలు మన నిత్య జీవితంలో ఊతపదాలుగా కూడా నిలిచి ఉన్నాయి. "ఎందరో మహానుభావులు అందరికీ వందనములు", "నిధి సుఖమా! రాముని సన్నిధి సుఖమా", "తెరతీయగరాదా", "వెడలెను కోదండ పాణి", "ఎంత నేర్చిన, ఎంత జూచిన ఎంతవారలైన కాంత దాసులే", "ఉండేది రాముడొకడు, ఊరక చెడిపోకే మనసా", "నీదు చరణ ములే...గతియని నిరతము నమ్మినవాడనురా'', "నగుమోముగనలేని...ఖగ రాజు నీ యానతి విని వేగ చనలేదో'', ''నీ నామరూపములకు నిత్యజయ మంగళం - పవమాన సుతుడు బట్టు పాదారవిందములకు'' - మొదలైన కృతుల వాక్యాలు తెలుగువారి సంభాషణల్లో సందర్భోచితంగా చోటు చేసుకుంటాయి. ఎదుటివారికి నమస్కరిస్తున్నా, సదసద్వివేకంతో వితర్కిస్తున్నా, మోహ

విశ్రాంతిలో అలమటిస్తున్నా, ధర్మోత్సాహాన్ని ప్రకటిస్తున్నా, కామ బలాన్ని వివేచిస్తూన్నా, శరణాగతిని భజిస్తున్నా, సాంత్వన భావాన్ని సమ్మానిస్తున్నా, ఎడబాటులో ఎదతాపాన్ని వ్యక్తీకరిస్తున్నా, మంగళాంతాన్ని మహనీయంగా ఆలపిస్తున్నా త్యాగయ్యగారి కృతులు మన వాక్కులకు అలంకృతులౌతున్నాయి. తెలుగువారి నాల్కలు చేసుకొన్న పుణ్య మది.

త్యాగరాజభక్తిప్రస్థానం ప్రతి కృతీ ప్రతిబింబించుకొన్నట్లు ప్రత్యక్ష మవుతుంది. ఉదాహరణకు మాయామాళవగౌళ రాగంలో, ఆదితాళంలో పాడిన ఈ కృతి చూడండి:

''పల్లవి: విదులకు మ్రొక్కెద సంగీతకో...విదులకు...

అ.ప. ముదమున శంకరకృత సామనిగమ

విదులకు, నాదాత్మక సప్తస్వర ...విదులకు

ప్రముఖులకు త్యాగరాజ వంద్యులకు

బ్రహ్మానంద సుధాంబుధి మర్మ...విదులకు''

త్యాగరాజు మొదట సంగీత కోవిదులకు మ్రొక్కాడు, ఆ తరువాత నాదాత్మక సప్తస్వర కోవిదులకు నమస్కరించాడు. ఆపై బ్రహ్మానంద సుధాంబుధి మర్మవిదులకు మోకరిల్లాడు. సంగీతం నాదాత్మను దర్శించి దానిని బ్రహ్మంగా భావించి అనుభవించే యోగ ప్రస్థానం ఈ కృతి వ్యక్తం చేస్తున్నది. తెలుగు పదకర్తలలో బ్రహ్మానంద పదస్థితిని పొందిన నాదయోగి త్యాగరాజ స్వామి.

త్యాగరాజ స్వామి ప్రతిష్ఠితుడైన చోట రామభక్తి సామ్రాజ్యం కూడా సుస్థిరమై ఉంటుంది. నాదరూపంగా వేదం జాలు వారుతూ ఉంటుంది. ''ఉండేది రాముడొకడు వూరక చెడిపోకే మనసా'' అనే భ్రమరగీత అద్వైతామృత వర్షిణిగా అమరగానం చేస్తూనే ఉంటుంది. త్యాగరాయ గానసభా ప్రాంగణంలో అడుగుబెట్టిన నాద మధుర హృదయులందరికీ నేటినుండి ఈ క్రింది కృతి ఉప శ్రుతిగా మనసులో మ్రోగుతూ ఉంటుంది.

''రామభక్తి సామ్రాజ్యమే
మానవుల కబ్బెనో మనసా!
ఆ మానవుల సందర్శన మత్యంత
బ్రహ్మానందమే మనసా!
ఈలాగని వివరింపలేను
చాల స్వానుభవవేద్యమే
లీలాసృష్టి జగత్రయమునే
కోలాహల త్యాగరాజ నుతుడగు - రామభక్తి''

త్యాగరాజ కృతులు భక్తి సామ్రాజ్యం; త్యాగరాజు నాదబ్రహ్మ; త్యాగరాజ విగ్రహ ప్రతిష్ఠ నాదవేద ప్రతిష్ఠ.

—(ఆంధ్రప్రభ; 30-5-1985)

# అనుమానం - అన్వేషణం

"సిద్ధాంతంలో అనుశీలనాత్మకాంశాలను మాత్రమే పొందుపరచటం ఎన్నడికీ సాధ్యపడదు, సిద్ధాంతమే అనుశీలనాంశాలను నిర్ణయింప గలుగుతుంది" అని అయిన్‌స్టీన్ మహాశయుడు పేర్కొన్నాడు. పరిశోధనలో సిద్ధాంత పాత్రను సమాలోచించటంలో అయిన్‌స్టీన్ మాటలు అక్షర సత్యాలు.

శాస్త్రరంగంలో కానీ, సాహిత్యరంగంలో కానీ ఒక్కొక్క కాలంలో అందరిచేతా ఆమోదింపబడిన కొన్ని అంశాలుంటాయి. పరిశోధకులు వాటిని యథాతథంగా ఆమోదించేముందు సత్యాసత్యాలను గురించి పునఃపరిశీలనం చేస్తారు. అది వారి ధర్మం కూడా. కొన్ని సందర్భాల్లో బహుళ జనామోదం పొందిన అంశాలు శాస్త్రీయం కాదని పరిశోధకులు విజయవంతంగా నిరూపించి తిరుగుబాటు చేయవచ్చు. వాటిలోని అసంబద్ధతను ఋజువు చేయవచ్చు. అటువంటి తరుణాల్లో వినూత్న సిద్ధాంతాలు తలయెత్తుతుంటాయి. విశిష్ట సమన్వయాల కవి త్రోవలు వేస్తుంటాయి. అవి జనామోదాన్ని పొందుతుంటాయి. నిజానికి పరిశోధనలు ఫలవంతమయ్యేది కూడా అప్పుడే.

పరిశోధనకు నిరంతరాన్వేషణం జీవితం. అన్వేషణకు అనుమానం మూలం. ఇక్కడ అనుమానం తర్కశాస్త్రానికి సంబంధించింది. "యత్రధూమ స్తత్ర అగ్నిః" అన్నది తార్కికానుమానం. అనుమానం ఎంత అల్పమైనదైనా ఒకొక్కసారి అపూర్వమైన అన్వేషణకు, తత్ఫలమైన సిద్ధాంతానికీ అమోఘమైన బీజం కావచ్చు. భూమ్యాకర్షణ సిద్ధాంతంలాంటి మౌలికమైన శాస్త్రసిద్ధాంతాలకు మామూలు సంఘటనలే మూలాలైనవన్న సత్యం విస్మరింపరానిది. సాహిత్య రంగంలో కూడా క్రొత్త క్రొత్తవైన సిద్ధాంతాలకు పరిశోధకుల తార్కిక బుద్ధిలో ఉదయించే చిన్న చిన్న ప్రశ్నలు మూలకందాలై సరిక్రొత్త సమన్వయాలకు దారితీయటం మనం గమనిస్తూ ఉంటాం. పరిశోధకుల జీవిత చరిత్రలను సమీక్షిస్తే ఇటువంటి సత్యాలెన్నో బయటపడి మనకు ఆశ్చర్యాన్ని కల్గిస్తూ ఉంటాయి.

ఉదాహరణకు నా సాహిత్య వ్యవసాయంలో నుంచి ఒకటి రెండు ఉదాహరణలను మనవి చేస్తాను.

1957వ సంవత్సరం నేను ఎం ఏ., పరీక్షకు చదువుతున్నాను. ఆంధ్ర సాహిత్య చరిత్రను అధ్యయనం చేస్తున్నాను. పాల్కురికి సోమనాథుడు రచించిన బసవ పురాణాన్ని గురించి అనేక గ్రంథాలలో విమర్శకులు చేసిన సమీక్షలను చూచాను బసవ పురాణం పేరుకు పురాణమైనా సోమనాథుడు దాన్ని కావ్యంగా సంతరించాడని చాలా మంది ప్రశంసించటం గమనించాను. పరీక్షల్లో కూడా అలాగే వ్రాశాను. మార్కులు గడించాను. మొదటి తరగతిలో ఉత్తీర్ణుడ నయ్యాను. కానీ, నాకు మాత్రం ఒక అనుమానం పీడిస్తుండేది. పురాణం వ్రాయ బోయి పాల్కురికి సోమనాథుడు కావ్యం వ్రాశాడని ఒప్పుకుంటే గుఱ్ఱాన్ని చేయబోయి గాడిదను చేశాడని వాదించినా తప్పులేదు కదా అని నాలోని తార్కిక బుద్ధి ఘోషిస్తుండేది. కాదు, కావ్యం వ్రాసి పురాణ మని పేరు పెడితే కవి లోకాన్ని మభ్యపెట్టినట్లయినా భావించాలి, లేదా పురాణ కావ్య ప్రక్రియల భేదం సోమనాథునికి తెలియదనైనా తలంచాలి. అలా అనుకోవటం మన అజ్ఞానాన్ని బయటపెడుతుందే గాని అసలు సత్యాన్ని వెలికి తీయదు. ఏ కావ్య విమర్శను చేపట్టినా మొట్టమొదటి అంశంగా నామ సార్థక్య విచారం చేయటం మన సంప్ర దాయం కదా ! మరి బసవ పురాణ నామ సార్థక్యం మాట యేమిటి ? ఈ ప్రశ్న చిన్నదే, అయినా నిప్పురవ్వ లాంటిది. నిప్పురవ్వలో నుంచే మహాగ్ని పుట్టేది.

ఈ ప్రశ్నలో నుంచి పుట్టిన పరిశోధన ఫలితాంశమే 1969 లో నేను వ్రాసిన "బసవ పురాణము - జైన పురాణ ప్రభావము" అన్న వ్యాసం, ఆంధ్ర ప్రదేశ్ సాహిత్య అకాడమీ వారు ప్రచురించిన సంక్షిప్త బసవ పురాణ పీఠికలో ఈ వినూత్న సమన్వయాన్ని మొదట వెలువరించాను. ఆ తరువాత దాని నొక వ్యాసంగా రూపొందించాను. 1970 లో నా 'సారస్వత సౌరభం' లో ప్రకటించాను.

డా॥ సి. నారాయణరెడ్డి గారు నా పరిశోధనలోని ప్రయత్నాన్ని ప్రశం సిస్తూ ఇలా పేర్కొన్నారు. "బసవపురాణ ముంది. ఈ కావ్యాన్ని గూర్చిన చర్చలన్నీ సామాన్యంగా దేశికవిత, ద్విపదచ్ఛందస్సు, జాను తెలుగు, సాంఘిక జీవన చిత్రణం, వీరశైవ మత ప్రాబల్యం మొదలైన అంశాల చుట్టే చంక్ర

మణం చేస్తుంటాయి. సుబ్రహ్మణ్యం ఎన్నుకొన్న తెన్ను వేరు. బసవ పురాణం పురాణమా? ఎలా? నిజానికి భారత భాగవతాదులు పురాణాలు. బసవ పురాణం పురాణ కావ్య సంప్రదాయాన్ని ధిక్కరించిన అచ్చమైన దేశీ కావ్యం. మరి అది పురాణం ఎలా అయింది? ఆరంభమైంది ఆలోచనా కదనం. అంతర్ మథనం. ఫలితం బసవ పురాణం కన్నడ పురాణ ప్రభావాన్ని పుక్కిటబట్టుకున్న రచన అని నిగ్గు తేల్చటం. అందుకు ఉపస్కారకంగా సంస్కృత పురాణాల్లోని పంచ లక్షణాలకు ప్రతిగా జైనులకు తమ పురాణాల్లో నిబంధించిన ఉత్సవ పంచ లక్షణాలను పేర్కొని, వాటిని బసవ పురాణం పట్ల అతి సమర్థంగా సమన్వయించి చూపటం."

బసవ పురాణం తెలుగులో వెలసిన మొదటి పురాణం. కాని, అది మహా పురాణ సంప్రదాయాన్ని అనుసరించింది కాదు. కన్నడంలో వెలసిన జైనపురాణ ప్రక్రియను తనలో ప్రచ్ఛన్నంగా సంవదించుకొన్నది. దేశికవితను ఉద్యమ స్ఫూర్తితో వినిర్మించిన పాల్కురికి సోమనాథుడు బసవపురాణ రచనం ద్వారా దేశీ పురాణ రచనా పద్ధతిని తెలుగులో ప్రవేశ పెట్టాడని చెప్పటం జరిగింది. ఈ పరిశోధన ఫలితంగా తెలుగులో దేశి పురాణ నిర్మాణ ప్రక్రియా సమాలోచనకు ఒక క్రొత్త బాట ఏర్పడింది. అనుమాన మూలమైన అన్వేషణం అభినవ సాహితీ దృక్పథానికి ఆలంబనమైన సిద్ధాంతానికి దారితీసిందన్న మాట.

సాహిత్య పరిశోధనలో అన్నివేళలా వినూత్న సిద్ధాంతాలే వెలువడుతూ ఉండవు. కొన్ని క్రొత్తవైన దృక్కోణాలతో చేసే వివరణలు వెలువడటం సర్వ సామాన్యం. ఈ పద్ధతికి చెందిన మరొక అంశం మనవి చేస్తాను. ఇది పింగళి సూరన రచించిన కళాపూర్ణోదయ ప్రబంధంలోని కథాంశాలకు సంబంధించింది. అందులోని కథ మూడు జన్మల వృత్తాంతం. సరస్వతి పెంపుడు చిలక కలభాషిణిగా, మధుర లాలసగా జన్మించిన కథ అందులో ముప్పేటగా అల్లుకొని ఉన్నాయి. చిలుక కథ సరస్వతీ చతుర్ముఖుల ప్రణయగాథలో ప్రదర్శిత మవుతుంది. మధుర లాలసా వృత్తాంతం చతుర్ముఖుని వాక్కులలో గాథగా పుట్టి ఆపై అది లోకంలో ప్రవర్తిత మవుతుంది. బ్రహ్మదేవుని మాటలలో మొగ్గతొడిగిన కథ మధుర లాలసా వృత్తాంతం. అంటే కళాపూర్ణుని కథ. మరి-ఆ ప్రబంధంలో సగానికి పైగా వ్యాపించియున్న కలబాషిణి కథకు మూలమైన బీజములు సైతం సరస్వతీ చతుర్ముఖుల ప్రణయ వృత్తాంతంలో నిక్షిప్తం చేసి ఉంటాడా పింగళి సూరన అనే అనుమానం కలిగింది. అన్వేషణ సాగింది. 'కలభాషిణి కథామూలము' అన్న వ్యాసం వెలువడింది. దాని వైశిష్ట్యాన్ని కీ. శే. డా. పాటిబండ మాధవశర్మగారి మాటల్లో మనివి చేస్తాను.

"ఆ కథా నిర్మాణ విలక్షణతలను గురించి, అందలి తాత్త్విక రహస్యములను గురించి, ప్రేమ సిద్ధాంతములను గురించి గ్రంథములు, వ్యాసములు బయలుదేరినవి. కథా నిర్మాణ మందలి చమత్కారములు నిరూపింపబడినవి గాని ఆ కథాంశములకు బీజము లన్వేషింపబడలేదు. అట్టి అన్వేషణకు కీలకము దొరకలేదు. ఆ కీలకమును సుబ్రహ్మణ్యము కనిపెట్టినాడు. కలభాషిణి వృత్తాంత కల్పనకు మూలములైన బీజములు వాణి ముఖ ప్రతిబింబ వర్ణనా ఘట్టమున నిక్షిప్తములై యున్నవని అనుమానించి, నిశితముగా పరిశీలించి, వాణీ చతుర్ముఖుల ముఖ బింబముల యొక్కయు, మణిస్తంభమునందలి తత్ప్రతిబింబముల యొక్కయు కవలికలయందు కలభాషిణి కథ యందలి సర్వ కథాంశములును కదలాడుచున్నట్లు కనిపెట్టెను. సూక్ష్మాతి సూక్ష్మ వివరములతో ఆ కథాంశములకు మూలములైన బీజములను ఎత్తిచూపెను. కళాపూర్ణోదయ పరిశీలనమున సరిక్రొత్తయైన మార్గమును త్రొక్కి అనితర సాధ్యమైన రహస్యమును సాధించి చి. సుబ్రహ్మణ్యము పింగళి సూరన ప్రతిష్ఠను మరియొక మెట్టు పై కెక్కించెను."

పరిశోధనలో స్వీయానుభవాలను రెండింటిని ఇక్కడ పొందుపరచాను. ఇటువంటివి మరెన్నో; నావంటివారు మరెందరో. అందరి అనుభవాలూ ఇటువంటివే. జార్జి వాట్సన్ 'ఒస్టడీ ఆఫ్ లిటరేచర్' అనే గ్రంథంలో ఒక విలువైన మాట అన్నాడు. మానవ విజ్ఞానంలోని వివిధ శాఖల అధ్యయనం లాంటిదే సాహిత్యాధ్యయనం కూడా. దర్శింపతగిన దాన్ని అది నిర్దేశించి చూపిస్తుంది. ఒక పరిశోధకుడు వెలువరించే ఒక వినూత్న సత్యం అంతకు పూర్వం ఎంతో మంది ఎన్నోసార్లు ఆ కావ్యాన్ని చదివినా వారి కంటబడకుండా కనుమరుగైన సత్యమే. అంటే పరశోధకులు ఎన్నిసార్లు అన్వేషించినా ఇంకా దర్శింప దగిన ఎన్నో సత్యాలు సాహితీ గర్భంలో ఆణిముత్యాల్లాగా మిగిలే ఉంటాయన్న మాట.

సాహితీ జీవితంలో అన్వేషణ ఆగనిది. అనుమానం ఆగనివ్వనిది. పరిశోధన ఒక వృక్షమైతే అనుమానం మూలం. అన్వేషణ స్కంధం, ప్రయోగాలు శాఖలు, సమన్వయాలు ఆకులు, దృక్పథాలు కుసుమాలు, ఫలాలు సిద్ధాంతాలు. పరిశోధన నిరంతర ప్రగతిశీలమైన ప్రస్థానం, కాలాతీతమైన కల్పవృక్షం!

(ఆంధ్రప్రభ; 8-6-1985)

# విజ్ఞాన పీఠం వికాసపాఠం కావాలి !

'తెలుగు దేశం' ప్రభుత్వం తెలుగు విజ్ఞాన పీఠాన్ని నెలకొల్పింది. రాష్ట్ర ప్రభుత్వం ఇదివరలో ఏర్పరచిన అకాడమీలన్నీ దానిలో విలీనమయ్యాయి. దీనితో తెలుగు విజ్ఞాన పీఠానికి ఒక గురుతరమైన బాధ్యత ఏర్పడింది. ఆ బాధ్యతను స్థూలంగా నాలుగు విధాలుగా వివేచించటానికి వీలవుతుంది. ఒకటి - మన రాష్ట్రంలో తరతరాలుగా వస్తున్న పాండిత్య సంప్రదాయాన్ని సంరక్షించుకుంటూ, ఆధునిక కాలానికి తగిన విజ్ఞాన వికాసాన్ని సంతరించుకుని, ప్రయోగశీలాన్ని పోషించే సమన్వయ వ్యక్తిత్వాన్ని విద్యాపాండిత్య రంగాలలో నెలకొల్పే ప్రణాళికలను రూపొందిచటం. రెండు - తెలుగువారి కళాప్రతిభలు వెలుగొందే రంగాలలోని సాంప్రదాయిక పరిజ్ఞానాన్ని పరిపోషించుకుంటూ భారతీయ పాశ్చాత్య ప్రయోగాల ప్రభావంతో అది పరిణతిని సాధించే పద్ధతులనూ, ప్రయోగాలను, అన్వేషించి సృజనాత్మక ప్రవృత్తిని వెలార్చే వివిధ మార్గాలను వివేచించి తెలుగు వారికి బాటలు చూపటం. మూడు- దేశంలో నెలకొన్న వృత్తివిద్యలలోని దేశీయ వ్యక్తిత్వాలను శాస్త్రీయ పద్ధతులలో, కళా మార్గాలలో, ప్రయోజనవంతంగా ప్రకటితం చేసే శిక్షణ విధానాలనూ, నూత్న ప్రయోగ రంగాలనూ నెలకొల్పి వృత్తి కళాకారులను, ఆధునిక జీవితంలో అర్ధవంతమైన పాత్ర నిర్వహించే నైపుణ్యాలను అలవరచటం. నాలుగు - సాహిత్య కళారంగాలలో విజ్ఞాన పరిధులను విస్తృతం చేసే పరిశోధనలు జరిపించటంతో పాటు జీవితంలో మానవత్వపు విలువలను ఆచరణాత్మకంగా అనుసంధించుకోగలిగిన శీల నిర్మాణం, పండిత కళా సంప్రదాయాల్లో ప్రవర్తిల్లేటట్లు ప్రయత్నం చేయటం. ఈ నాలుగు లక్ష్యాలే కాకుండా జాతి జీవన సంస్కార పరిపోషణకు దోహదం చేసే మరి కొన్ని మార్గాలను కూడా విజ్ఞాన పీఠం చేపట్టవచ్చు. అయినా, ఈ నాలుగు బాధ్యతలు మాత్రం తప్పక నిర్వహించవలసినవని భావించటంలో విప్రతిపత్తి లేదు.

ప్రజలు ఎన్నుకొన్న ప్రభుత్వం ఎప్పుడూ ప్రజల అవసరాలను గుర్తించటమే ధర్మం. తెలుగు విజ్ఞాన పీఠం తెలుగు వారి సాంస్కృతిక పునరుజ్జీవన వికా

సానికి కృషిచేసే సంస్థగా రూపొందాలని ప్రభుత్వం భావిస్తున్నట్లు సూచనగా తెలుస్తున్నది. ఆశించిన లక్ష్యాలను సాధించటంలో పీఠం చేసే కృషి మీద దాని సాఫల్యం ఆధారపడి ఉంటుంది.

తెలుగు విజ్ఞానపీఠం ఒక విశ్వవిద్యాలయం లాంటిదని భావించి రూపొందిస్తే దాని ప్రయోజనం కొంతవరకు పరిమితమై పోతుంది. పరిశోధనా సంస్థగా భావించి నిర్మాణంచేస్తే ప్రజల జీవన విధానం మీద ప్రత్యక్ష ప్రభావం వేసే అవకాశాలు పరిమితమైపోయే అవకాశం ఉంది. ప్రయోగ కేంద్రంగా రూపొందిస్తే అధ్యయన, అధ్యాపనాలు, శిక్షణ పునశ్చరణ విధానాలూ నిర్వహించే బోధన, సాధన వ్యవస్థగా ఏర్పడవచ్చు. ప్రచార సంస్థగా సంభావిస్తే, పాండిత్యం కళా విజ్ఞానాన్ని ప్రజల కందుబాటులో ఉంచే సాధనాలను ఎన్నిక చేసి వాటి ద్వారా ప్రచారం చేసే పద్ధతులకు ప్రాధాన్యం కల్పించే సాంకేతిక ప్రచార సంస్థగా రూపొందవచ్చు. ఇన్ని రూపాలలో ఏరూపాన్ని ప్రధానంగా చేసుకుని తెలుగు విజ్ఞాన పీఠం తెలుగు వారి సాంస్కృతిక, సాహిత్య రంగాలను పునరుజ్జీవితం చేయాలన్న ప్రశ్న ఎదురుకాక తప్పదు. ఈ అంశం మీద కొంత చర్చకూడా అవసరమన్న విషయం విస్మరించదగినది కాదేమో! తెలుగు విజ్ఞాన పీఠం ఏవిధంగా రూపొందాలో సూచించటానికి ఒక కమిటీ ఏర్పడటం, ఆ కమిటీ నివేదికను సమర్పించటమూ, దానిని పరిశీలించి ప్రభుత్వం పీఠ స్థాపనం చేయడం, అది తన రూపును దిద్దుకునే యత్నం ప్రారంభించడం అందరికీ తెలిసిన విషయమే.

తెలుగు విజ్ఞాన పీఠం ఏరూపంలో ఆవిష్కృత మవుతుందో స్పష్టంగా చెప్పడానికి ఇంకా కొంతకాలం పట్టవచ్చు. ఆ సంస్థ స్వభావం విశ్వవిద్యాలయం కంటే, పరిశోధనా సంస్థ కంటే, ప్రయోగ ప్రచార కేంద్రం కంటే, విలక్షణంగానో, సమన్వయాత్మకంగానో ఉంటుందని తెలుగువారు ఆశించటంలో అనుపపత్తి లేదనుకుంటాను. అట్టి సంశ్లిష్ట వ్యక్తిత్వం ఆసంస్థకు ఏర్పడినప్పుడు దాని అస్తిత్వానికి ఒక ప్రత్యేక ప్రతిపత్తి మన దేశంలో ఏర్పడగలదు.

విజ్ఞాన పీఠం చేపట్టే కార్యక్రమాలలో ముఖ్యంగా విజ్ఞాన సంపుటీకరణ, విశ్లేషణం, సమన్వయం, అనువాదం, వ్యాఖ్యానం, వివరణం, ఆధునిక జీవన విజ్ఞానానికి అందుదాటులో ఉంచేటట్లు ప్రయోగ నిర్వహణం, వాటి అవగాహన

లను పెంపొందించే ప్రచురణలు ప్రసంగాలు, సదస్సులు, గోష్ఠులు ప్రజల నడుమకు ఆ విజ్ఞాన వికాసాన్ని తీసుకునివచ్చే తీరుతెన్నులు చోటు చేసుకొనక తప్పదు. వీటినన్నింటినీ సమన్వయించి నిర్వహించే శాఖలు ఏర్పడినప్పుడు తెలుగు విజ్ఞాన పీఠం తెలుగు సాంస్కృతిక వికాస పీఠంగా వెలుగు నింపుకోగలదు.

విజ్ఞానం అనగానే మనకు వెంటనే స్ఫురించేది భారతీయ శాస్త్ర విజ్ఞానం. సంస్కృత ప్రాకృతాది భాషల్లో తరతరాలుగా దేశంలో పరంపరగా మనకు అందింపబడిన శాస్త్ర సాహిత్య కళావిజ్ఞానం. దానిని గురించి బహు శాఖలలో ప్రాచ్య పాశ్చాత్య పండితులు సాగించిన పరిశోధనల పరిజ్ఞానం. తెలుగు వారిలో ఆ విజ్ఞానం పరివర్తనం చెందిన విధానం, తెలుగు వారు స్వయంగా సాగించిన ప్రయోగ విధానం మొదలైనవి ఎన్నో వస్తాయి. ఈ అంశాలన్నింటినీ సేకరించి, సంపుటీకరించి, విశ్లేషించి ఆధునిక జీవితానికి అనుగుణంగా తెలుగువారి కందించటం జరగాలని ఆశించటం అసంబద్ధం కాదు. అయితే, ఇటువంటి పని దేశంలో ఎన్నో సంస్థలు ఆయా రంగాల్లో నిర్వహిస్తూనే ఉన్నాయి. వాటిని సమన్వయ పరచటం మొదట చేపట్టవలసిన కార్యం.

సంప్రదాయ విజ్ఞానంతో పాటు, సజీవంగా సమకాలీన జాతి జీవితంలో సంపన్నమైయున్న విజ్ఞానాన్ని కూడా సేకరించి, సమన్వయించి వివిధ రంగాలలో దాని వినియోగాన్ని గురించి కూడా తెలుగు విజ్ఞాన పీఠం కృషిచేయాలని భావిస్తూ ఉండటం కూడా ముదావహమే. అప్పుడే గతానికీ, వర్తమానానికీ పీఠం ఒక వారధిగా నిలువగలదు.

తెలుగు విజ్ఞానపీఠం కార్యకలాపాలను నిర్వహించటానికి ఇప్పుడు అందుబాటులో ఉన్న అంగాలు వివిధ అకాడమీలు. సాహిత్య అకాడమీ ఆ పేరుతో ఉండవచ్చు, ఉండకపోవచ్చు. అయితే సాహిత్యరంగం మాత్రం తప్పనిసరిగా ఉంటుంది. అలాగే లలితకళా విభాగం, బాలల సాంస్కృతిక వికాస విభాగం, అంతర్జాతీయ ఆంధ్ర సంబంధాల విభాగం లాంటివి ఉండక తప్పవేమో! వీటికి తోడు శాస్త్ర విజ్ఞాన విభాగాలు, వృత్తివిద్యా కళా వికాస విభాగాల్లాంటివికూడా ఏర్పడక తప్పదేమో! అలా ఉంటే అన్ని శాఖలకు ఏకసూత్రతం వర్తించకపోవచ్చు. ఆయా రంగాలలోని అవసరాలనుబట్టి వాటి వాటి కార్యక్రమాలను నిర్వహించుకోవలసి

వస్తుంది. అయినా తెలుగు విజ్ఞానపీఠానికి తెలుగువారి సాంస్కృతిక వికాస విధానానికి సంబంధించిన సమన్వయాత్మక ప్రణాళిక మాత్రం ఒకటి ఉండటం తప్పనిసరి అవుతుంది.

కేంద్ర ప్రభుత్వానికిగాని, రాష్ట్రప్రభుత్వాలకుగాని నిర్దిష్టమైన సాంస్కృతిక విధానం ఉండటం అభివృద్ధి చెందుతున్న దేశాలలో అవసరమన్నది అభిజ్ఞులందరూ అంగీకరించే అంశమే. విధానాన్ని అనుసరించి ప్రణాళిక రూపొందుతుంది. తెలుగు విజ్ఞానపీఠం ప్రస్తుత రాష్ట్ర ప్రభుత్వ సాంస్కృతిక విధానానికి ఆచరణ కేంద్రంగా నిలిచే విలువైన సంస్థ అని చెప్పక తప్పదు. అకాడమీల ద్వారా వివిధ శాఖలను నిర్వహించే పద్ధతి ఇంతవరకూ సాగుతూ వచ్చింది. అకాడమీల రద్దుతో ఆ శాఖలన్నీ ఒక కేంద్రలో సంప్రదింపబడటం జరిగింది. కేంద్రీకృత సంస్థ కార్యకలాపాలను నిర్వహించేటప్పుడు వివిధ శాఖల క్రింద ఆచరణ విధానాలను వింకేంద్రీకరించక తప్పదు. ఏ వ్యవస్థలోనైనా, స్థూలంగా పరిశీలిస్తే, ఉన్న శాఖలకు మరికొన్ని శాఖలు చేరవలసిన అవసరం ఎంతైనా కనబడుతున్నది. పునర్వ్యవస్థీకరణం అనివార్యంగా తోస్తున్నది. ఈ వ్యవస్థలో పెరుగుదలకే అవకాశం ఉంది కాని తరుగుదలకు చోటులేదు. కేంద్రం ఒకటైనప్పుడు వివిధ శాఖల సమన్వయ బాధ్యతకూడా పెరుగుతుంది.

అకాడమీల రద్దు దాదాపు మూడు దశాబ్దాలుగా దేశంలో వ్యవస్థీకృతమైన సాంస్కృతిక సాహిత్య కళా రంగాలలోని కృషిని సరిక్రొత్త ప్రయోగ మార్గంలో నిర్వహించటానికి ప్రభుత్వం తీసుకొన్న సాహసాత్మకమైన చర్యగా విజ్ఞులు భావిస్తున్నారు. ప్రస్తుత మున్న విధానంకంటె ప్రయోజనాత్మక విధానం రూపొందగలదని ఆశిస్తున్నారు. సరిక్రొత్త విధానం స్పష్ట ప్రతిపత్తితో ప్రకటితమైనప్పుడు, అది ప్రజా పరిషత్తుల్లో చర్చకు నిలిపి, దానిలోని గుణ దోషాలను నిగ్గు తేల్చుకొని, ఒక నిర్దిష్ట రూపాన్ని సంతరించుకున్నప్పుడు ప్రజల హృదయాల్లో ఒక వికాసం ఏర్పడటానికి వీలుంటుంది. ఏమైనా, ఇంత వరకు తెలుగు విజ్ఞాన పీఠం రాష్ట్ర ప్రభుత్వం కలలుకంటున్న ఆదర్శ కళాఖండంగానే ప్రజల హృదయాల్లో దోబూచులాడుతున్నది. అకాడమీల విలీనీకరణం ఆ కళాఖండ నిర్మాణానికి ముడిసరుకును సంతరించటం లాంటిదని భావించవచ్చు. ప్రస్తుతః అకాడమీలన్నీ కళాఖండాలే. వాటిని అతికి మరొక

బొమ్మను తయారు చేయటం జరుగుతుందా, వాటిని కరిగించి మరొక శిల్పాన్ని నిర్మించటం జరుగుతుందా - అనేది ఆంధ్రులందరూ ఆత్రుతతో గమనిస్తున్న విషయం.

పొదుపు కోసమే పీఠం వెలిస్తే పొదుగు కోయకుండా పాలుపిండే నేర్పు కావాలి. పునర్వికాసం కోసమే పీఠం వెలిస్తే పిండి కొద్దీ రొట్టె అనే సామెతను నెమరు వేసుకోవాలి. పీటకు ఎన్ని కాళ్ళుంటాయి అన్నది కాదు మీమాంస. పీట మీద ఎన్ని ఆశలకు, ఆశయాలకు పట్టాభిషేకం జరుగుతుందనేదే ఆకాంక్ష! విజ్ఞానపీఠం వికాసపాఠం కావాలి!! గుణపాఠం మాత్రం కారాదు.

(ఆంధ్రప్రభ; 2-7-1985)

# అకాడమీ అందించిన విలువలు

1957లో ప్రారంభింపబడిన ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ 27 ఏండ్ల జీవితాన్ని నిర్వహించి తెలుగు విజ్ఞానపీఠంలో విలీనమై పోయింది. పాత పద్ధతులు మారి కొత్త పద్ధతులకు దారి కల్పిస్తాయన్న మిల్టన్ మహాకవి సూక్తి సార్థకమైంది. విలీనమైన సంస్థ కొన్ని విలువలకోసం రెండున్నర దశాబ్దాలకు పైగా కృషి చేసి తన అస్తిత్వాన్ని నిలుపుకొన్నప్పుడు ఆ విలువలు నూతన వ్యవస్థలో ఏ విధంగా పరిణామం చెందనున్నాయనే ఆసక్తి ప్రజలలో ఉండటం సహజం. నూత్న వ్యవస్థ కొత్త పాతల మేలు కలయికగా రూపొందుతుందా ? విప్లవాత్మకంగా తన వ్యక్తిత్వాన్ని నిర్మించుకొంటుందా ? అనే ప్రశ్నలు విజ్ఞుల మనస్సుల్లో ఏర్పడటం సహజం.

ఏమైనా గతంలోని మంచిని కొంత సమీక్షించుకొని, దానిని భవిష్యత్కార్యక్రమంలో పొందుపరుచుకొనే యత్నం ఏ పరిణామ స్థితిలోనైనా కనపడుతూ ఉండటం నైజం. అకాడమీ తన రజతోత్సవాలను 1982 ఆగస్టులో జరుపుకొన్నది. ఆ సందర్భంలో శ్రీ దేవులపల్లి రామానుజరావుగారు పేర్కొన్న వాక్యాలు గమనింపదగినవి. "కడచిన ఇరవై అయిదు సంవత్సరాలలో అకాడమీ పఠాన పరిశోధనకు ఉపయోగించే బృహత్తర కృషి తగినంత జరిగినది. మన దేశంలోని మరే భాషలో యీ విధమైన కృషి జరుగలేదని చెప్పితే అతిశయోక్తి కాజాలదు. ఆర్థిక పరిస్థితి దృష్ట్యా మిక్కిలి పొదుపుగా ఈ కృషి జరిగిందని కూడా ఈ సందర్భంలో నొక్కి చెప్పవలసి ఉంటుంది."

భారతదేశంలో వెలసిన రాష్ట్ర సాహిత్య అకాడమీ లన్నింటిలోనూ, ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ చేసిన కృషి గణనీయమైనదన్న అంశం మరువరాని ఒక సత్యం. ఆ అకాడమీ కృషిలో ఆరంభించి, ఇంకా కొనసాగించవలసిన అంశాలేమిటి ? వాటిని భవిష్యత్తులో ఎలా ముందుకు తీసుకొని పోవాలి? అనే ప్రశ్న తెలుగు విజ్ఞాన పీఠ కార్యాచరణ పథకాలలో చోటు చేసుకొనక తప్పదేమో! దిఙ్మాత్రంగా ఈ అంశాన్ని పరిశీలిద్దాం.

తెలుగు భాషకు ప్రామాణికమైన నిఘంటువును, వ్యాకరణాన్ని సిద్ధం చేయించటం అకాడమీ లక్షించిన ఆశయాలలో మొట్టమొదట పేర్కొనదగింది. నిఘంటువును, వ్యాకరణాన్ని సిద్ధంచేయటాకి కావలసిన ఆధార సామగ్రిని సేకరించి, ప్రచురించటం అకాడమీ చేపట్టిన కార్యక్రమాలలో ముఖ్యంగా కన పడుతుంది. ఆ మార్గంలో పద ప్రయోగ కోశాల సంకలనం పరిగణింప దగింది. నన్నయ, తిక్కన, నన్నెచోడ, శ్రీనాథ, శ్రీకృష్ణ దేవరాయ పదప్రయోగకోశాలు వరుసగా వెలువడ్డాయి. ప్రచురిత సాహిత్య గ్రంథాల నాధారంగా చేసికొని పద ప్రయోగ కోశాలను సిద్ధంచేసే పద్ధతికే కాక ప్రజా జీవితంలో సజీవంగా నిలిచి యున్న వృత్తులకు సంబంధించిన పారిభాషిక, సాంకేతిక పదాలను కూడా సేకరించి ప్రచురించే పద్ధతిని అకాడమీ సాగించింది. ఆ వరుసలో—వ్యవ సాయం, చేనేత, వాస్తు, కుమ్మరం, కమ్మరం, మత్స్య పరిశ్రమ మొదలైన వాటికి సంబంధించిన వృత్తి పదకోశాలను ప్రచురించింది. మేదరిపని, జంతువుల పక్షులవేట, కల్లు, బెల్లంసారా పరిశ్రమ, జానపద వైద్యం, మొదలైన వృత్తులకు సంబంధించిన పదకోశాల పని ప్రారంభించింది. వీటికితోడు శాసన పాఠ ప్రచురణాన్ని పదకోశనిర్మాణాన్ని కూడా చేపట్టింది. బ్రౌన్ నిఘంటువులను ప్రచురించటమే కాక, మెకంజీ కైఫియత్తులకూ, బ్రౌన్ లేఖలకు పత్రికలు వ్రాయించి భద్రపరిచింది, మెకంజీ కైఫియత్తులు డెబ్బైరెండు సంపుటా లున్నాయి. వీటికి తోడు తెలుగు నుడికారాలను, సామెతలను సేకరించి మూడు సంపుటాలుగా వెలువరించింది.

సమగ్రాంధ్ర నిఘంటు నిర్మాణయత్నంలో ఇది సమర్థనీయమైన ప్రారం భమే కాని, సంపూర్ణమైన కార్యక్రమం కాదు. ఈ కృషిలో ఇంకా ఎంతో సాధించ వలసిఉంది. ఇప్పటికి ప్రచురించిన సామగ్రివల్లనే ఇంతవరకూ నిఘంటువుల కెక్కని వేలాదిపదాలు వెలుగులోకి వచ్చాయి. సాహిత్యభాషలోనూ, సజీవ భాషలోనూ ఇంకా ఎన్నో లక్షలపదాలు నిఘంటువుల కెక్కవలసినవి ఉన్నాయి. వాటిని సేకరించే యత్నం సాగవలసి ఉంది. అకాడమీ అందించిన ఈ వార సత్వం తెలుగు విజ్ఞానపీఠం విధిగా సంతోషంతో గ్రహింప వలసిన బాధ్యతగా ఏర్పడుతుందనటంలో అనుమానం ఉండదనుకుంటాను.

నిఘంటు నిర్మాణం ఎంత గురుతరమైన బాధ్యతో వ్యాకరణ నిర్మాణం కూడా అంత విలువైన బాధ్యతయే. వ్యాకరణ రచనకు సంబంధించిన పరి

శోధనలు విశ్వ విద్యాలయ రంగంలో కూడా సాగాయి. వాటిని సమన్వయించు కొంటూ ఆ కృషిని ద్విగుణీకృత యత్నంతో ముందుకు సాగించవలసిన అవసరం కూడా ఉంది.

నిఘంటువు, వ్యాకరణంతో పాటు తెలుగు సాహితీ రంగానికి అత్యవసరమైన మరొక ప్రామాణికగ్రంథం - సమగ్రాంధ్ర సాహిత్య చరిత్ర. అకాడమీ అటువంటి చరిత్రను ఆధునిక శాస్త్రీయ పద్ధతుల నాశ్రయించి వినిర్మించాలని సంకల్పించి కృషి ఆరంభించింది. చారిత్రక దృష్టితో రచించే సాహిత్య చరిత్ర కంటె ప్రక్రియా వికాస విధానాన్ని తులనాత్మక దృష్టితో వినిర్మించే చరిత్ర ఆధునిక శాస్త్రీయ దృక్పథానికి సన్నిహితంగా ఉంటుందని భావించి, ప్రణాళికల కోసం ప్రయత్నాలు సాగించింది. తులనాత్మక సాహిత్యాధ్యయనం, ప్రక్రియా వికాస వివేచనం ఒక భాషలోని సాహిత్య చరిత్ర రచననే కాక, ఒక దేశపు సాహిత్య చరిత్రను, విశ్వసాహిత్య చరిత్రను నిర్మించటానికి దోహదకారులవుతాయని ప్రపంచ వ్యాప్తంగా సాహితీ పరులు నేడు భావిస్తూ ఉండడం అందరికీ తెలిసిన విషయమే. దీనికి బృహత్ప్రణాళికయే కాక, సంఘటిత కృషి కూడా కావలసి వస్తుంది. అందువల్ల విజ్ఞాన పీఠం సమగ్ర నిఘంటు నిర్మాణం, వ్యాకరణ రచనం, సాహిత్య చరిత్ర రచనం అనే మూడు ప్రణాళికలను అకాడమీ సాగించిన కృషికి కొనసాగింపుగా స్వీకరింప వలసి ఉంటుంది. ఒక విధంగా ఇవి పీఠంలో శాశ్వతంగా ఉండవలసిన శాఖలు.

సాహిత్య అకాడమీ ప్రాచీనాంధ్ర సాహిత్యాన్ని ప్రజల కందుబాటులో ఉంచటానికి ఎన్నో కావ్యాలను ప్రచురించింది. లాభదృష్టిలేని ధరలలో వాటిని అందించే యత్నం చేసింది. పీఠం అంతకంటే ఒక అడుగు ముందుకువేసి చౌక ధరలలో అందింపగలిగితే విద్వల్లోకంతో పాటు విద్యార్థిలోకం కూడా ప్రాచీన సాహిత్య సంపదను కొని, చదివి, భద్రపరుచుకునే ప్రవృత్తిని పెంచుకోవటానికి వీలౌతుంది. ఇక ఆధునిక సాహిత్యానికి అకాడమీ చేసిన కృషిని సమీక్షించి, సముచితమైన విధానాలను రూపొందించి పీఠం ముందుకు సాగవలసి ఉంది. ప్రతియేటా అకాడమీ నవల, కథానిక, కవిత, సాహిత్య విమర్శ, నాటకం ఇతర సాహిత్య ప్రక్రియలు, అనే అంశాల మీద బహుమతుల నిచ్చి, ఆధునిక రచయితలను, రచనలనూ ప్రోత్సహిస్తూ ఉండేది. పీఠం ఈ సంప్రదాయాన్ని కొన

సాగించనున్నదో లేదా ప్రత్యామ్నాయ పద్ధతులను రూపొందింపనున్నదో వేచి చూడవలసిన అంశం. ఏమైనా ఆధునిక సాహిత్యాన్ని సముచితంగా సమీకరించే, ప్రోత్సహించే విధానాలపై కొంత చర్చ కూడా అవసరమని అనిపిస్తుంది. ఈ శాఖకు సంబంధించిన భావి నిర్ణయాలను జాగ్రత్తగా తీసికొనకపోతే పీఠం పలు రకాలైన విమర్శలకు పాలయ్యే అవకాశం లేకపోలేదు.

సాహిత్య అకాడమీతో పాటు, మిగిలిన అకాడమీలు కూడా విజ్ఞాన పీఠంలో విలీనమయ్యాయి కాబట్టి సంఘటిత కార్యక్రమ రూపకల్పనం అత్యవసరం. కొన్నేళ్ళబట్టి ఒక ఆలోచన అకాడమీ సభ్యుల నడుమ నలుగుతూ ఉండేది. ఏమిటంటే - తెలుగులో ప్రచురింపబడిన ప్రతి పుస్తకాన్నీ సేకరించి భద్రపరిచే ఒక గ్రంథాలయం అకాడమీ ఏర్పరచాలని. ఇప్పుడు దానిని తెలుగు విజ్ఞానపీఠం ఏర్పరచవచ్చు. ప్రతి సంవత్సరం వెలువడుతున్న గ్రంథాలకు ఒక పట్టిక తయారుచేసి, ప్రక్రియా పరంగా విభజించి, వాటిలో సాధారణంగాను, విశేషంగాను కనపడే అంశాలను విశ్లేషించి, తెలుగు సాహిత్యం పురోగమిస్తున్న పద్ధతిని ప్రామాణికంగా సమీక్షించే వార్షిక వివేచనలు సిద్ధంచేసే పద్ధతి మన రాష్ట్రంలోని తెలుగు విజ్ఞానపీఠం చేపట్టాలి. ఇది ఒక విధంగా అవసరం. ఎందువల్లనంటే మన రాష్ట్రంలో ఏయే పంటలు ఎన్ని ఎకరాలలో వేస్తున్నారు, ఏయే వంగడాలు ఎంతెంత ఫలసాయాన్ని అందిస్తున్నాయి మొదలైన అంశాలలో గణాంక విశేషాలను సేకరించటం దేశప్రగతిని సమీక్షించుకోవటానికి విలువైన పద్ధతులుగా ప్రభుత్వం పరిగణించటం గమనిస్తాం. వ్యవసాయ క్షేత్రం ఎంత ముఖ్యమైనదో సాహిత్యక్షేత్రంకూడా అంత విలువైనది. దేశంలో సాగుతున్న సాహితీ వ్యవసాయ, ఫలసాయ విశ్లేషణ వివేచనలు కూడా రాష్ట్ర ప్రగతి సూచకాలుగా గుర్తింపవలసిన అవసరం ఉంది. దానికి విజ్ఞానపీఠం అనువైన సంస్థ సాహిత్య రంగంలోనే కాక కళాశాస్త్ర వృత్తి విద్యారంగాలలో కూడా ఇట్టి కృషి అవసరం. దాని కొక సమగ్రపథకం అనివార్యం.

సాహిత్యం అన్నప్పుడు శిష్ట సాహిత్యం, జానపద సాహిత్యం అనే రెండు శాఖలు పరిగణనకు రాక తప్పదు. బాల సాహిత్యానికి అకాడమీ ఏర్పడింది, జానపద విజ్ఞానానికి అకాడమీ అవసరమని భావింపబడుతూ ఉండేది. కాని, అది రూపు

దిద్దుకోలేదు జానపద సాహిత్యం జానపద విజ్ఞానంలో ఒక భాగం. కాబట్టి జానపద విజ్ఞాన శాఖను సముచితంగా దిద్దితీర్చవలసిన బాధ్యత కూడా పీఠానికి ఏర్పడింది.

సాహిత్య అకాడమీ రద్దయింది. అయితే అది ప్రారంభించిన ప్రణాళికలు మాత్రం మిగిలి ఉన్నాయి. వాటి నిర్వహణంలో కొన్ని లక్ష్యాలు, అంచెల కార్యక్రమాలు సాగి ఉన్నాయి ఇంతవరకూ సాగిన కృషి యొక్క విలువ యేంటి? వాటిని సమర్థవంతంగా నిర్వహించటంలో కలిగే సాధక బాధకా లేమిటి? ఈ ప్రశ్నలు తలయెత్తక తప్పవు. భవిష్యత్ కార్యక్రమాలను రూపొందించేటప్పుడు దేశంలో ఆయా రంగాలలో ఉన్న విద్వాంసులను, పరిశోధకులను, సంప్రదించటమో, గోష్ఠులను నిర్వహించి సముచితమైన సూచనలను గ్రహించటమో జరగవలసి ఉంటుంది. నాలుగు కాలాలపాటు నిలిచే వ్యవస్థను రూపొందించేటప్పుడు నాలుగు రకాలుగా జాగ్రత్తలు తీసికోవాలి. గత సమీక్ష, వర్తమాన వైఖరి, విభిన్న దృక్పథాల సమన్వయం, భవిష్యత్తులో వినియోగం - ఏ నిర్ణయానికైనా ఈ నాలుగూ మూలస్తంభాలు. సాహిత్య అకాడమీ అందించిన విలువలు విజ్ఞాన పీఠానికి పునాదిరాళ్ళుగా పనికి వస్తాయా? విలువలలో ఉన్న విలువ లెన్ని? వేచి చూద్దాం.

(ఆంధ్రప్రభ; 11-7-1985)

# సంజీవనీవిద్య సాహిత్య విమర్శ

విశ్వవిద్యాలయ స్థాయిలో తెలుగు సాహిత్య విమర్శను బోధించే పద్ధతిని పునర్వ్యవస్థీకరించవలసిన అవసరం ఎంతైనా ఉంది. సుసంస్కృత మేధాశక్తి విశిష్టవ్యక్తిత్వంతో నిర్వహించే వివేచన ప్రవృత్తి సాహిత్య విమర్శ. సాహిత్య విమర్శ కరుడుకట్టిన సిద్ధాంతాల రాద్ధాంతం కాదు. సృజనాత్మకతను పోషించే నవనీతం లాంటి అభినవ సాహిత్య దర్శనం. ప్రతియుగంలోనూ సృజనాత్మక సాహిత్యానికి వినూత్నదర్శనాన్ని కానీ, అభినవానుశీలన విధానాన్ని కానీ, అందించి ప్రయోగ ప్రస్థానాలకు ప్రగతిపథాలను చూపించేది సాహిత్య విమర్శ. ఉత్తమ కావ్యంలాగా ఉత్తమ సాహిత్య విమర్శ కూడా అరుదుగానే ఆవిర్భవిస్తుంది.

సాహిత్య విమర్శ సులభమైన మార్గం కాదు. అందులోనూ ఆంధ్రసాహిత్య విమర్శను నిర్వహించాలంటే ఇటు సంస్కృతాంధ్రాలతోనూ, అటు పాశ్చాత్య భాషా సాహిత్యాలతోనూ, మరి భారతీయ సాహిత్యాలతోనూ గాఢమైన పరిచయంతో పాటు పాండిత్యమూ, తులనాత్మక పరిశీన పాటవమూ కూడా ఉండాలి. ఇన్ని ఉన్నా విశ్లేషణ, వివేచన సమన్వయ శక్తులతో పాటు దార్శనిక ప్రవృత్తి, అనుశీలన సామర్థ్యం మౌలికంగా అమరి ఉండాలి.

విశ్వవిద్యాలయాలలో స్నాతకోత్తర స్థాయిలో చదువుతున్న విద్యార్థులు సాహిత్య విమర్శను చాలవరకు నిర్బంధాంశంగానే అధ్యయనం చేస్తున్నారు. అయితే ఒక్కొక్క విశ్వవిద్యాలయం విద్యార్థులకు కల్పించే వ్యక్తిత్వంలో సాహిత్య విమర్శకు ఉండవలసిన స్థానాన్నీ, అధ్యయనం సాగవలసిన విధానాన్నీ రూపొందించు కొనటంలో తమతమ దృక్పథాలను కలిగి ఉన్నాయి. స్వతంత్ర ప్రతిపత్తి కలిగిన విశ్వవిద్యాలయాలు తమ ప్రత్యేకదృక్పథాలను కలిగి ఉండటం కూడా సహజమే. కాని, విద్యార్థులకు సాహిత్యవిమర్శ అధ్యయనం ఎటువంటి శక్తియుక్తులను కలిగిస్తున్నది అన్న అంశంమీద అప్పుడప్పుడూ సమీక్ష చేసికొని ప్రణాళికలను పునర్వ్యవస్థీకరించుకోవడం కూడా బాధ్యతగా పరిగణింపబడుతుంది.

పాఠ్య ప్రణాళికలను రూపొందించేటప్పుడు సామాన్యంగా పాటించే ప్రమాణాలు కొన్ని ఉంటాయి. వాటిలో ముఖ్యమైనవి - అవగాహన, సమన్వయం, అనుశీలన, స్వీయ దృక్పథ నిర్మాణం, అభివ్యక్తి. సాహిత్య విమర్శ బోధనకు కూడా ఈ అయిదూ పంచప్రాణాల్లాంటివి. పద్ధతులు వేరైనా ప్రమాణాలు మాత్రం పాటింపదగినవి. మన రాష్ట్రంలో ఉన్న విశ్వవిద్యాలయాలు ఈ ప్రమాణాలను పాఠ్యాంశాలలో ఎంతవరకు పాటిస్తూ ఎటువంటి ఫలితాలను విద్యార్థుల విమర్శ వ్యక్తిత్వానికి సమర్పిస్తున్నవో సమీక్షించుకోవలసిన తరుణం ఆసన్నమైనదని చాలామంది నేడు భావిస్తున్నారు.

ప్రమాణాలనూ, ఫలితాలనూ గుణించేముందు కొన్ని వాస్తవ పరిస్థితులను కూడా లెక్కలోకి తీసుకోవలసి వస్తుంది. తెలుగు ఎం.ఎ., లో చేరే విద్యార్థినీ విద్యార్థులందరూ గ్రాడ్యుయేట్ స్థాయిలో తెలుగును అభిమానాంశంగా గ్రహించి అధ్యయనం చేసిన వారై ఉండవలసిన అవసరం ఉన్నప్పటికీ, ప్రస్తుత సాంఘికావసరాలను దృష్టిలో పెట్టుకొని బి. ఏ., బి.కాం., బి. ఎస్సీలలో తెలుగు సాధారణ అంశంగా చదివిన వారిని కూడా చేర్చుకోవటం జరుగుతున్నది. ఈ రెండు తెగల వారిలో అవగాహనకు సంబంధించినంతవరకు కొంత తారతమ్యం ఉండక తప్పదు. తెలుగును అభిమానాంశంగా చదివిన విద్యార్థులకు సాహిత్య విమర్శ సూత్రాలను పరిచయాత్మకంగా బి.ఏ., స్థాయిలో బోధించడం జరుగుతుంది. మిగిలినవారికి ఆ అవకాశం ఉండదు. వారికి సాహిత్య చరిత్రకు సంబంధించిన అవగాహనం కూడా పరిమితమే. ఈ రెండు తెగల వారినీ ఒకే తరగతిలో ప్రవేశపెట్టినప్పుడు పాఠ్య ప్రణాళిక సిద్ధం చేయడంలో సమస్యలు రాకతప్పదు. కొన్ని మౌలికాంశాలను పునశ్చరణ చేయక తప్పదు. దీనివలన 'గ్రేడెడ్ సిలబస్' అనే పద్ధతి కొంత కుంటుపడుతుంది. అందువలన బి.ఏ., స్థాయి అవగాహనను కూడా ఎం.ఏ, స్థాయిలో కల్పించుకుంటూ, నిజానికి ఎం.ఏ., విద్యార్థుల స్థాయి ఎంత వరకు ఉండాలో ఆ ప్రమాణాలను పరిమిత కాలంలో సాధించడానికి ద్విగుణీ కృత యత్నం చేయవలసి వస్తుంది. ఒక్కొక్కసారి అటువంటిది సాధ్యపడకపోతే ఎం.ఫిల్., స్థాయిలోనో,పిహెచ్ డి., స్థాయిలోనో వాటిని పూరించుకోవలసిన అగత్యం ఏర్పడుతున్నది. ఈ వాస్తవాలను గుర్తిస్తే - స్నాతకోత్తర స్థాయిలో ఎం. ఏ., పట్టాన్ని పొందిన విద్యార్థులకు ఆ స్థాయికి సంబంధించిన

సాహిత్య విమర్శ అవగాహన ఉండవలసిన ప్రమాణంలో ఉండకపోయే పరిస్థితి ఒక్కొక్కసారి ఏర్పడే అవకాశం ఉన్నదన్న మాట. దానిని నివారించే యత్నం ఏదో ఒక విధంగా సాగక తప్పదు. ప్రమాణాల మీదనే ఫలితాలు ఆధారపడి ఉంటాయి.

కొన్నేళ్ళుగా విశ్వవిద్యాలయాల తెలుగుశాఖలు ఎదుర్కొంటున్న సమస్య ఇది. అయితే తెలుగు శాఖలు తీసుకొంటున్న జాగ్రత్తలను కూడా మనం గణించాలి. సాహిత్య విమర్శను నిర్బంధాంశాలలో ఒకటిగా చేసి వంద మార్కుల పేపరు ఒక దానిని ఏర్పరచి కనీసం ఒక సంవత్సరకాలం అధ్యయనాధ్యాపనాలు జరిగేటట్లు చూడటం, సాహిత్య ప్రక్రియలను బోధించేటప్పుడు అనువర్తిత విమర్శకు తగినంత స్థానాన్ని కల్పించటం గమనింపదగిన విశేషం. ఎం. ఏ., స్థాయిలో విద్యార్థి కేర్పడవలసిన సంశ్లిష్ట వ్యక్తిత్వంలోని వివిధాంశాల అవగాహన నిష్పత్తిలో సాహిత్యవిమర్శ కుండదగిన నిష్పత్తిని, అది కల్పించవలసిన వ్యుత్పత్తిని వివేచించుకొనడంలో విభిన్నాభిప్రాయాలు ఉండక తప్పదు.

అధ్యయనంలో అవగాహన ప్రాథమిక ప్రమాణమేగాక, ప్రధాన ప్రమాణమనటంలో అనుమానం లేదు. అవగాహన పరిజ్ఞానం కాదు. మిగిలిన ప్రమాణాలకు ప్రేరణం, చోదనం. అవగాహన అన్వయశక్తిని కలిగించాలి, అనుశీలన విధానాన్ని రూపొందించాలి, దర్శన ప్రతిభను ప్రసాదించాలి. అభివ్యక్తిలో ఒక వ్యక్తిత్వాన్ని రూపు కట్టించాలి. సాహిత్య విమర్శ బోధనం, అవగాహన నంత సమర్థవంతంగా విద్యార్థి వ్యక్తిత్వంలో స్థాపించటానికి ప్రణాళికలను సిద్ధం చేసికొని, నిర్వహించాలి. అయితే, నేటి పాఠ్యప్రణాళికలు ఈ లక్ష్యాన్ని ఆయి దంచెలలో సాధించేటట్లు సర్వత్రా రూపొందుతున్నాయని నిశ్చయంగా చెప్పలేక పోతున్నాం. కాని, ఇప్పుడా పద్ధతులను దుయ్యబట్టటం కాదు చేయవలసిన పని. మెరుగుపరచటానికి సంఘటితమైన కృషి చేయటం కర్తవ్యం.

సాహిత్య విమర్శ బోధనా ప్రణాళికలో సామాన్యంగా రెండు లక్ష్యాలు ఉంటాయి. ఒకటి-సాహిత్య విమర్శకు సంబంధించిన మూలసూత్రాల అవగాహన విద్యార్థుల కందించటం. రెండు - సాహిత్య విమర్శ విద్యార్థులకు, మౌలికమైన

వ్యక్తిత్వాన్ని కల్పించే దార్శనిక శక్తిని కలిగించటం. కళాధికారి (మాస్టర్ ఆఫ్ ఆర్ట్) కాదగిన విద్యార్థికి ఈ రెండు లక్ష్యాలూ కరతలామలకం కావాలి. అప్పుడే సాహిత్య విమర్శపాఠం సార్థకమవుతుంది.

కాని, నేటి విశ్వవిద్యాలయాలలో పై రెండు లక్ష్యాలలో మొదటిదానికి ఇచ్చినంత ప్రాధాన్యం రెండవదానికి లేదు. దీనికి సమర్థనీయంగా ఒక వాదం లేకపోలేదు. స్నాతకోత్తర స్థాయిలో విద్యార్థులకు విమర్శ సూత్రాల నందించటమే సాధ్యం. వ్యక్తిత్వ నిర్మాణం విద్యార్థి స్వయం కృషిమీద ఆధారపడి ఉంటుంది. ఎం.ఏ., విద్యార్థులందరూ సమగ్ర వ్యక్తిత్వాలను పెంపొందించుకోలేకపోవచ్చు. కాని, అలా పెంపొందించుకొనే పద్ధతికి సంబంధించిన అవగాహనను మాత్రం పొందితే చాలు. ఆ వాద సారం ఇది. ఈ వాదంలో కొంత వాస్తవం లేకపోలేదు. అయితే, ఈ పద్ధతిలో తయారైన విద్యార్థులకు సాహిత్య విమర్శ వ్యక్తిత్వం ఏర్పడటం స్వయంకృషి మీదనే ఆధారపడి ఉంటుంది. అంటే, అవగాహన సాధారణ స్థాయిలో విషయ సంగ్రహణంగానే పరిణమిస్తున్నదన్నమాట. వివిధాంశాల వ్యుత్పత్తి విశేష పరిజ్ఞానాన్నందించినంతగా వివేచనాత్మకమైన వ్యక్తిత్వాన్ని కల్పించలేదు. విద్యార్థుల స్వయంకృషి విశ్వవిద్యాలయ ప్రణాళికల పరిధిలో లేకపోతే వ్యక్తిత్వనిర్మాణానికి అవకాశం కలిగినవారికే సిద్ధించే ప్రమాదం ఉంది. అందువల్ల చతుర్విధ ప్రమాణాలు సాధింపగలిగే అవగాహనను పాఠ్యాంశ పరిధిలో నిబంధించినప్పుడే సమగ్రఫలం ప్రణాళిక సాధిస్తుంది. విద్యార్థుల వ్యక్తిత్వాలలో తరతమ భేదం ఉండవచ్చునేమో కాని విషయపరిజ్ఞానంలోనే ఉండటం హర్షించదగినది కాదు.

విశ్వవిద్యాలయాలు వెలయక పూర్వం కూడా సాహిత్య విమర్శాధ్యయనం మన ప్రాంతంలో జరుగుతూ ఉండేది. దాన్ని మనం రెండు దశలుగ విభజించవచ్చు. మొదటి దశ - సృజనాత్మక లక్షణ గ్రంథాధ్యయనం. రెండవ దశ - సంకలనాత్మక లక్షణ గ్రంథ పఠనం. పూర్వకాలంలో ధ్వన్యాలోకం వంటి లక్షణ గ్రంథాలు పాఠం చెప్పేవారు. ఒక వినూత్న సిద్ధాంతకర్త సాహిత్య విమర్శాంశాలను తన సిద్ధాంతాని కనుగుణంగా సమన్వయించి వ్యక్తీకరించే ప్రతిభాపాటవం అటువంటి గ్రంథాలను చదవటం వలన విద్యార్థులకు అవగతమయ్యేది. ఆ తరువాత ప్రతాపరుద్రయశోభూషణం వంటి పాఠ్య గ్రంథాల

ప్రచారం ఎక్కువైంది. సాహిత్య విమర్శాంశాల పరిజ్ఞానం, వ్యాఖ్యల ద్వారా చారిత్రక పరిణామ వివరణం వాటి వలన తెలిసేవి. విశ్వవిద్యాలయాలలో తెలుగు విమర్శ బోధనా విధానం ముఖ్యంగా సంకలన లక్షణ గ్రంథాలను తెలుగు వ్యాఖ్యానాలతో సహా చదివించటంతో మొదలైంది. ఆ తరువాత ఆంగ్ల విమర్శ సూత్రాలను కలుపుకొంటూ సాగింది. అందులోనూ, తులనాత్మక అధ్యయనం కంటె పరిచయాత్మక సమీక్షయే ప్రాధాన్యం వహిస్తూ వచ్చింది. ఇప్పుడిప్పుడే ప్రభావ పరిశీలనం మొదలైంది. ముందు ముందు తులనాత్మకాధ్యయనం అభి వృద్ధి చెందవచ్చు.

తెలుగు సాహిత్య విమర్శను విశ్వవిద్యాలయాలలో ప్రవేశపెట్టేటప్పుడు మొట్టమొదటి రోజుల్లోనే దానికి సమగ్ర పద్ధతి ఏర్పడలేదు. విమర్శాంశ పరి చయం, సాహిత్య సిద్ధాంతాల క్రమ వికాస చరిత్ర మొదలైన బహిరంగ పరిజ్ఞానానికే ప్రాచుర్యం, ప్రాధాన్యం కల్పించబడింది. కాని, సృజనాత్మక విమర్శ దర్శనాన్ని అధ్యయనం చేసి, విమర్శలో అంతరంగ వ్యక్తిత్వాన్ని వివేచించి చెప్పే ఉత్తమ పద్ధతికి ప్రాతిపదికలు ఏర్పడలేదు. ఇప్పటికీ, విశ్వ విద్యాలయాలలో సృజనాత్మక విమర్శ వ్యక్తిత్వ నిర్మాణానికి తగినంత శక్తి మంతమైన పాఠ్యాంశ ప్రణాళిక సిద్ధం కాలేదు. అసలు ఆదృష్టితో ఆలోచనకూడా సాగలేదు.

తెలుగులోని ఉత్తమ విమర్శకులందరూ మన విశ్వవిద్యాలయాంధ్ర శాఖ లలో తయారైన వారు కాకపోవచ్చు. వారి వారి సాహిత్య దృక్పథా లున్నాయి. సమన్వయమార్గా లున్నాయి. అనుశీలన పద్ధతు లున్నాయి అభివ్యక్తి ఫణుతులు న్నాయి. విమర్శ వ్యక్తిత్వం ఉన్నవాడే విమర్శకుడు. విశ్వవిద్యాలయం విద్యార్థికి వ్యక్తిత్వం ప్రసాదించాలి కాని విమర్శను గురించిన వివరణం అందించి ఊరు కోరాదు. నేటి సాహిత్య విమర్శలో సాహిత్య దార్శనిక ప్రతిభ లోపించటానికి విశ్వవిద్యాలయ విమర్శ పాఠ్య ప్రణాళికలు ముఖ్య కారణాల్లో ఒకటి అని భావించవచ్చు. పడికట్టురాళ్ళ వంటి సాహిత్య విమర్శ కావ్యాలపాలిటి శవపరీక్ష. అభినవలోచనాన్నిచ్చే సాహిత్య విమర్శ సంజీవనీవిద్య. లోచనాలను తెరిపించ కుండా సులోచనాలను బహూకరిస్తున్నది నేటి సాహిత్య విమర్శాధ్యయనం!

(ఆంధ్రప్రభ; 23-7-1985)

# ప్రపంచ సమాజం—సమైక్య సూత్రం

"మానవత ఒకే ఒక తల్లివేరునుండి మొలకెత్తింది. క్రమంగా అనేక శాఖలుగా జాతులు విస్తరిల్లాయి. విభిన్న సంస్కృతుల సమన్వయ దృష్టితో మూలంలోని ఏకత్వాన్ని దర్శించటానికి నేడు మానవత యత్నిస్తున్నది. ఆధునిక ప్రపంచ చరిత్ర, ఏకైక విశ్వకుటుంబ భావనతో సాగి తన వైశాల్యాన్ని, ఉదాత్తమైన ఔన్నత్యాన్ని సాధించి సుసంపన్నం కావటానికి సిద్ధమవుతున్నది - అని డాక్టర్ సర్వేపల్లి రాధాకృష్ణ పండితుడు 'అవర్ హెరిటేజ్' అనే గ్రంథంలో పేర్కొన్నారు.

ఈనాడు ప్రపంచంలోని వివిధ దేశాల ప్రజలంతా సన్నిహితంగా జీవిస్తున్న భావాన్ని సాధింపగలిగారు. దీనికి ముఖ్యకారణాలయిన విజ్ఞాన శాస్త్ర ప్రయోగాలనూ, సాంకేతిక పరిజ్ఞాన విధానాలనూ మనం అభినందించాలి. యానంలో, వార్తాప్రసారంలో సాగించిన వేగం వివిధ సంస్కృతులూ, జాతులూ, మతాలూ పరస్పరం పరిచయం కావటానికి తోడ్పడింది. ప్రస్తుత వాతావరణంతో మనం అలవరచుకోవలసింది ఒంటరితనంలో జీవించటం కాదు, కలియబోసుకుని బ్రతకటం, అసహనంతో ప్రవర్తిల్లటం కాదు, అవగాహనతో మనుగడ సాగించటం. ద్వేషాన్ని, మతోన్మాదాన్నీ కాదు మనం ఆదరించవలసింది, సుహృద్భావంతో మంచిని పెంచుకొనే స్వభావాన్ని, విలువైన ఏఅంశాన్నైనా సంవదించుకొనే సమన్వయ శీలాన్ని అని ఆయన హెచ్చరించారు. ఈ మాటలు నాటికీ నేటికీ నిజాలుగానే నిలబడుతున్నాయి.

ఆధునిక శాస్త్ర విజ్ఞానం ప్రపంచదేశాల ప్రజలను ఇరుగు పొరుగు నేస్తాలుగా నివసించే అవకాశాన్ని భౌతికంగా సాధించిపెట్టినా, మానవుడు నా దేశం, నారాష్ట్రం, నాజాతి, నాకులం, నావర్ణం, నామతం, నాసంస్కృతి, అనే ప్రాకారాలను మాత్రం మరిచి పోలేక అప్పుడప్పుడు సాటివారితో సంఘర్షణకు తలపడి అశాంతినీ, అరాచకాన్నీ, భయాందోళననూ, అయోమయ స్థితినీ కల్పించు

కొంటున్నాడు. వివిధ దేశనాయకులు రాజకీయ ప్రాబల్యంకోసం మారణా యుధాల ఉత్పత్తిని చేపట్టి మృత్యుభీతిని మానవ హృదయాల్లో సృష్టిస్తూనే ఉన్నారు. జాతుల మధ్య కలహాలు, మతాల నడుమ సంఘర్షణలు, సాంఘిక వ్యవస్థల మధ్య పోరాటాలు, రాజకీయ సిద్ధాంతాల మధ్య రాపిడులు, నేటి మానవ తను అశాంతికి గురి చేస్తున్నాయి. నైతిక సూత్రాల కంటే రాజనీతికి విలువ ఎక్కువైంది. హార్దిక సంబంధాలకంటే ఆర్థికమైన దోపిడీ పద్ధతులకు ప్రాచుర్యం కలిగింది. ఆధ్యాత్మికదృక్పథంకంటే భౌతికదృష్టి, భోగతృష్ణ మానవతను పట్టి పీడిస్తున్నది. అతి సన్నిహితంగా అందుబాటులో ఉన్న భూగోళం అతిసంకు లంగా సమరయత్నాలతో సతమతమవుతున్నది. ఆర్థికంగా అభివృద్ధి చెందిన దేశాల్లో సుఖమున్నా శాంతి లేదు. ఆర్థికంగా వెనుకబడిన దేశాల్లో ఆకలి, అనా రోగ్యం విలయతాండవం చేస్తూ సుఖాన్నికూడా దూరం చేస్తున్నాయి. అభివృద్ధి చెందుతున్న దేశాల్లో సుఖంకోసం పరుగు, శాంతికోసం తపన సమాంతరంగా సాగుతూ అసంతృప్తిని రేకెత్తిస్తున్నాయి. దగ్గరైన మానవులు విశ్వాసంలేని అనుమాన వాతావరణంలో జీవిస్తున్నారు. అంతర్జాతీయ సదస్సులెన్ని జరుగు తున్నా, అవగాహన ఎంత పెరుగుతున్నా, ప్రపంచం ఒక కుటుంబంగా జీవించ టానికి ఇంకా నోచుకోలేదు. దీనికి కారణం ఏమిటి? ప్రపంచ మానవత ఐక్య భావంతో నివసించటానికి అనువైన మార్గం ఏమిటి? అనే ప్రశ్నలు నేటికీ మానవ మేధను వేధిస్తూనే ఉన్నాయి. ఇది నేటి ప్రపంచాన్ని ఎదుర్కొంటున్న జీవన్మరణ సమస్య.

నవంబరు 17 వ తేదీనుండి 19 వ తేదీవరకు ప్రశాంతి నిలయంలో - శ్రీసత్యసాయి సంస్థలు జరుపుకొంటున్న నాలుగవ ప్రపంచ సదస్సులో ప్రధాన చర్చనీయాంశంగా ఎన్నుకొన్న సమస్య "ప్రపంచ సమాజం - సమైక్య భావ ప్రతిపత్తి" (ఇంటెగ్రేషన్ ఆఫ్ వరల్డ్ కమ్యూనిటీ). ఈ సదస్సులో భారత దేశంతోపాటు దాదాపు డెబ్బైరెండు దేశాలనుండి వచ్చిన ప్రతినిధులు పాల్గొంటు న్నారు. శ్రీ సత్యసాయి సంస్థలు ప్రధానంగా ఆధ్యాత్మిక సాధనకు అంకితమైనవి కాని మత సంస్థలు కావు. ప్రపంచంలోని ప్రధాన మతాలకు సంబంధించిన వ్యక్తులు ఇందులో పాల్గొంటున్నారు. కాని వారి మతాలకూ, దేశాలకూ, ప్రతి నిధులుగా కాదు. మానవ సమాజంలో సమైక్యభావ సాధనోద్యమ సారథులుగా

సమావేశంలో పాల్గొంటున్నారు. మానవత ఎదుర్కొంటున్న ప్రధాన సమస్యను గురించి చర్చిస్తున్నారు.

మానవ జాతినంతా పరమాత్మస్వరూపంగా దర్శించే ప్రవృత్తితో సాధన సాగించేవి శ్రీ సత్యసాయి సంస్థలు. మానవులంతా దేవుని బిడ్డలనీ, దైవస్వరూపులనీ నమ్మి 'మనసా వాచా కర్మణా' ఆచరించే విధానాన్ని అనుసరించేవి. షికాగో నగరంలో జరిగిన ప్రపంచ మత ప్రతినిధుల మహాసభలో వివేకానంద స్వామి "సోదర సోదరీమణులారా!" అని సంబోధించి తన భాషణం మొదలు పెట్టినప్పుడు సభాసదులందరూ కరతాళ ధ్వనులతో ఆనందోత్సాహాలను ప్రకటించారు. నరనారీమణులందరూ సోదరసోదరీమణులనే భావం ఆధ్యాత్మికమైనది. సోదరీ సోదరులకు ఒక తల్లి ఉండాలి. ఆ మాతృస్థానమే దైవం. అది ఆధ్యాత్మిక భావానికి మూలం. తల్లి బిడ్డలు ఒక కుటుంబంలో నివసించినట్లు దైవ మందిరమైన ప్రపంచంలో ప్రేమతో జీవించాలనే సందేశం అందులో ఉన్నది. మాటలో కంటే మనసులో ప్రతిఫలించే సంస్కారం విశ్వమానవ కుటుంబ భావం. దాన్ని ఆధ్యాత్మిక ప్రవృత్తితోనే సాధించటానికి వీలౌతుందని శ్రీ సత్యసాయి సంస్థల ఆశయం.

ఆధునిక ప్రపంచ మానవ సమాజంలో ఈ సమైక్య భావ సంస్కారాన్ని పెంపొందించే మార్గాలను క్రొత్తగా అన్వేషించటానికి కాదు ఈ సదస్సు సమావేశమవుతున్నది. ఇదివరకే ఈ సంస్థల కార్యక్రమాల రూపంగా అభివ్యక్తమవుతున్న ఈ సమైక్య భావాన్ని మరింత స్పష్టంగా మానవాళికి తెలియచెప్పే విధానాలనూ, మరింత విస్తృతంగా మానవ సమాజంలో వ్యాప్తి చేయటానికి తోడ్పడే పద్ధతులనూ, సాటి మానవ జగత్తుకు స్వీయ వర్తనంతో శాంతి సౌమనస్యాల సత్ఫలితాలను పంచిపెట్టటానికి ఉపకరించే పథకాలనూ రూపొందించుకోవటానికి ఈ సదస్సు సమావేశమవుతున్నది.

శ్రీ సత్యసాయి సంస్థల కార్యక్రమాలలో మౌలికంగా ప్రపంచ సమాజంలోని సమైక్యతా ప్రతిపత్తి వ్యక్తీకరించే అంశాలను కొన్నింటిని ముందు పరిశీలిద్దాం.

1. మానవ జీవితానికి అర్థాన్ని, సార్థక్యాన్ని కలిగించేవి మానవత్వపు విలువలు. వీటి సంరక్షణమే మానవ సమాజ సముద్ధరణం. సంరక్షణమంటే ఆచరించి అమలులో పెట్టటం.

2. మానవత్వపు విలువలు మానవుడు నైతికంగా తనను తాను సముద్ధరించుకోవటానికి తోడ్పడే వ్యక్తిత్వంలోని శక్తులు. అవి లెక్కకు పెక్కులున్నా ముఖ్యమైనవి అయిదు. మిగిలినవన్నీ ఈ అయిదింటిలో గతార్థాలవుతాయి. అవి— సత్యం, ధర్మం, శాంతి, ప్రేమ, అహింస అనేవి. ఇవి మనిషికీ, సమాజానికీ పంచప్రాణాల్లాంటివి.

3. మానవునిలో ఉండే దైవత్వాన్ని నిత్య సత్యంగా గుర్తించే విలువ సత్యం. మానవుని దేవునిగా భావించి సేవించే నిస్వార్థ సేవాతత్పరత ధర్మం. శాంతి అంటే వివిధ సంస్కృతుల సహజీవనంలో సాధించే సమభావంలో నుండి సముద్భవించే మానసిక శాంతి. స్వార్థ రహిత భావంతో, సర్వజీవ సమప్రవృత్తితో విశ్వకల్యాణాన్ని ఉద్దేశించి సాధన మార్గంలో ప్రసరించే శ్రేయః కామన ప్రేమ. ఇది మానవునిలోని దివ్యత్వాన్ని ప్రకాశింపజేసే ప్రజ్ఞాన దీపం. త్రికరణ శుద్ధితో సర్వలోక హిత భావంతో ప్రసరించే మనః ప్రవృత్తి అహింస. ఈ అయిదు విలువలకు అంకితమయినాయి శ్రీ సత్యసాయి సంస్థలు.

4. విలువలు జీవితంలో ఆచరణయోగ్యాలుగా మార్చటానికి వాహికలుగా కార్యక్రమాలు రూపొందింపబడతాయి. ముఖ్యంగా విద్య, వైద్య, సేవా, ధ్యాన భక్తి జ్ఞాన మార్గాలు శ్రీ సత్యసాయి సంస్థలు ఏర్పరుచుకొన్నాయి.

5. "విద్యాఫలం శీలం" అన్నది విద్యా కార్యాక్రమాల లక్ష్యం. వీటిలో బాలవికాస్, మానవాభ్యుదయ శిక్షణ, మేధా వికసనంతోపాటు హృదయ పరిపాకాన్ని కూడా అందించే ఉన్నత విద్యా బోధన, మానవ వ్యక్తిత్వ సమగ్ర వికాస శిక్షణ మొదలైనవి ముఖ్యమైనవి. విద్యా కార్యక్రమాలలోని ముఖ్య విశేషం లౌకికపారమార్థిక జీవిత సత్యాల ఏకీభావం. శ్రీ సత్యసాయి విద్యా విధానాన్ని ఆదర్శంగా పెట్టుకొని విశ్వ విద్యాలయం ప్రశాంతి నిలయంలో వెలసింది. దాని లక్ష్యాన్ని వివరిస్తూ భగవాన్ బాబా ఇలా అన్నారు—

"ఈ విశ్వ విద్యాలయము కేవలము వృక్ష శాస్త్రమును బోధించటమే కాదు, దీనికి జీవిత వృక్షాన్ని కూడా అతికిస్తున్నాము. దీనిలో అర్థిక శాస్త్రమును బోధించటమే కాదు, ఆస్తిక శాస్త్రమును కూడా బోధిస్తాము. దీనిలో రసాయనిక శాస్త్రము మాత్రమే కాదు 'రసో వైసః' అనే ఆత్మ రసమును కూడా అందిస్తాము. పదార్థ శాస్త్రమే కాదు పరార్థ శాస్త్రమును కూడ దీనిలో ప్రవేశ పెడుతున్నాము. భౌతికమునకు, ఆధ్యాత్మికమునకు, పదార్థమునకు, పరార్థమునకు, ఏ విధమైన ఎడబాటు లేకుండా ఏకీభావమును, అవినాభావ సంబంధమును ఈ ప్రత్యేక విశ్వ విద్యాలయము నందు బోధించుటకు పూనుకొంటున్నాము."

(ఆంధ్రప్రభ; 17-11-1985)

# 2

శ్రీ సత్యసాయి ప్రణాళిక లక్ష్యాలను గురించి డాక్టర్ కె. వి. గోకాక్‌గారు ఈ విధంగా పేర్కొన్నారు. 1. విద్యార్థులు ఉత్తమ వ్యక్తులుగా, ఆదర్శ కుటుంబ జీవులుగా, ఉత్తమ పౌరులుగా మాతృదేశానికీ, మానవతకూ సంబంధించిన ధర్మాలను బాధ్యతాయుతంగా నిర్వర్తించే వ్యక్తులుగా తయారు కావటానికి తగిన సుస్థిర సాంస్కృతిక ప్రవృత్తిని సమకూర్చటం, 2. విద్యార్థుల వ్యక్తిగత, ఆధ్యాత్మిక సాధనకు ప్రోత్సాహం కలిగించి అంతరాత్మ ప్రజ్ఞాన జాగృతిని దోహదం చేయటం, 3. ఉత్తమ శీలాన్ని, ఉత్తమమైన నడవడికను పెంపొందింపజేసి స్వార్థరహిత సేవాభావంతో సమాజసేవకు విద్యార్థులు అంకితమయ్యేట్లు ప్రేరణ కల్పించటం, 4. అంతరాత్మ ప్రబోధంతో కూడుకొన్న మేధాశక్తిని పెంపొందింప చేయటం, దానికి అనువుగా బహుముఖీనమైన విజ్ఞానాన్ని సమన్వయ దృక్పథంతో అధ్యయనం చేసే అవకాశాన్ని కలిగించటం, సర్వధర్మ సమన్వయాన్నీ, సర్వశాస్త్ర తాత్పర్య దృష్టినీ, సర్వకళా సంఘటిత పరిజ్ఞానాన్నీ విద్యార్థులకందించటం ఒక విధంగా ఆధ్యాత్మ విద్యా విధానం" అన్న గీతాసూక్తికి ఆధునిక సాధన శ్రీ సత్యసాయి విద్యా విధానం.

ప్రపంచ జీవనసరళిలో, ఆలోచనపద్ధతిలో, ఆచరణ విధానంలో మార్పు రావాలంటే విద్యా విధానంలోనే మార్పు రావాలి. ఈ అంశాన్ని ప్రపంచ దేశాలు గుర్తించి విద్యా విజ్ఞానంతో పాటు వివేకాన్నీ, శీలాన్నీ విద్యార్థుల

కందించే ప్రణాళికలను సిద్ధం చేసుకోవలసిన అవసరాన్ని బోధించే ప్రయోగమే శ్రీ సత్యసాయి విశ్వవిద్యాలయం.

విశ్వవిద్యాలయ విద్యార్థుల కందించే ఉన్నత విద్యకు ప్రాతిపదిక ప్రాథమిక విద్య. అందులో విషయ పరిజ్ఞానంతో పాటు విలువల వివేచనం కూడా చోటుచేసుకోవాలి. అప్పుడే విద్యార్థి వ్యక్తిత్వ సమగ్ర వికాసానికి పునాదులు గట్టిగా వేయబడతాయి. ఇందుకుగాను శ్రీ సత్యసాయి సంస్థలు మాన వాభ్యుదయ శిక్షణను 'ఎడ్యుకేషన్ ఇన్ హ్యూమన్ వాల్యూస్' చేపట్టి నిర్వహి స్తున్నది. విద్యకు మూడంచుల ప్రయోజనమున్నదని కొఠారి కమీషన్ పేర్కొ న్నది. ఒకటి-విజ్ఞానప్రదానం, రెండు-విద్యార్థులలో సహజంగా ఉండే నైపుణ్యా లను పెంపొందించటం, మూడు-సముచితమైన ఆసక్తులనూ, వృత్తులనూ, విలువ లనూ విద్యార్థులలో నెలకొనేటట్లు చేయటం. వీటిలో చివరిదైనా మూడవ అంశా నికి ప్రాధాన్యత నీయాలి. కాని, ఆపని నేటి మన విద్యావిధానంలో జరగటం లేదు. వెంటనే దానిని చేపట్టాలి. అప్పుడు సత్యం విద్యార్థిలో మేధను పదును పెడుతుంది. ధర్మం సంకల్పశక్తికి తర్ఫీదునిస్తుంది. శాంతి హృదయ పరి పాకాన్ని పరిపోషిస్తుంది. ప్రేమ 'ఆత్మవత్ సర్వభూతాని' అన్న అనుభ వాన్ని ప్రసాదిస్తుంది. అహింస విశ్వశ్రేయస్సును కాంక్షించి జీవించే ప్రవృత్తిని అలవరుస్తుంది. విద్యార్థి ముందు 'మనిషిగా పరిపూర్ణతను' సాధిస్తూ మనిషిగా రూపొందాలి. "మనం ఒక నాగరకతను నిర్మించు కొంటున్నాం. అది కర్మాగారం కాదు. వర్క్‌షాప్ కాదు. నాగరకత యొక్క నాణ్యత భౌతిక వస్తు సంభారంవల్లగానీ, రాజకీయ యంత్రాంగంవల్లగానీ ఏర్పడదు. మానవుల శీలసంపదమీద ఆధారపడి ఉంటుంది. విద్య యొక్క ప్రధాన కర్తవ్యం ఉత్తమ శీలాన్ని పెంపొందించటం" అని నిర్దేశించింది రాధాకృష్ణ కమీషన్. బాలల వ్యక్తిత్వం ఆదర్శవంతంగా తీర్చిదిద్దబడితే భవిష్య త్తులో సమాజం శాంతి సౌమనస్యాలతో మనుగడ సాగించటానికి అనువైన వాతావరణం ఏర్పడుతుందని శ్రీ సత్యసాయి సంస్థల ఉద్యమం.

విలువలకు ప్రాధాన్యమిచ్చే విద్యావిధానంలోని ప్రాముఖ్యతను భారత దేశంతోపాటు ప్రపంచ దేశాలు కూడా గుర్తిస్తున్నాయి. శ్రీ సత్యసాయి విద్యా విధానంలోని మానవాభ్యుదయ శిక్షణను ఐరోపా ఖండంలోని కొన్ని దేశాలు, అమెరికా సంయుక్త రాష్ట్రాలు ప్రామాణిక విద్యావిధానంగా గుర్తించాయి. మన

దేశంలో 18 రాష్ట్రాలు తమ విద్యాబోధన కార్యక్రమాలలో భాగంగా గ్రహించాయి. ప్రైవేటు, ప్రభుత్వ, మునిసిపల్ కార్పొరేషన్ పాఠశాలలు ఈ శిక్షణను నిర్దేశించిన పాఠ్యాంశాలతో సంఘటితంగా బోధించే పద్ధతిలో అమలు జరుపుతున్నాయి. అధ్యాపకులకు ఈ శిక్షణకు సంబంధించిన ట్రైనింగు దఫాల వారీగా ఇవ్వటం జరుగుతున్నది. ప్రభుత్వ యంత్రాంగం విలువగల శిక్షణను అమలు జరపటంలో సముచిత సమన్వయ పాత్రను శ్రీ సత్యసాయి సంస్థలు వివిధ రాష్ట్రాలలో, వివిధ దేశాలలో ఎలా సమర్థవంతంగా నిర్వహించటానికి వీలుందో విస్తృతంగా ఆలోచించి ఒక కార్యక్రమాన్ని రూపొందించుకోవటం ప్రపంచ సదస్సు తలపెట్టిన ముఖ్యాంశం. సముచిత విద్యావిధానం ద్వారా విశ్వశాంతిని సాధించటం శ్రీ సత్యసాయి సంస్థల ఆశయం.

ప్రపంచ సమాజంలో సమైక్య భావన సాధనకు మొదట కావలసింది మానవ సంస్కారం. అది విద్యవలన సాధింపబడాలి. విలువల నెరిగిన విద్యచే వెలుగొందే పౌరుడు ప్రపంచ సంస్కృతులలోని ఏకత్వాన్ని, విభిన్న మతాలలోని మానవత్వపు విలువలనీ, వివిధ వ్యవస్థలలోని శ్రేయఃకామననూ సమత్వ బుద్ధితో సాధించి, జీవితంలో ఆచరణలో పెట్టటానికి సమర్థుడవుతాడు సమాజ సమైక్యతావృక్షానికి మానవవ్యక్తిత్వం మూలం. దానిని విలువలబలంతో పెంచితే శాంతి ఫలాలను కాస్తుంది.

విద్య సమాజ సేవకై మానవుణ్ణి ప్రేరేపించినప్పుడే సార్థకమవుతుంది. శ్రీ సత్యసాయి సేవా సంస్థలు సేవయే దైవారాధనంగా భావించి సమాజ సేవకు అంకితమయ్యాయి వైద్యం ద్వారా విజ్ఞాన ప్రయోగాలను ప్రజలకు ఆరోగ్య ఫల రూపంగా అందించే యత్నం చేస్తున్నవి. మానవసేవ ద్వారా దీన జనులకు శాంతి సౌఖ్యాలను సమకూర్చటానికి యత్నిస్తున్నవి. ధ్యానం ద్వారా హృదయంలోని మాలిన్యాన్ని తొలగించుకోవటానికీ, భక్తి ద్వారా మానవునిలో దివ్యత్వాన్ని ఆరాధించటానికీ, జ్ఞానంద్వారా ప్రపంచ సమాజంలో విరాట్పురుషుని దర్శించటానికీ శ్రీ సత్యసాయి సంస్థలు కార్యక్రమాలను రూపొందించుకొన్నవి. సమ సమాజ భావనం, విశ్వ సౌభ్రాతృత్వ సాధనం, విశ్వకుటుంబ భావం భౌతిక స్థాయిని ఆశ్రయించిన దానికంటె ఆధ్యాత్మిక సాధన నాశ్రయించి సాధించటానికి వీలుపడుతుందని శ్రీ సత్యసాయి సంస్థలు కృషిచేస్తున్నవి.

"దేశమంటే మట్టి కాదోయ్ - దేశమంటే మనుషులోయ్" అన్న గురజాడ సూక్తిని మరికొంత పొడిగించి "ప్రపంచమంటే ప్రభుత్వాలు కావోయ్-ప్రపంచ మంటే ప్రజలేనోయ్"—''సమాజమంటే సమూహం కాదోయ్ సమాజం విలువల సాధనలేనోయ్'' అని భావించే తరుణం వచ్చింది. భగవాన్ బాబా ఇచ్చిన పిలుపు ఈ సదస్సుకు కీలక సూత్రం. "మీ సంస్థ ఇతర సంస్థల కంటె భిన్నముగా నుండవలెను. ప్రేమ ఆధారంగా దానిని స్థాపించండి. వాసుదేవస్సర్వమిదం. సర్వం వాసుదేవమయం. అందరూ భగవత్స్వరూపులే. అందరూ గౌరవనీయులే అను ప్రేమ విశ్వాసములతో సత్యసాయి సంస్థలు సేవలుచేస్తే, అసూయ, ద్వేషము, అహంకారము మీ సమితిని మలినపరచవు. మానవుడు సంచార దేవా లయం లాంటివాడు. అందుచే భగవద్విశ్వాసము మానవునిపై విశ్వాసమును కుదుటుకొనునట్లు చేయును. సమాజంనుంచి మనం ఎన్నో పుచ్చుకుంటున్నాం. మనం సమాజానికి తిరిగి ఏం చేస్తున్నాం... మన జీవితానికి సమాజక్షేమమే ప్రాణం. మానవునియందున్న మానవత్వాన్ని గుర్తించలేని వ్యక్తులం మాధవుని యందున్న మానవత్వాన్ని ఎట్లు గుర్తించగలం? మనసేవ యావత్ ప్రపంచము నంతటినీ ఏకత్వముగా రూపొందించే సంబంధ బాంధవ్యమును ఏర్పరచుతుంది.

ప్రపంచమొక పూలదండ. పూలరంగులు వేరైనా వాసన ఆస్వాదనీయమైనది. సువాసన మానవత్వపు విలువల వివేచన. సేవాసూత్రం ఆ దండను ముడివేసే మూలసూత్రం. సూత్రంలోని ప్రతి దైవత్వం. భౌతిక జీవితంలో మానవత్వపు విలువల పరిరక్షణం ద్వారా వివిధ మానవప్రవృత్తుల మధ్య సమైక్య భావాన్ని పెంపొందించి విశ్వకుటుంబ లక్ష్యాన్ని సేవాధర్మాన్ని ఆశ్రయించి సాధించటం శ్రీసత్యసాయి సంస్థల గమ్యం - అవిచేసే ప్రస్థానంలో ఈసదస్సు ఒక మైలు రాయి.

(ఆంధ్రప్రభ: 18-11-1985)

# నాలుగు గుణాలు – పది సూత్రాలు

ప్రశాంతి నిలయంలో ప్రపంచ సదస్సు ముగిసింది. ప్రపంచ సమాజ సమైక్య భావానికి మానవత్వపు విలువల సదాచరణమే మహోన్నీయ మార్గమని ఏకకంఠంతో సభ్యులందరూ నిర్ణయించారు. సదస్సులో సభ్యులు చేసిన ఉపన్యాసాలన్నీ ఒక యెత్తు, భగవాన్ బాబా సదస్సు నుద్దేశించి, ప్రజా సమూహాన్ని ఉద్దేశించి చేసిన ప్రబోధలు మరో యెత్తు. విలువలలోకెల్ల అత్యుత్తమమైన విలువయైన ప్రేమ యొక్క శక్తిని గురించి బాబా తమ ప్రబోధాలన్నింటిలో వివరించారు. ప్రేమహృదయం సేవను సాధనంగా సాగించి దివ్యత్వాన్ని అందుకోగలుగుతుందనీ, ప్రేమకంటే మరో దైవం లేదనీ బాబా నొక్కి వక్కాణించారు.

భగవాన్ బాబా ప్రబోధల సారాంశాన్ని క్రోడీకరించుకొంటే ఈ క్రింది అంశాలు స్పష్టమవుతాయి. మానవ వ్యక్తిత్వ భావన నిర్మాణానికి నాలుగు గుణాలు బలమైన స్తంభాలుగా నిలువబడాలి. అవి 1. దాతృత్వం (చారిటీ) 2. పవిత్రత్వం (ప్యూరిటీ) 3. ఏకత్వం (యూనిటీ) 4. దివ్యత్వం (డివినిటీ).

దాతృత్వం మానవునిలోని స్వార్థపరత్వాన్నీ, పర పీడన పరాయణత్వాన్నీ సమయింపజేసే గుణం; వ్యక్తి సమాజసేవకు అంకితం కావటానికి ప్రేరణ కల్పించే శక్తిమంతమైన అంతశ్చైతన్యం; స్వార్థాన్ని వదిలి పరార్థంలో ప్రవేశించటమే మానవ జీవిత గమ్యం. పరార్థం ప్రేమను పెంపొందిస్తుంది. "ఇతరులను నీవు ప్రేమించు. దేవుడు నిన్ను ప్రేమిస్తాడు". దానంలో దాత, గ్రహీత, దానం అనే మూడంశాలుంటాయి. ఈ మూడింటిలో భిన్నత్వాన్ని అధిగమించి ఏకత్వాన్ని సాధించటమే దాతృత్వ గుణ సాధన. దానం మానవునిలోని అహంకారాన్ని అణగద్రొక్కుతుంది. భిన్నత్వాన్ని రూపుమాపుతుంది. విశ్వమానవ సౌభ్రాతృత్వాన్ని పెంపొందిస్తుంది. సర్వజీవులలో దైవత్వాన్ని దర్శించే మానసిక పరిపక్వతను కలిగిస్తుంది. స్వార్థం దానవ లక్షణం. దాతృత్వం దైవ

లక్షణం. మానవ వ్యక్తిత్వంలో దైవశక్తిని మేల్కొల్పే శక్తి దాతృత్వంలో ఉంది. అందువలన మానవ సమాజం సమైక్య భావంతో సమున్మేషించాలంటే దాతృత్వం తల్లివేరులా తోడ్పడుతుంది

రెండవ గుణం పవిత్రతత్వం. మానవుడు చేసే పనికంటె దాని వెనుక ఉన్న సంకల్పం ముఖ్యం. సంకల్పం మనస్సులోనుండి పుడుతుంది. మనో నైర్మల్యం సర్వ కర్మలకూ ప్రమాణం. మానవుడు సమాజ వికాసానికి మహనీయ సాధనంగా వెలుగొందాలంటే అతని మనస్సు, అతని వాక్కులు, అతని చేష్టలు పవిత్రములై ఉండాలి. మనసు, వాక్కులో ప్రవర్తనలో ప్రతిబింబిస్తుంది. త్రికరణ శుద్ధియే పవిత్ర భావం. పవిత్రత ప్రతిఫలాన్ని ఆశించదు. సూర్యరస్మిలా ప్రకాశించటమే దాని స్వభావం. పావిత్ర్యం ఉత్తమ శీలానికి ఉజ్జ్వల పరివేషం. శీలవంతుడైన మానవుడే తనవ్యక్తిత్వాన్నీ, సమాజము యొక్క అస్తిత్వాన్నీ రక్షించుకో గలడు. దాతృత్వంలో అంకురించిన మానవత్వం పావిత్ర్యంతో వికసిస్తుంది. వ్యక్తిత్వ వికాసానికి పవిత్రతత్వం ప్రాణం వంటిది.

పవిత్రమైన మనస్సు ప్రపంచ సమాజంలోని భిన్నత్వంలో ఏకత్వాన్ని దర్శించి అనుభవింప గలుగుతుంది. జాతి, మత, వర్గ భేదాదులను విస్మరించి సమసమాజ నిర్మాణం చేయగలిగిన సాత్త్విక తేజం, సమైక్య భావనం. అదియే దైవత్వాన్ని అనుభవించటానికి శక్తిమంతమైన సాధనం. భిన్న నామ రూపాలతో భాసించే దైవం ఒకడే నని తెలుసుకోవటం - ఏకత్వం. అదియే దివ్యత్వం. దివ్యత్వాన్ని అనుభవించటమే మానవ వ్యక్తిత్వ వికాసానికి ఫలం.

వృద్ధులు గతాన్ని నెమరు వేసుకుంటారు. యువకులు భవిష్యత్తును గురించి కలలు కంటూ ఉంటారు. కాని, ఇరువురూ వర్తమానాన్ని విస్మరింప కూడదు. వర్తమానాన్ని పవిత్రంగా మలచుకోవటమే ప్రపంచ మానవ కర్తవ్యం. ఇది సేవా మార్గం వల్లనే సాధ్యమవుతుంది. సేవ ద్వారా దైవత్వం, దాని ద్వారా అనంతత్వం, దాని ద్వారా ఆనందం పొందటం మానవ జీవిత పరమార్థం. మానవుడు దాతృత్వంతో సేవలో ప్రవేశిస్తాడు. పావిత్ర్యంతో సేవను నిర్వహిస్తాడు. ఏకత్వంతో దానిని వినియోగిస్తాడు. చివరకు దివ్య

త్వాన్ని దర్శించి అనుభవిస్తాడు. మానవునిలో మన్నికను వచ్చేవి గుణాలే. ''గుణాః పూజాస్థానం, గుణిషు నచ లింగః నచ వయః'' గుణసమగ్రుడైన మానవుడు స్వీయవ్యక్తిత్వాన్ని మానవ సమాజ వికాసానికి అంకితం చేయగలడు. గుణమే మానవ గణానికి శరణ్యం!

మానవ సమాజం స్వీయ వ్యక్తిత్వ వికాసాన్ని సాధించటానికి పది సూత్రాలను అమలుజరిపే యత్నం చేయాలని భగవాన్ బాబా సూచించారు. ఒకవిధంగా ఈ పది సూత్రాలూ ఆధునిక మానవునికి బాబా ఇచ్చిన "టెన్ కమాండ్‌మెంట్స్''గా భావించ వచ్చు. వారు పేర్కొన్న పదిసూత్రాలూ ఇవి—

1. "జననీ జన్మభూమిశ్చ, స్వర్గాదపి గరీయసి'' అనే దేశాభిమానం.
2. సర్వమతాల పట్ల సమగౌరవం, సమభావం.
3. 'మానవ జాతి అంతా ఒకటే' — అను విశ్వమానవ సోదర భావం.
4. పరిసర పారిశుద్ధ్య పరిపోషణం.
5. పేదలకు సముచిత సౌకర్యాలను కల్పించటం ద్వారా బిచ్చమెత్తుకునే స్వభావాన్ని జనులలో తగ్గించటం.
6. లంచగొండి తనాన్ని నిర్మూలించటం (లంచం ఇచ్చుకోవటాన్ని, పుచ్చుకోవటాన్ని మానివేయటం)
7. సమాజంలో జాతి మత భేదాలను పాటించకుండా ఉండటం.
8. ఎవరిపనివారు చేసికొంటూ స్వయంసేవాభావాన్ని పెంపొందించుకోవటం.
9. దైవప్రీతిని, పాపభీతిని అలవరచుకోవటం.
10. ప్రభుత్వాలు ఏర్పరచిన చట్టాలను, నియమనిబంధనలను ఉల్లంఘించకుండా కర్తవ్యపాలన చేయడం.

ఈ సూత్రాలు సత్ప్రవర్తన నియమావళిగా పైకి కనిపించినా ప్రపంచ మానవ సమైక్యతకు సాధనా ప్రణాళికగా లోనారసి చూస్తే గోచరిస్తుంది. దేశాభిమానం దేశీయ దురభిమానం కాదు. ఒక దేశంలోని ప్రజలు ఒక జీవనవిధానానికి అలవడి ఉంటారు. అందులోనూ, వివిధ రాష్ట్రాలవారు దేశసమైక్యభావంతో నివసించటం నాగరక సమాజ లక్షణం. దేశ సమైక్య దృష్టిని కలిగించేదే

దేశాభిమానం. దేశ సమైక్య భావం విశ్వ మానవ భావానికి మూలం సర్వ మత సమభావం విశ్వ కుటుంబ భావనకు సాధనం. దానిని ఆచరణలో పెట్టే కార్యసూత్రం విశ్వమానవ సౌభ్రాతృత్వం. విశ్వమానవ సోదర భావానికి వేరు పురుగులుగా నిలిచి, లౌకిక జీవిత వ్యవస్థను పీడించేవి అనారోగ్యం, ఆర్థిక అసమానత్వం, లంచగొండితనం వంటి అవినీతి, పరపీడన పరాయణత్వం. వీటిని క్రమంగా పరిసర పారిశుద్ధ్య పరిపోషణ ద్వారా, బీదలకు ఉచిత సౌకర్యాలను కల్పించటం ద్వారా, లంచగొండితనం నిర్మూలించటం ద్వారా సాధించవచ్చునని బాబా సూచన.

జాతి మత భేద దృష్టి మానవ సమాజంలోని సమైక్యతకు గొడ్డలిపెట్టు. దానిని అధిగమించటం ద్వారా మానవుడు సహనం, సంస్కృతి, విశ్వకుటుంబ భావనం పెంపొందించుకోగలడు పాపభీతి మానవునిలో సత్త్వవర్తనను సంరక్షిస్తుంది. దైవ ప్రీతి మానవునిలోని సత్కార్యశక్తిని పరిపోషిస్తుంది. విశ్వ మానవ శాంతి జీవనానికి ఈ రెండూ శ్వాసకోశాల వంటివి. పాపభీతి ఉత్తమ శీలాన్ని నిర్మిస్తుంది. దైవప్రీతి నిష్కామకర్మయోగాన్ని అలవరుస్తుంది. ఈ రెండూ డ్యూటీ, డివోషన్ అనే ప్రవృత్తులను మానవునిలో పెంపొందింప జేస్తాయి. ప్రజా ప్రభుత్వాలు ఏర్పరచిన చట్టాలను ఉల్లంఘించకుండా కర్తవ్య పాలనం చేయటం వలన ప్రజలలో ఉత్తమ పౌరలక్షణాలతో కూడిన డిసిప్లిన్ ఏర్పడుతుంది. డ్యూటీని డిసిప్లిన్‌తో నిర్వహిస్తే ఫలితార్థంగా డివోషన్ ఏర్పడుతుంది. డివోషన్ డివినిటీని అందిస్తుంది. దివ్యత్వమే ప్రపంచ సమాజంలోని సమైక్య సూత్రం. అదే ఈ పది సూత్రాలలో వ్యాపించి ఉన్న సమన్వయ సూత్రం కూడా.

మానవ సమాజం ఆర్థికంగానూ, ఆధ్యాత్మికంగానూ అభివృద్ధి చెందినప్పుడే సంఘ వ్యక్తిత్వం పరిపూర్ణ వికాసాన్ని సాధిస్తుంది. అవధులు మీరిన ఆర్థిక సంపద మానవుని అనర్థానికి మూలమవుతుంది. అత్యాశ అనర్థదాయకం. అవసరానికి మించిన ఆర్థిక ప్రతిపత్తి దోపిడీ విధానానికి దారితీస్తుంది. దానివలన అశాంతి జనిస్తుంది. దీనిని నివారించాలంటే మానవులు తమ ఆశలను కొంత వరకు అదుపులో పెట్టుకోవటమే అనువైన మార్గం. ఆశలు అదుపుఅయితే ఆర్థిక

సంపద పొదుపు అవుతుంది. పొదుపుచేసికొన్న ప్రపణ్యంతో మానవులు దాతృత్వ గుణాన్ని సాధించి సమాజ సేవకు అంకితమయ్యే అవకాశం ఏర్పడుతుంది. పవిత్రతత్వం, ఏకత్వం, దివ్యత్వం అనే గుణాలు దాతృత్వం వెంట **తరలి వస్తాయి.**

దాతృత్వం వలన ధర్మం. పవిత్రతత్వం వలన సత్యం, ఏకత్వం వలన శాంతి, దివ్యత్వం వలన ప్రేమ, ఈ నాలిగింటిని త్రికరణ శుద్ధితో ఆచరించటం వలన అహింస - అనే మానవత్వపు విలువలు ప్రపంచ సమాజంలో పరిపోషింప బడతాయి మానవాళికి బాబా ఇచ్చిన సందేశం—"మీరందరూ ప్రేమయే దైవ మని తెలుసుకోండి. నేటి ప్రపంచం తన సమైక్యతను సంరక్షించు కోవాలంటే విలువలలోకెల్ల విలువైన ప్రేమను అలవరచుకోవాలి ప్రేమయే ఆలోచనలో ప్రతిఫలించి సత్యంగానూ, చర్యలో ప్రతిబింబించి ధర్మంగానూ, అవగాహనలో శాంతిగానూ, భావంలో అహింసగానూ, అనుభవానికి అందుతుంది. మానవు లందరూ ఈ అమూల్యమైన స్వార్థరహితమైన విశ్వజనీనమైన ప్రేమను పంచు కొనండి. దైనందినిక జీవితంలో ఆచరించటం ద్వారా దానిని అభివృద్ధి పరుచు కోండి".

ఇది ఆధునిక మానవ సమాజానికి అభినవ శాంతిసూక్తం, అపూర్వ ప్రేమభాష్యం!

(ఆంధ్రప్రభ; 1-12-1985)

# ఆరు పదుల ఆరుద్ర

ఆరుద్ర షష్టి పూర్త్యుత్సవాలు 'ఆంధ్రావళి మోదముంబొరయునట్లుగ' జరగటం అభినందనీయం. ఆరుద్ర సాహితీ వ్యక్తిత్వం కవులనూ, పండితులనూ, విమర్శకులనూ, పరిశోధకులనూ, కళాకారులనూ, చరిత్రకారులనూ, సహృదయులనూ సమంగా సమాదరించే సౌజన్యమూర్తి.

ఆరుద్ర రచనల్లో సమగ్రాంధ్ర సాహిత్యచరిత్ర రచనదే అగ్రతాంబూలం అనడంలో ఔచిత్యం ఉంది. తెలుగులో ఆంధ్రసాహిత్యచరిత్ర రచనకు అంకురారోపణం చేసింది గురజాడ రామమూర్తిగారి 'కవి జీవితములు'. ఆ గ్రంథం 1875 ప్రాంతంలో సకలవిద్యాభివర్ధిని మొదలైన పత్రికలలో ప్రచురింపబడటం మొదలైంది. ఆరుద్ర సమగ్రాంధ్రసాహిత్యం మొదటి సంపుటం 1965 లో ప్రచురింపబడింది. వీరేశలింగం పంతులుగారి 'ఆంధ్రకవుల చరిత్ర' వివేకవర్ధని, చింతామణి పత్రికలలో 1886 లో ప్రచురితమైంది. ఆరుద్ర షష్టిపూర్త్యుత్సవం 1985 లో జరుగుతున్నది. ఈ చారిత్రక సత్యాలను సమీక్షిస్తే కవి జీవిత రచన వెలువడిన తొంభై సంవత్సరాలకు ఆరుద్ర సాహిత్య చరిత్ర రచనం మొదలయింది. కవుల చరిత్ర రచన మొదలైన నూరేళ్ళకు ఆరుద్రకు షష్టిపూర్తి జరుగుతున్నది. కాబట్టి ఆరుద్ర షష్టిపూర్త్యుత్సవాలు సాహిత్య చరిత్ర రచనకు శతాబ్ద్యుత్సవాలుగా కూడా పరిగణించే ప్రశస్తి కలిసొచ్చిందన్నమాట! ఆంధ్రావళి పొందే ఆనందానికి ఇది కూడా ఆమ్రేడితం కాదగిన అంశం!

ఆధునికంగా వెలువడిన సాహిత్య చరిత్రలలో ఆరుద్రగారి 'సమగ్రాంధ్ర సాహిత్యం' (12 సంపుటాలు) విస్తృతమైనది. యుగవిభాగంలో రాజకీయ చరిత్ర దృక్పథానికి ప్రాధాన్యం ఇవ్వటం, ఒక్కొక్క యుగంలో సాహిత్య పరిణామానికి చోదకశక్తులుగా అమరిన రాజకీయ, సాంఘిక, మత, వాఙ్మయ పరిస్థితులను సమన్వయాత్మకంగా చిత్రించటం, తెలుగులో ఇంతవరకు కవులను, వారి రచనలను గురించి జరిగిన పరిశోధనలనూ, వెలువడిన విమర్శలనూ విస్తారంగా అధ్యయనం చేసి, సమన్వయ దృక్పథంతో నూత్నాంశాలను ప్రతిపాదించటం, చరిత్రను కథామాధుర్యంతో నింపి సామాన్య పఠితలకు కూడా

చవులూరించేటట్లు ఆవిష్కరించటం, పరిశోధన ఫలితాంశాలను పట్టికలుగా సమర్పించటం, పరిశోధన ఇంకా జరుగవలసిన అంశాలను సూచించటం, అనుశీలనాత్మకతులనాత్మకవిమర్శలను సాహిత్యపర్యాలోచనలో మేళవించి సాహిత్యానుశీలనం సాగించటం, క్రొత్త ఆకరాలను సేకరించి చరిత్రరచనకు క్రొత్త చేవను కల్పించటం - మొదలైన విశేషాలు ఆరుద్ర రచనను సర్వజనామోదంగా తీర్చిదిద్దాయి. సాహిత్యరచనాపద్ధతిలో తనమార్గంలో కళాపూర్ణు డనిపించుకున్నాడు ఆరుద్ర.

ప్రయోగవాదిగా పేరొందిన ఆరుద్ర సాహిత్య చరిత్ర రచనను కూడా ఒక ప్రయోగంగా నిర్వహించాడు. అప్పుడప్పుడూ, కనీసం శతాబ్ది కొకసారైనా, గతాన్ని సమీక్షించి, వర్తమానాన్ని వివేచించి, సాహిత్య భవిష్యత్తుకు ఒక సమగ్ర అవగాహనను అందించే విమర్శకు డావిర్భవించటం అభిలషణీయ మనీ, అతని వ్యవసాయం నవ్య ఫల సాయానికి దారి తీస్తుందనీ టి. యస్. ఎలియట్ అన్నాడు. ఆ మాట సాహిత్య చరిత్ర రచనా వ్యవసాయంలో ఆరుద్ర పట్ల కొంతవరకు అన్వర్థ మౌతుంది.

నాలుగవ సంపుటానికి పీఠిక వ్రాస్తూ మల్లాది రామకృష్ణ శాస్త్రి గారు అన్నమాట లివి - "యీ రచయిత చిరంజీవి శ్రీ ఆరుద్ర ఈ తరానికి వారసుడే అయినా - అటునుంచి సంక్రమించినది - పుణ్యంకొద్దీ-లవలేశం లేకపోవటంతో, పుట్టెడు ఓపికతో, సత్యానికే గద్దె ఇచ్చి - తాను భావనాలోలుపుడైనా ఊహాగానం ఉజ్జగించి, తీరికగా ఏరుకొన్న పొగడపూలతోనే మాలకట్టినాడు; ఇయ్యది విద్యావినోదులు ధరించ పరువైనది." చరిత్ర రచయిత సత్యనిష్ఠను గుర్తించిన ప్రశంస యిది.

సాహిత్య చరిత్ర రచనలో ఆరుద్ర ఆశయం - సమగ్రత. తనకు ముందున్న, తనముందున్న రచనలనన్నీ స్వీయదృక్పథంతో సమన్వయించటం. "సమగ్రత ఆశయం. దాన్ని సంపాదించటానికి ఇదీ యత్నం.... ఈ అమూల్య రచనల నన్నింటినీ నా దృక్పథంతో సమన్వయం చేయటానికి ఇందులో యత్నిస్తున్నాను" అన్నాడు ఆరుద్ర ముందు మాటలో. ప్రచురమైన పథంలో నడుస్తూనే తనదైన దృక్పథాన్ని సారించటం ఆరుద్ర ప్రత్యేకత. సాహిత్య చరిత్ర రచనలో ఈ ప్రత్యేకత ఆ ప్రయోగానికి ఇచ్చింది నవ్యత.

సమగ్రాంధ్ర సాహిత్య రచననుగురించిన రాళ్ళపల్లివారి ప్రశంస గుణానికి గీటురాయి. "శ్రీ ఆరుద్రగారి ఈ సమగ్రాంధ్ర సాహిత్యం అపూర్వమైన, అసా

ధారణమైన రచన. ప్రయత్నం గొప్పదా, ఫలసిద్ధి గొప్పదా అని ఆశ్చర్య పడవలసిన పెద్ద పనితనం...సద్దు లేకుండా ఎన్నేండ్లు గానో ఈ పరిశోధన ప్రయాస సాగుతూ వుండవలెను. లేకపోతే ఈ సిద్ధి ఇంత సార్వభౌమంగా రూపొందదు" (8 వ సంపుటి). అందుకు ఆరుద్రను అభినందించ కుండా ఉండలేము.

ఒక ప్రయోగం ఎంత విశిష్టంగా ఉన్నా అందులోనూ కొన్ని వెలుతులు, లొసుగులు ఉండవచ్చు. వాటిని పరిశీలించిన తరువాత ఆ ప్రక్రియలో మరింత నిర్దుష్టమైన ప్రయోగం రావలసిన అవసరం ఉన్నదని కూడా స్పష్టం కావచ్చు. సాహిత్య చరిత్ర రచనలో ఆరుద్రది అసాధారణ ప్రయోగమైనా ఆదర్శ ప్రయోగం కాదని విమర్శకులు భావించటం ఉంది. ఆరుద్ర ఈ రచనలో సాధించాలనుకొన్న సమగ్రత సాపేక్షమని అంటారు గిడుగు సీతాపతిగారు (5 వ సంపుటం). 'సమగ్ర శబ్దము సాపేక్షము. ఒకదృష్టిలో చూచినయెడల ఎంత విపులముగా రచించినా ఏదిన్నీ సమగ్రము కాజాలదు. పదమూడు (పదునాలుగు?) సంపుటములలో ఎంతవరకు సాధ్యము కాగలదో అంతవరకు సమగ్రంగానే వీరీ సాహిత్య చరిత్ర రచించినారని నా అభిప్రాయం-"అని వారంటే, అసలీచరిత్ర రచనా ప్రణాళికయే సముచితంగా లేదని నేలటూరి వెంకటరమణయ్య గారు భావించారు.

"మొట్ట మొదట ఆయనప్లాను నాకు నచ్చలేదు. యుగవిభజన బహు విడ్డూరంగా ఉంది. ఆరుద్రగారి యుగవిభజనం తెనాలి రామకృష్ణుని చిత్ర లేఖనంవలె వికటంగా కనపడుతుం"దంటారు తొమ్మిదవసంపుటి పీఠికలో. ఇంత వరకూ వచ్చిన సాహిత్యచరిత్రలలో ఆరుద్రరచన సమగ్రమని చెప్పటంలో అనుమానమేదీ లేదు. అయితే, ఆయన ప్రణాళిక - ముందున్న వాటికంటె కొంత మెరుగని నిస్సంశయంగా చెప్పుకొన్నా, సామంజస్యం కొరవడిందనటంలో సత్యం లేకపోలేదు. దానికి కారణం - రచనాపద్ధతిలో, వ్యక్తీకరణవైఖరిలో, సంవిధాన విధానంలో చూపినంత వైశిష్ట్యం యుగవిభజన పద్ధతిలో ప్రవర్తింపలేకపోవటం. సాహిత్య చరిత్ర, కవితా ప్రయోగధోరణులకు ప్రాధాన్యమిచ్చే పద్ధతిలో సాగితే మరింత బాగుండేది. 'కవిత్వవేది' రచించిన వాఙ్మయ చరిత్ర సంగ్రహం ఆ మార్గంలో ఒక అణిముత్తెం. ఒక్కొక్క సంపుటానికి ఒక్కొక్క పేరు ప్రత్యేకంగా పెట్టాలని చేసుకొన్న స్వయంకృత నియమం ఆరుద్రను ఈ రాజకీయ విభాగంతో రాజీపడేటట్లు చేసిందేమో! ఏమైనా "ఈ సంపుటాలు చదివాక ఎటు

వంటి సామాన్య పాఠకుడికైనా సమగ్ర ఆంధ్ర సాహిత్యంతో సన్నిహిత సంబంధం ఏర్పడాలని మా ఉద్దేశ్యం-" అన్న ప్రచురణకర్తల ఆశయం నెర వేరిందీ ప్రయోగం ద్వారా.

ఆరుద్ర చేసిన ఈ ప్రయోగం అందరికీ అందుబాటులో ఉండేదైనా సాహిత్య చరిత్ర రచనావిధానంలో ఆధునికమైనదని చెప్పలేము. ప్రక్రియా వికాస చరిత్రయే సాహిత్య చరిత్ర రచనలో ఉత్తమ పద్ధతిగా ఆధునికులు భావి స్తున్నారు. ఇంతవరకూ రచింపబడిన ఆంధ్ర సాహిత్య చరిత్రలన్నీ కాలక్రమ పద్ధతిలో కవుంచరిత్రలుగా వ్రాయబడినవే అందువలననే అవి యుగ విభజనం మీద ఆధారపడి, చారిత్రిక పద్ధతి ననుసరించి వెలువడ్డాయి. కాని, సాహిత్య వ్యక్తిత్వాన్ని వెలార్చే ప్రక్రియల పట్టు పూర్వోత్తరాలనూ, పరిణామాలనూ, ప్రభావాలనూ, ప్రయోగ విశేషాలనూ పరిశీలించే పరిశోధనలు వెలువడినప్పుడు, సాహిత్య చరిత్ర స్థితిగతిని కాక, పరిణామగతిని కార్యకారణ బద్ధంగా నిరూ పింపగలుగుతుంది. చరిత్రలో సవిమర్శక చారిత్రికాధ్యయనం ప్రతిబింబించాలి. చరిత్రతత్వం వ్యక్తీకరింపబడాలి. ఈ రెండింటినీ సాధించటానికి ప్రక్రియాపర మైన అధ్యయనం ఉపయోగపడుతుంది. "The history of Genres is indubietably one of the most promising areas for the study of literay history" అన్న రెనెవెలెక్, ఆస్టిన్ వారెన్‌ల అభి ప్రాయం గమనింపదగింది ఆరుద్ర రచన తన కర్తవ్యాన్ని పూర్తి చేస్తూ, మన కర్తవ్యాన్ని జ్ఞాపకం చేస్తున్నది. సాహిత్య చరిత్ర వేయవలసిన ముందడుగును సూచించే పతాకస్థానంగా, సాహిత్య చరిత్ర ఇంతవరకూ సాగించిన అభ్యు దయానికి ఆదర్శకేంద్రంగా ఆరుద్ర సమగ్రాంధ్ర సాహిత్యం ఆంధ్ర సాహితీ జగత్తులో నిలుస్తుంది.

మిగిలిన రెండు సంపుటాలూ రావాలి. ఆధునిక సాహిత్య వికాసాన్ని గురించిన ఆరుద్ర దృక్పథం తెలియాలి. వ్రాస్తానని మాట యిచ్చిన 'తెలుగువారి చరిత్ర' వారి కలం నుండి వెలుగు వాకలా ప్రవహించాలి. జీవనదికున్న చైతన్యం, జలపాతానికున్న సాహసం ఆరుద్రలో అమరివున్నాయి. ఆయన ప్రవ హించగలడు, ప్రాజెక్ట్ నిర్మించగలడు. అరుపదుల ఆరుద్ర మరెన్నో సాహిత్యపు ప్రాజెక్టులకు పునాదులు వేసే ప్రారంభోత్సవం ఆయనకు ఆంధ్రులు చేసే షష్టి పూర్త్యుత్సవం !

(ఆంధ్రప్రభ, 23-11-1985)

# ఉత్పలవారి ఉక్తిచమత్కృతి

మహాకవి స్వర్గీయ గడియారం వేంకట శేషశాస్త్రి అవార్డు ఈ సంవత్సరం శ్రీ ఉత్పల సత్యనారాయణాచార్యులు రచించిన శతరూప కావ్యానికి వచ్చింది. ఈ పోటీని నిర్వహించిన 'రచన - సాహిత్యవేదిక' కడపలో నవంబర్ 10 వ తేదీన ప్రదాన సభను ఏర్పాటుచేసి, కవికి అవార్డును అందజేసింది. ఈ అవార్డు ఉత్తమ పద్యరచనకే దక్కుతుంది.

సన్నజాజి పూలూ, దాసినచెక్క, ఏలకులూ, పచ్చకర్పూరం- ఈ కోవకు చెందుదుంది ఉత్పలవారి కవిత. పరిమాణంకంటె పరిమళం ఎక్కువ ఈ జాతికి. ఉత్పలవారి పద్యం చదివితే ఒక ఒడుపుతో కూడిన కలకూజితంలా వినవస్తుంది. రచనలో ఒకసౌకుమార్యంతో కూడిన చమత్కారం లాస్యం చేస్తున్నట్లుగా తోస్తుంది. ఉత్పలకు చమత్కార చంద్రికయే కావ్యప్రకాశిక. "ఆయన వాక్కునం దమిత చమత్కార మిమిడియున్నది. చమత్కారము లేని పద్యమే లేదేమో అనవచ్చును. కొన్ని చమత్కారాలు మింటినంటుకొనుచున్నవి-" అని విశ్వనాథగారి ప్రశంస.

ఉత్పలవారి కవితకు ఊపిరి పోసేది ఉక్తిచమత్కృతి."న హి చమత్కార విరహితస్య కవేః కవిత్వం, కావ్యస్య వా కావ్యత్వమ్" అంటాడు క్షేమేంద్రుడు. "వాగర్థౌ స చమత్కారౌ కావ్యం కావ్యవిదో విదుః"అంటాడు విశ్వేశ్వరుడు.అతడే కావ్యాలను మూడురకాలుగా పేర్కొంటూ శబ్దసౌందర్య రచనగలది చమత్కారి అనీ, వాచ్యార్థంతో గానీ, గుణీభూతవ్యంగ్యంతో గానీ అందమైనది చమత్కారి తరమనీ, వ్యంగ్యచారుత్వంతో కూడినది చమత్కారితమమనీ వివేచించాడు ఉత్పలవారి కవితలో శబ్దచారుత్వం అర్థచారుత్వానికి పోషకంగా ఉంటుంది. వాచ్యచారుత్వం వ్యంగ్యచారుత్వానికి సాధకంగా ఉంటుంది. దీనినే భంగ్యంతరంగా ఉక్తిచమత్కృతి అంటున్నాం. ఉక్తి అంటే రసవత్ వాగ్వ్యక్తి. చమత్కారమంటే విస్మయంలాగా సహృదయుల చిత్తవికాసాన్ని కలిగించే శక్తి. "ఏకేన కేనచిదనర్ఘమణి ప్రభేణ, కావ్యం చమత్కృతిపదేన వినా సువర్ణం" అని క్షేమేంద్రు డన్నట్లు రత్నకాంతిచేత బంగారంలాగానే చమత్కారంచేత కవిత్వం ప్రకాశిస్తుంది. ఉత్పలవారి ఉక్తిచమత్కృతి వర్ణ్యవస్తువును మనోనేత్రం ముందు

లాస్యం చేయిస్తుంది; వ్యంగ్యార్థ వైభవంతో పఠితల చిత్తాలను వికసింప చేస్తుంది. చమత్కారానికి చిత్తవికాసాన్ని కలిగించే విశేషగుణం ఉన్నా, చిత్తాన్ని ద్రవింప చేసే స్నిగ్ధగుణం కొంతవరకు గౌణంగానే ఉంటుంది. అందువల్లనే ఉత్పలవారి రచన తొలకరి మబ్బులాగా మెరుస్తూ పూలవాన కురిపిస్తుంది. జడివాన మబ్బుల జలదరింపు వేరు; తొలకరి మబ్బుల తొంగలింపు వేరు.

ఉత్పలవారికి ఉచిత శబ్ద ప్రయోగం మీద శ్రద్ధ మెండు. దానివలన శబ్ద చారుత్వం కవితకు సిద్ధిస్తుంది.

> "పద్యమందు దగిన పదము వేయక యున్న
> కవికి కలుగునట్టి కష్టమెంతొ
> దైవమునకు నీయదగినది ఈ కున్న
> భక్తుడొందునట్టి బాధ యంత."

అన్న సత్యాన్ని తెలుసుకొన్న కవి ఉత్పల. సముచిత శబ్దాన్ని సన్నివేశ చారుత్వ పోషకంగా అర్థవంతంగా వాడటం రసజ్ఞుడైన కవి చేసేపని. దాన్ని చమత్కార బంధురంగా చిత్రింప దలచుకున్న కవి శబ్దాన్ని శ్లేషచేత సుందర తరం చేస్తాడు. ఉత్పలలో ఈ చమత్కారం ఉంది. శతరూప కావ్యంలో నాయిక నాయకుని చూడాలని తహతహపడుతూ ఉంటుంది. కాని, జడివాన రోజులు. ఆ ముసురును ముగించుమని ఆ మగువ వరుణదేవుణ్ణి కోరుకొంటుంది.

> "మొదలుపెట్టిన కార్యంబు తుదికి రాదు
> జాడ్య మిది పోదు - మిత్రదర్శనము కాదు
> దీర్ఘ వర్షంబు నుడిపి దుర్దినము గడిపి
> వరుణ దేవ! నాయెడ శుభావహుడ వగుము."

ఇందులో ప్రకృతం వాచ్యం. శ్లేషలో స్ఫురించే రెండవ అర్థం కూడా ప్రకృతమే. ఇందులో వాచ్యం, శ్లేషలో స్ఫురించే రెండవ అర్థం కూడా ప్రకృతమే. ఒకటి బహిఃప్రకృతిని ప్రత్యక్షీకరిస్తుంది. మరొకటి అంతః ప్రకృతిని వ్యంజింపచేస్తుంది. వాచ్య చారుత్వం వ్యంగ్య చారుత్వానికి వాహిక కావటానికి చమత్కృతి ఈ పద్యంలో నిబంధింప బడింది. అందువలన ఇది చమత్కారతర కావ్యంగా అనిపిస్తుంది. కాని, ఉత్పలవారు ఇటువంటి చమత్కారం కంటె వ్యంగ్యార్థ చమత్కారాన్నే ఎక్కువగా మక్కువగా పోషిస్తారు.

"ఆమె యపు డుల్కి యాకుంచితాంగి యయ్యె
అతని సంభ్రమోద్రేక భాషితము వినియొ
చెంతనే యున్న వ్రతతీలతాంతముపయి
గండు తుమ్మెద చేయు నాగడము కనియొ"

ఇందులో గండు తుమ్మెద ప్రసక్తి సందేహాలంకార స్ఫూర్తిని కలిగిస్తుంది. సామ్యచారుత్వం వలన నాయికా నాయక భావాలు వ్యంగ్య సుందరాలుగా ప్రతీయమానా లౌతున్నవి. ఇక్కడ అర్థాలంకారం చమత్కృతికి తోడ్పడింది. ఉత్పలవారి రచనలో ఇటువంటి రచన బహుళం. నిరలంకారంగా వ్యంగ్య చారుత్వాన్ని వ్యక్తీకరించే ప్రతిభనుకూడా ఉత్పల అక్కడక్కడా ప్రదర్శిస్తాడు.

"పడతి యించుకేని బదులు పలుకలేదు
కనులు క్రిందికి మరి దించుకొనిన దంతె,
వల్కలాంచలము మరింత వక్షమందు
చక్కపరచుకొన్నది మరుక్షణమునందు"

ఈ పద్యంలో ముద్దకట్టిన వ్యంగ్యశక్తిఉంది. మేలిమి బంగారం వంటిది. కాని, చమత్కార శిల్పి ఆ బంగారంమీద ఒక రత్నాన్ని తాపితే కాని సంతోష పడడు. ఉత్పలవారికి అటువంటి ఉత్సాహం ఉగ్గుతో వచ్చిన గుణం.

ఉక్తి చమత్కార ప్రియులకు ఒక్కొక్క పద్యాన్నే ముక్తకంగా చిలికి పెట్టటంలో ఉండే ఆసక్తి ఒక కావ్యవస్తువును నిర్వహించటంలో అంతగా కన పడక పోవచ్చు. ఉత్పలవారికి కథలకంటె గాథలంటే ఇష్టం. ఒక్కొక్క పద్యాన్ని ఒక్కొక్క గాథగా చిత్రించే ఒడుపు ఆయనకు నైజం. ఈ గుణం ఆయనను కావ్యాలలో విస్తృతమైన వస్తువును స్వీకరింపకుండా చేసినట్లున్నది. "శరణాగతి" "తపతి" "కచదేవయాని" వంటి లఘు కావ్యాలు కూడా వస్తు ప్రధానాలు కావు. సన్నివేశ చిత్రణలు, సంవాద పద్య శిల్ప సంపుటాలు. 'ఈ జంట నగరాలు హేమంత శిశిరాలు' క్రీడాభిరామమంతటి వీథి. 'స్వప్నాల దుప్పటి' హాస్య వ్యంగ్య రచన. వీటిలో కూడా వస్తు నిర్వహణంకంటె సన్ని వేశ సంభాషణ వ్యంగ్య చిత్రణమే అగ్రతాంబూలాన్ని అందుకొంటుంది. వీటన్నింటికంటె వస్తుసూత్రానికి కట్టుబడిన కావ్యం 'శతరూప'! ఆదిమిథున ప్రణయం బీజస్థితినుండి ఫలప్రాప్తివాకా వ్రాసిన అయిదు సర్గల కావ్యం.

అయినా, అందులో కూడా కథకంటె మనోభావ పరిణామ వికాస వైచిత్రికే విశేష ప్రాముఖ్యం ఉంది. తొలి వలపుం తొలకరి జల్లులా సాగే ఈ కావ్యం పఠితలను పులకింప చేస్తుంది.

'శతరూప' కావ్యంలోని అయిదు సర్గలూ అయిదు ఋతువులలో నాయికా నాయకుల హృదయాలలో జరిగిన ప్రణయ పరిణామాన్ని చిత్రించాయి. కాల యవనికపై కథను నడిపే చమత్కారం ఇందులో ఉంది. సర్గారంభ పద్యంలో ఋతుకాల సూచనం వినిపిస్తుంది. ఉత్పలవారు కాలాన్ని, కాల ప్రభావాన్నీ విశిష్టంగా వర్ణిస్తూ కథా చమత్కారాన్ని పోషించారు. ఉదాహరణకు గ్రీష్మర్తు వర్ణనం-కాలవర్ణన చమత్కారం.

"దప్పిగొని మింటి తెరువరి ధరణి జలము
పూర్తిగా త్రాగి బరువెక్కి పోయినాడు
లాగజాలక యతని గుర్రాలు మంద
గాములయ్యె పగళ్ళు దీర్ఘమ్ములయ్యె"

పగటి కాలం పొడుగైన దనటానికి ఒక గాథను సృష్టించి చమత్కరించటం ఇందులోని కీలకం. ఊహ చేయటం ఒక యెత్తు, దానిని ఉక్తిచమత్కృతిగా ఆవిష్కరించటం మరొక యెత్తు. ఒకటి ప్రతిభ, మరొకటి కళ ! ఇందులో ఉత్పలవారు కళాపూర్ణులు.

"అట్టు నిట్టు పొర్లి రాయిద్ద రచ్చోట
పడతి తుదకు అతనిపైకి పడెను
ఎందుగాని తీవె ఎగబ్రాకు మ్రాకును
మ్రాకు తీవె మీద ప్రాకబోదు"

ఇది అర్థాంతరన్యాసాలంకారంకోసం వ్రాసింది కాదు. వసంతకాల ప్రభావం ధ్వనింపచేయటానికి. కవి కమనీయబంధవైచిత్రిని కల్పించటం, శృంగారం నుంచి హాస్యాన్ని పుట్టించటం ఇందులోని చమత్కారాలు. క్షేమేంద్రుడు చెప్పిన దశవిధ చమత్కారాలూ, విశ్వేశ్వరుడు చెప్పిన సప్తవిధ చమత్కారాలూ 'శత రూప'లో సమృద్ధిగా ఉన్నాయి. ఉత్పల కవిత 'చమత్కార శతరూప'.

(ఆంధ్రప్రభ; 12-12-1985.)

# ముంచక, పెంచేదే ప్రభావం

నరసాపురంలోని శ్రీ వై. యన్. కళాశాల వారు యు.జి.సి. సహాయంతో ఒక జాతీయ సదస్సును డిసెంబరు 6,7,8 తేదీలలో నిర్వహించారు. తెలుగు భాషా సాహిత్యాల మీద సంస్కృతం, కన్నడం, తమిళం, ఇంగ్లీషు మొదలైన భాషా సాహిత్యాల ప్రభావాన్ని పరిశీలించటం ఆ సదస్సును జరపటంలో గల ముఖ్యోద్దేశం. ఆ ప్రాంతంలోనున్న వివిధ కళాశాలలలోని ఆంధ్రోపన్యాసకులు సదస్సులో సభ్యులుగా పాల్గొన్నారు. ఆ యా అంశాలపై పరిశోధనలు చేసిన విద్వాంసులను రాష్ట్ర రాష్ట్రేతర ప్రాంతాలనుండి ఆహ్వానించి వారిచేత విలువైన పత్రాలను సమర్పింపజేశారునిర్వాహకులు. మొత్తానికి వివిధాంధ్ర సాహిత్య ప్రక్రియలమీద ప్రముఖంగా పడిన ఇతర భాషాసాహిత్యాల ప్రభావ స్వరూప స్వభావాలను గురించి సమాలోచనం సదస్సులో సాగింది. కళాశాల అధ్యాపకులకోసం అప్పుడప్పుడూ ఇటువంటి పునశ్చరణ సదస్సులను నిర్వహించటంవలన సారస్వతరంగంలో అత్యంత ఆధునికంగా వెలువడుతున్న ఆలోచనధోరణులతోనూ, ప్రయోగాలతోనూ, దృక్పథాలతోనూ, ప్రభావ వైఖరులతోనూ, సాహితీ వ్యక్తిత్వ వికాస వివేచనంతోనూ పరిచయం ఏర్పడి, విద్యార్థులకు ఆయా సాహిత్యాంశాలను బోధించేటప్పుడు నవీన దృక్పథాలను కూడా సంపదించుకొనటానికి వీలౌతుంది. గతంనుండి వర్తమానం సాధిస్తున్న విలువలను వివేచించి నిగ్గు తేల్చి చెప్పటానికి అవకాశం కలుగుతుంది. విద్యాబోధనలో ఈ అంశం సమర్థవంతమైన పాత్రను నిర్వహిస్తుంది. ఆ మూడు రోజుల సదస్సు అటువంటి అవగాహనను అధ్యాపకులకు కలిగించటానికి చేసిన సార్థకమైన ప్రయత్నం!

ఆ సదస్సులో ముఖ్యంగా చర్చింపబడిన అంశం ప్రభావంలో కనపడే తీరుతెన్నులు. ప్రభావ పరిశీలనంలో మీమాంసకు వచ్చే అంశాలు ప్రధానంగా అయిదు. 1. ప్రభావం వేసే భాషా సాహిత్యాలు 2. ప్రభావితమయ్యే భాషా సాహిత్యాలు 3. ప్రభావం పడటానికి దారితీసే పరిస్థితులు. 4. ప్రభావ స్వభావం 5. ప్రభావ ఫలితం. ప్రభావమనే పదానికి ఇంగ్లీషులో సమాంతరమైన పదం

'ఇన్‌ఫ్లుయన్స్'. దానికి శక్తి, బలం, ప్రవేశం, చొరవ, ప్రాజాపత్యం, ప్రేరకత్వం, ప్రోద్బలం, వ్యాపకత్వం, ప్రసరణం, వశ్యత, స్వాధీనం మొదలైన అర్థాల్లో ప్రయోగం వ్యవహారంలో ఉంది. క్రియగా దానికి ఏలుట, ప్రేరేపించుట, లోబడేటట్లు చేయుట, లోకువగునట్లు చేయుట, స్వాధీనమగునట్లు చేయుట, మొదలైన అర్థాలున్నాయి. ఒక భాషా సాహిత్యాలు మరొకభాషా సాహిత్యాల మీద ప్రభావం వేయటానికి మొదట ప్రభావం వేయగలిగిన శక్తి ప్రతిపత్తులను కలిగి ఉండాలి. ప్రభావితమయ్యే భాషా సాహిత్యాలు పరిణత భాషాసాహిత్యాల ప్రభావాన్ని పొందుతూ ఉంటాయి. అలా ప్రభావితం కావటానికి కొన్ని ముఖ్య కారణాలు కూడా కనపడతాయి. ఒక సాహిత్యం తన పరిణామంలో సృజనాత్మక తను కోల్పోయి వినూత్న ప్రక్రియలకోసం, అభివ్యక్తి విధానాలకోసం దర్శన ప్రతిపత్తికోసం, అంగలారుస్తున్నప్పుడు ప్రభావాన్ని ఆహ్వానిస్తుంది. అయితే ఆ ప్రభావం ఒక్కొక్కసారి ప్రభావితమయ్యే సాహిత్యానికున్న స్వీయ వ్యక్తిత్వాన్ని బట్టి ఆధారపడి ఉంటుంది. ఒక సాహిత్యం సాంస్కృతికంగా, సాహిత్య దర్శన పరంగా తనదైన దేశీయతను సంతరించుకొని ఉన్నప్పుడు అన్య సాహిత్యాల నుండి పొందే ప్రభావాన్ని వినూత్న ప్రక్రియలకు, అభివ్యక్తి విధానాలకు ప్రేరకశక్తిగానో, ప్రోద్బలక శక్తిగానో గ్రహిస్తుంది. స్వీయ దృక్పథం, అస్తిత్వం లేని సాహిత్యం పరప్రభావాలకు లొంగి వాటికి స్వాధీనమై వాటిచేత పాలింపబడుతూ ఉంటుంది. మొదటి ప్రభావం వలన సాహిత్యంలో వినూత్న సమన్వయాత్మక సృష్టి వెలువడుతుంది. రెండవ ప్రభావం వలన అనుకరణ శీలమైన సాహిత్య ప్రవృత్తి ప్రబలుతుంది. అందువలన మొదటిరకం ప్రభావమే ఉత్తమమైంది.

రిచర్డ్ ఎల్‌మన్ ప్రభావ స్వభావాన్ని పేర్కొంటూ ఇలా అన్నాడు : "రచయితలు పరస్పరం ఒకరిలోకి మరొకరు అలల్లా ప్రవహిస్తారు. అయితే పోటులో వచ్చే సముద్రతరంగాల వలె కాదు. మందమందంగా ముందుకు సాగే మందాకినీ తరంగాల్లాగా". ఒక్కొక్కసారి ఒక సాహిత్యంలో ఒక కళాభివ్యక్తికి పరిపూర్ణావిష్కృతి జరుగకుండా అసమగ్రంగానో, అసమర్థంగానో మిగిలిపోతే మరొక సాహిత్యంలో అది పరిపూర్ణతను, సమగ్రతనూ సాధించవచ్చు. ఇది కూడా ప్రభావంగానే పరిగణింపబడినా, ఉత్తమోత్తమం. నిజానికి సమర్థులైన రచయితలమీద పడిన ప్రభావమే ప్రభావం. అసమర్థులమీద పడిన ప్రభావం

అనుకరణగా చెలామణి అవుతుంది. టి.యస్. ఎలియట్ అన్న మాటలు ఇక్కడ స్మరణీయాలు - "ఒక కవి మరొక కవి నుండి భావాన్ని సంగ్రహించే విధానం లోనే ప్రభావ బలం బయట పడుతుంది. అపరిణతులైన కవులు అన్యుల భావాలను అనుకరిస్తారు; పరిణత కవులు సంగ్రహిస్తారు; కుకవులు తాము అనుకరించే అంశాలకు తమ అసమర్థతతో ఆకృతిని చెడగొట్టి, వికృతిని కల్పిస్తారు. సత్కవులు తాము సంగ్రహించిన అంశాలకు ఉత్తమ రూపాన్నిచ్చి వాటిని ఉజ్జ్వలం చేస్తారు. లేదా కనీసం అనుకరించి ప్రతిభను ప్రకటిస్తారు. సత్కవులెప్పుడూ తమ కాలానికి సుదూరంగా మారుమూల నున్న కవిని గానీ, జాతీయ భాషా కవుల భావాలను గానీ గ్రహిస్తారు. లేదా, వైవిధ్యంతో కూడిన అభిరుచులను సంగ్రహించి సంవదించు కొంటారు." ఈ దృష్టితో మన తెలుగు సాహిత్యంలో ప్రసిద్ధులమీద, ప్రసిద్ధ ప్రక్రియల మీద పడిన ప్రభావాన్ని అనుశీలించటం అవసరం. ఆ సదస్సు ఈ సత్యాన్ని గుర్తించింది.

ప్రభావ పరిశీలనాన్ని గురించి అన్నా బలాకియన్ "ఇన్‌ఫ్లుయన్స్ అండ్ ది లిటరరీ ఫార్చ్యూన్" అనే గ్రంథంలో ఇలా భావించటం జరిగింది. "ప్రభావం పడిన రచయితను గురించి ఆలోచించేటప్పుడు ప్రభావితం చేసిన సాహిత్య లక్షణాలతో పాటు, ప్రభావితుని వైలక్ష్యాలనూ, వ్యక్తిత్వ విశేషాలనూ ఒక్కొక్కసారి ప్రభావంనుండి విముక్తుడై స్వయంగా ఎదిగిన ఔన్నత్య శిఖరాలనూ సమీక్షించకపోతే అది ప్రభావ పరిశీలనమే కాదు."

ప్రభావ పరిశీలనంలో ఈ దృక్పథం సర్వత్రా సమాదరింపబడుతున్నది. కాబట్టి తెలుగు సాహిత్యం మీద ప్రక్రియలమీద పడిన వివిధ సాహిత్యాల ప్రభావాన్ని పరిశీలించే ప్రవృత్తి-ఆంధ్ర సాహిత్యం, ప్రభావ సహాయంతో, సాధించిన సృజనాత్మక వ్యక్తిత్వాలను అనుశీలించి ఆవిష్కరించాలని స్పష్టమవుతుంది.

కొంతమంది విమర్శకులు తెలుగు సాహిత్యంలో 'ఒరిజినాలిటీ' ఏముంది? నన్నయ నుండి వీరేశలింగం దాకా సంస్కృత ప్రభావం, అక్కడి నుండి నేటి దాకా ఇంగ్లీషు ప్రభావం - అని ప్రభావితమైన ఆంధ్ర సాహిత్యానికి వ్యక్తిత్వం లేనట్లుగా తేల్చివేస్తారు. ఇటువంటి అభిప్రాయం యువకుల్లో మరింత వ్యాపిస్తున్నది నేడు. ఈ దృక్పథంలోని దోషాన్ని నివారించాలంటే ప్రభావ పరిశీలనం

యొక్క విధానాన్ని గురించి, ప్రయోజనాన్ని గురించి సదవగాహన సాహితీ పరుల్లో మొదట ఏర్పరచాలి. ఆ ప్రయోజనం కోసం ఈ సదస్సు కృషి చేసిందనవచ్చు. ప్రభావితునిలో ప్రసుప్తంగా ఉన్న ప్రవృత్తిని ప్రబోధించి ప్రజ్వలింప చేయటమే ప్రభావ స్వభావం. ఆ ప్రభావం వ్యక్తి ప్రభావం కావచ్చు, సామూహిక ప్రభావం కావచ్చు, యుగచైతన్య ప్రభావం కావచ్చు, ప్రక్రియా వికాస ప్రభావం కావచ్చు, సిద్ధాంత దర్శన ప్రభావం కావచ్చు. వాటిలో కొన్ని వ్యవస్థలూ, మరికొన్ని అవస్థలూ కూడా ఉండవచ్చు. అవన్నీ సంస్కృతాంగ్లాది సాహిత్యాల నుండి మన కవులు తెలుగు సాహిత్యానికి తాము నిర్మింపదలచుకున్న విశిష్టవ్యక్తిత్వాలకు ప్రేరకాలుగా, పోషకాలుగా, ఎలా గ్రహించారన్నదే నిజమైన ప్రభావానుశీలనం. నన్నయపై వ్యాస కాళిదాసాదుల ప్రభావంతోపాటు కన్నడ రత్నత్రయ ప్రభావం కూడా ఉండవచ్చు. దానిని పరిశీలించేటప్పుడు నన్నయ మహాభారతేతిహాసాన్ని కావ్యేతిహాసంగా దిద్ది తీర్చటంలో కనపరిచిన 'ఒరిజినాలిటీ'కి ఉపకారకంగా అనుశీలించటం సముచితమన్నమాట. ఈ విధానం ప్రాచీన కవులకు మాత్రమే కాదు. భావకవులైనా, అభ్యుదయ కవులైనా, కథకులైనా, నవలాకర్తలైనా, విమర్శకులైనా అందరికీ వర్తిస్తుంది. రాయప్రోలు మీద పాశ్చాత్య ప్రభావం ఉంది కాని, ఆయన అమలిన శృంగార సిద్ధాంతం ఆయనదే. విశ్వనాథ మీద పాశ్చాత్య విమర్శ ప్రభావం ఉంది, కాని ఆయన అందించిన శిల్ప మార్గ ప్రస్థానం ఆయనదే. ప్రభావ పరిశీలనం వలన తెలుగు కవుల, రచయితల వ్యక్తిత్వాల విలువలకు, సృజనాత్మక శక్తులకు క్రొత్త సమన్వయాలు వెలువడాలి. ఆ విధమైన ఆలోచన సర్వత్రా సదస్సులో తెలుగు వెలుగులా ప్రకాశించింది.

సదస్సంతా ముగిసేసరికి సభ్యులు తాము నాణెమున కున్న ఒకవైపునే చూచాము కాని, రెండవవైపు కూడా చూడవలసిన అవసరమున్నదని భావించారు. అది 'ఆంధ్ర భాషా సాహిత్యాలు ఇతర భాషా సాహిత్యాల మీద వేసిన ప్రభావం'. ప్రభావితమైన మన సాహిత్యాని కెంత చరిత్ర ఉందో, 'లోనారసి చూస్తే' ప్రభావం వేసిన మన భాషా సాహిత్యాలకూ అంతటి చరిత్ర ఉన్నదన్న సత్యం వెలుగులోకి రావాలి. మనం ప్రవాహంలో కొట్టుకొనిపోతున్నవారం కాదు. ప్రవాహానికి ఎదురీదగలం కూడా అని నిరూపితం కావాలి.

(ఆంధ్రప్రభ; 21-12-1985)

# సంప్రదాయ వాదుల సమస్య

ప్రతి యుగంలోనూ సాహిత్యరంగంలో మూడు రకాల వ్యక్తులు కన పడుతూ ఉంటారు. వారు - సంప్రదాయ వాదులూ, ప్రయోగ వాదులూ, తిరుగుబాటు వాదులూ అని. వీరిలో తిరుగుబాటు వాదులు భావ విప్లవాన్ని భాషా విప్లవాన్ని, వాటి వెంట ప్రయోగ విప్లవాన్ని ముప్పేటలుగా తీసుకొని వస్తారు. ప్రయోగవాదులు సంప్రదాయంలో ఒక నవ్యతను ఆకృతిలో, అభివ్యక్తిలో,అనుభూతిలో ఆవిష్కరించే ప్రయత్నాలనుచేస్తారు. ఇక సంప్రదాయ వాదులు గతంలో గణుతికెక్కిన సాహితీ మర్యాదలను సమాదరించే ప్రవృత్తిని తమ రచనల ద్వారా వ్యక్తీకరిస్తుంటారు. ఈ ముగ్గురిలో సంప్రదాయవాదులు సాధారణంగా సృజనాత్మక ధోరణిని ప్రదర్శించిన దానికంటె వ్యాఖ్యాన వైఖరినీ అనుకరణ అనుసరణ ప్రవృత్తులనూ ఎక్కువగా వెలారుస్తూ ఉండటం గమ నింపదగిన విశేషం.

సంప్రదాయం అనే భావం ఒక్కొక్క యుగంలో ఒక్కొక్క అర్థంలో ప్రచారంలో ఉంటుంది. సమకాలీన సాహిత్య రంగంలో సంప్రదాయమంటే సృజనాత్మకతను కోల్పోయిన ప్రయోగమనీ, మార్పును సహించని విశ్వాస వలయమనీ, గతాన్ని మాత్రమే గౌరవించే సంకుచితదృక్పథ మనీ చెలామణి అవుతున్నది. సాహిత్య రంగంలో ఇటువంటి ప్రవృత్తి త్రయానికి ప్రతినిధులుగా నిలిచే వారు సంప్రదాయవాదులనీ, వారు అభ్యుదయ నిరోధకులనీ భావించటం పరిపాటిగా కనపడుతున్నది.సంప్రదాయవాదులు ఈ రకమైన సంభావనకు తాము తగినవారమని భావిస్తున్నారా? లేక తమకు కూడా సమకాలీన సాహిత్యరంగంలో సమర్థవంతమైన పాత్రను నిర్వహించే సత్తువగానీ, అస్తిత్వంగానీ ఉన్నదని నమ్ముతున్నారా? అన్నది విచారింప వలసిన అంశంగా ఉన్నది.

ఒక విధంగా నేటిసంప్రదాయ వాదులనూ, వారి సాహితీ వ్యవసాయాన్ని సమీక్షిస్తే రెండు మూడు అంశాలు స్పష్టమవుతాయి. అందులో ముఖ్యమైనది సంప్రదాయాన్ని ఆధునిక కాలాని కనుగుణంగా సమన్వయించే శక్తియుక్తులను

సంతరించుకునే యత్నం వారిలో సంఘటితంగా గోచరించటం లేదు. దీనివలన సంప్రదాయ వాదులందరూ ఛాందసులనే అపప్రథకు గురికావలసి వస్తున్నది. గత కాలంలో మహాకవులు కొన్ని ఉన్నతప్రమాణాలతో కూడుకొన్న సాహితీ సంప్రదాయాలను ప్రయోగాలలో ప్రపంచించిన మాట సత్యమే. అవి కల్పించిన విలువలు, నిర్మించిన వినూత్న రుచులు, సాధించిన ప్రయోగాలూ ఆయా కాలాలలో తమ తమ విశిష్ట ప్రయోజనాలను సాధించినమాటా నిజమే. అయినా ఒక్కొక్క మహాకవి తనకుముందున్న మహాకవి కంటె క్రొత్తదనాన్ని తీసుకొని రావటానికే యత్నించాడు. సాహితీ చరిత్రలో క్రొత్త చైతన్యాన్ని ప్రభవింప చేయాలనే కృషిచేశాడు. మార్పు కోసం యత్నించటమే మహాకవిగుణం. మార్పును కోరటమే సంప్రదాయ బలం. మార్పులో ప్రవహించే గతంలోని మంచి నవ్యచైతన్యాన్ని సృష్టించటమే సంప్రదాయ స్వభావం. నవ్యత ప్రయోగంగా ప్రసరిస్తుంది. ప్రయోగం సృజనాత్మకతను కోల్పోతే తిరుగుబాటు తప్పదు. తిరుగుబాటు వచ్చినప్పుడు గతాన్ని పూర్తిగా త్రోసిరాజని నవ్యతను సృష్టించుకొని అభ్యుదయ మార్గంలో కవులు సాహితీ ప్రస్థానాన్ని సాగించటం సహజం. ఇటువంటప్పుడు సంప్రదాయవాదుల భావాలు, ప్రయోగాలు కాలం తీరిన కంకాళాలుగా కనపడటం కూడా నైజం. అప్పుడు సంప్రదాయవాదుల కర్తవ్యం ఏమిటి? గతాన్ని వర్తమానానికి అనుగుణంగా మలచుకొనే శక్తియుక్తులను సంఘటితం చేసుకొనటం.

నేటి సంప్రదాయ వాదులలో ఈ సంఘటిత చైతన్యం మృగ్యంగా కనపడుతున్నది. సంప్రదాయవాదుల నందరినీ ఒకవేదికమీదకు తీసుకొని వచ్చామే అనుకోండి. వారిలో కనపడే మొదటి లక్షణం అనైక్యభావం. ఒక్కొక్క వ్యక్తి ఒకానొక మహాకవికి వ్యాఖ్యాతగానో, ఒకానొక సాహితీ ప్రవృత్తికి భాష్యకారునిగానో వ్యవహరించటం, సంప్రదాయ వాహికలను గురించి ఆధునికంగా వ్యాఖ్యానించే వారిపై అధిక్షేపాత్మకమైన విసురులను విసరటం, ఇతరులు చెప్పిన వాటిలో గుణాలను గ్రహించకుండానే వాటిని అవహేళనం చేయటం. అసలు ఒక్కొక్కసారి అభినవ దృక్పథాలను ఆహ్వానించటానికి బదులు తిరస్కరించటం, తాను చెప్పినదే వేదమనీ ప్రమాణమనీ ధిషణాహంకారాన్ని ప్రదర్శించటం మొదలైన గుణాలను మనం ప్రత్యక్షంగా గమనింప గలుగుతాం. సంప్రదాయ వాదుల్లో చాలామందిలో కాలం మారినా తమ దృక్పథాలలో మార్పు రాదనీ రాకూడదనీ భావించటం, సంప్రదాయాన్ని వ్యాఖ్యానించటం కంటె

మనం చేయగలిగిందేమీ లేదని గిరిగీచుకోవటం, వ్యాఖ్యానంలో కూడా క్రొత్త పద్ధతులను ప్రవేశ పెట్టడం సంప్రదాయ విరుద్ధమని భావించటం, అన్యభాషా ప్రభావాలను గుర్తించటం దోషంగా పరిగణించటం మొదలైన ఛాందస లక్షణాలు సామాన్యంగా కనపడుతూ ఉంటాయి. సంప్రదాయ వాదుల ఈ ధోరణి సంప్రదాయ మనే శబ్దానికే అపార్థాన్ని కలిగించే అవకాశాన్ని కలిగించిందని వారు గుర్తించలేక పోవటం ఒక్కొక్కసారి సాహితీపరులకు నిరాశ, నిస్పృహలను కలిగిస్తున్నది.

సంప్రదాయం ప్రవాహశీలమైన దన్న సత్యం సంప్రదాయ వాదులు విశ్వసించి నప్పుడు వారి వాదానికి అస్తిత్వం ఏర్పడుతుంది. నవ్య ప్రయోగాలు చేయగలిగే సృజనాత్మక శక్తి దాని కేర్పడుతుంది. పురాతన వస్తువులను తీసికొని పద్య కృతులను నిర్మించటమే సంప్రదాయమని కొందరి భావం. వస్తువును ఆధునిక కాలానికి అనుగుణంగా మలచుకొని సమకాలీన స్పృహను దానికి కల్పించాలన్న ప్రయోగ శీలం కొరవడితే అటువంటి కావ్యాలు అనుకరణ ప్రాయాలౌతాయి కాని, అనుసృజన రూపాలు కావు. పద్య రచనకు క్రొత్త నడకలు పోకడలు నూత్నాభివ్యక్తులు కల్పిస్తే నవ్యతను కల్పించినట్లవుతుంది. కాని, ప్రసిద్ధ మార్గంలో గతానుగతికంగా పద్యాన్ని నడిపితే కొట్టిన పిండినే మరలా దంచినట్లవుతుంది. భావ కవిత్వ యుగంలో పద్య కృతికి ఒక ప్రత్యేక ప్రయోగ ప్రతిపత్తి ఏర్పడింది కాని, ఆధునిక యుగంలో పద్య కృతి స్వతంత్ర శక్తిని ప్రదర్శించే ప్రజ్ఞను ప్రదర్శింపలేకపోతున్నది. అయితే, విశ్వనాథవంటి మహాకవులకీ సూత్రం పట్టక పోవచ్చు. నేడు సంప్రదాయవాది నూత్న ప్రయోగంలో తనదైన విశిష్ట ప్రతిభను ప్రదర్శించటం అరుదై పోయింది.

సంప్రదాయ వాదుల్లో కవులు, రచయితలు, విమర్శకులు, ప్రచారకులు, అభిమానులు — అని అయిదు రకాల సాహితీ వ్యవసాయకులు నేడు కనపడుతున్నారు. వీరందరిలో కొంతవరకు సంప్రదాయాన్ని ఆధునిక యుగానికి అనువుగా అన్వయిస్తున్నవారు విమర్శకులనే చెప్పవచ్చు. మిగిలినవారి కృషి వారికి అనుబంధంగా మాత్రమే పేర్కొనాలి. ఇలా కావటం చారిత్రకంగా కూడా సంభావ్యమే. ఎందువల్లనంటే-ఒక సంప్రదాయ ధార సృజనాత్మక ప్రక్రియలలో

క్రొత్తదనాన్ని సంతరించుకునే శక్తిని కోల్పోవటానికి ముఖ్యకారణం దానికి సంబంధించిన దార్శనికశక్తి జాతిలో కనుమరుగు కావటం. దార్శనిక శక్తిని జాతికి వివేచనాత్మకంగా అందించే సమర్థవంతమైన సాధనం సాహిత్య విమర్శ. దాని బాధ్యతను గుర్తించిన విమర్శకులు నేడు సంప్రదాయంలోని సృజనాత్మకతను వ్యక్తీకరించే తాత్త్విక చింతనను తమ రచనల ద్వారా అందించే ప్రయత్నం చేస్తున్నారు. అయితే, మరొక విచారకరమైన అంశం ఏమిటంటే - విమర్శ అందించే వివేచనను సంప్రదాయ వాదులైన కవులు గాని, రచయితలుగాని అవగాహన చేసికొని ఆధునిక ప్రక్రియల ద్వారా దానిని సాహితీ రంగంలో సాక్షాత్కరింప జేయటానికి ముందుకు రావటం లేదు. నేటి సంప్రదాయ కవులకు ఒక ప్రసిద్ధ ప్రక్రియను చూచి దానిని బింబ ప్రతిబింబ భావంతో పునర్నిర్మించే ఆసక్తి ఉన్నంతగా, వినూత్న ప్రక్రియను విశిష్ట వ్యక్తిత్వంతో నిర్మించే ప్రవృత్తి లేదనే చెప్పాలి. ఈ మాట సాధారణంగా అన్నమాట. ఒకరిద్దరు ఎప్పుడూ దీనికి భిన్నంగా ఉంటూనే ఉంటారు. ఇక ప్రచారకులు ప్రాచీన కావ్యగుణ కీర్తనపరాయణులుగా తమ కృషిని సాగిస్తున్నారు. కాని, సంప్రదాయం నవ్యావతారాన్ని ఎలా సంతరించుకొంటుందో వ్యాఖ్యానించలేక పోతున్నారు. అభిమానులు ప్రశంసించగలరే కాని, ప్రయోగ నవ్యతను దర్శింపలేరు.

ఈనాడు సంప్రదాయ వాదులు విమర్శ ప్రక్రియ ద్వారా సాధించిన దర్శన వివేకాన్ని అందుకొని, ప్రయోగ వైవిధ్యంతో కూడిన సృజనాత్మక సాహితీ సృష్టికి పూనుకోవాలి. జాతి జీవనంలో సజీవ స్రవంతిగా ప్రవహించే సంప్రదాయ ధారను ఆధునికమైన అభివ్యక్తితో ఆవిష్కరించాలి. దీని కొరకు సంఘటితమైన సాహితోద్యమం ప్రారంభం కావాలి. ఉద్యమ స్ఫూర్తి పొందని సంప్రదాయవాదుల వ్యక్తిగతమైన కృషి బూడిదలో పోసిన పన్నీరు కాక మానదేమో !

(ఆంధ్రప్రభ; 5-1-1986)

